ప్రథమ ముద్రణ : 500

వృషనామ సంవత్సరము
కార్తీక పూర్ణిమ
2001 సంవత్సరము
నవంబరు నెల

వెల : రు. 40-00



ముద్రణ :
అన్నపూర్ణ ఆర్టు ప్రింటర్సు
మాచవరం, విజయవాడ- 4.

ప్రతులకు :
పి. దుర్గారావు, యం.ఓ.యల్. (రిటైర్డ్ తెలుగు పండిట్)
పొనుగోటు పెద్దతండా, రాగడప పోస్టు,
(వయా) మిర్యాలగూడా, నల్గొండ జిల్లా 508 207.

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
బ్యాంకు స్ట్రీట్, విజ్ఞాన భవన్,
హైదరాబాదు-500001.



# సమర్పణ

సమాజంలో వున్న
వ్యభిచార నిర్మూలన కోసం
నిర్విరామంగా కృషిచేసిన
మహావ్యక్తి
కీ. శే. రఘుపతి వేంకటరత్నం నాయుడుగారికి
పుష్పాంజలులతో.

-రచయిత

# వినయ వాక్యం

'మహాపద్మం' అనే యీ నవల ఒక అముద్రిత గ్రంథం!

ఎన్నాళ్ళక్రిందటో రచించినది. ఈ నవలనే 'శోణపద్మం' అనే చిన్న నాటికగా ముందుగా ప్రచురింపబడినది. ఒకానొక ప్రముఖవ్యక్తి, మిత్రులు ఆ చిన్న నాటికను చదివి, ఆనందించి ఒక నవలగా వ్రాయమని ప్రేరణ చేయడం జరిగింది.

లలితగీతాలు, రామకృష్ణుల గురించి కొన్నిపాటలు రచించినా, వాల్మీకిరామాయణాన్ని రచించినా, నవలను నేనెప్పుడూ వ్రాయడం జరగ లేదు.

అయినప్పటికి ఆ ప్రముఖమిత్రుని ప్రేరేపణచే యీ నవల వ్రాయడం జరిగింది. కానీ ప్రచురించే ధైర్యం లేకపోయింది. ఈ రచన అట్లాగే వుండిపోయింది. కొన్నిభాగాలు శిధిలం కావడం జరిగింది. ఆ గ్రంథాన్ని ఈ మధ్యనే చూడడం తటస్థించింది. శిధిలమైన యీ గ్రంథం చూడఢం, మనసులో వేదనా తరంగాలు ప్రవహించడం జరిగింది. కొన్నిభాగాలు శిధిలమైనప్పటికీ కథావృత్తాంతమందు నాయకి మరణించినప్పటికీ నాయకుడు భార్య వియోగభారంతో వేదనాతరంగాలు చెందినా భార్య ప్రార్థనాభావంతో తెలిపిన సందేశానుసారం విని, జీవితాన్ని సేవారంగానికి అంకితం చేసుకోవడం జరుగుతుంది. ప్రధానంగా ఇందులోని కథావృత్తాంతము వ్యభిచార వృత్తిలోని నగ్నసత్యాలను తెలియపరచడం-నివారించడం వారి దుఃఖపూరిత జీవిత నగ్నసత్యాలను తెలియపరచడం.

నేటి సామాజిక జీవితంలో అనేక చెడుగులలో వ్యభిచార వృత్తి ఒకటి. దానిని రూపుమాపడానికి ఎంతోమంది సంఘసేవకులు, దేశభక్తులు కృషిచేశారు. అయినప్పటికి యీనాడుకూడ వేయిపాదాలతో వికృతనృత్యం చేస్తూవుంది. ఈ వృత్తిని, దురాచారాన్ని రూపుమాపడానికి కృషిచేసిన శ్రీ రఘుపతి వేంకటరత్నం నాయుడుగారికి ఈ నవల అంకితం చేయబడినది.

సహృదయులకు బాగున్నది అని అనిపిస్తే-ఒక దీపాన్ని మరొక దీపాన్ని వెలిగించినట్లుగా మరొక వ్యక్తిచేత యీ నవలను చదివించండి! పుస్తక సందేశాన్ని అందించండి! రెండు కన్నీటి బిందువులను రాల్చండి!

— రచయిత

# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణీ!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి వందనమిదె! ప్రియభారతి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణీ!
ఉన్నతహిమ గిరి శిఖరము లొప్పిన శుభ కల్యాణీ!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్యగేయ శిల్ప మంజులతర శివగాయని!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

# దేవతా వందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య! జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప! విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి!
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజ రుద్రామ్యల పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధసేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

లలితకళానందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞానభాండ మధుర సుధా కలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీ దుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

# మహాపద్మం

**అనూరాధా** నక్షత్రంతోబాటు అప్పుడే బహుళ పంచమి చంద్రుడు
దయింపబోతున్నాడు. అది ఫాల్గుణమాసం, కృష్ణపక్షం. ఆకాశంలో
రలు విరజల్లిన ముత్యాలవలె తళతళ మెరుస్తున్నాయి. రాత్రి పది
ంటలు దాటింది. అంతకుముందు వర్షం వచ్చి వెలిసింది కాబట్టి రోడ్లన్నీ
ర్మానుష్యంగా వున్నాయి. ఆ రోజు విద్యుచ్ఛక్తి లోపం వలన వీధులు
ంధకార బంధురంగా వున్నాయి. కార్లు, రిక్షాలు అప్పుడప్పుడూ తమ
యానులతో పయనిస్తున్నాయి.

ఆ సమయంలో పదునారేళ్ళ ప్రాయం గలిగిన ఒక యువతి శర
గంతో పయనిస్తూ వుంది. శరీరమంతా నల్లని వస్త్రంతో కప్పుకుంది.
మె ఏదో ఆపదలో వున్నట్లు ఆమె నడక చెబుతూ వుంది. ఆమె భూమి
ద అడుగులు వేస్తున్నదేగాని తేలిపోతున్నట్లు కనబడుతున్నది, ఆమె
ప్పుకున్న వస్త్రం చాటున చంద్రబింబంలాంటి ఆమె ముఖము, ఎఱ్ఱని
దాలు మాత్రం కనిపిస్తున్నవి. ఆమె ఎటూ చూడకుండా చెంగుచెంగున
డుగులు వేస్తూ వున్నది. ఆమె నడకలో భయమే గాకుండా ఒక విధమైన
హసం గూడా వ్యక్తమవుతూ వుంది.

వెనుకనుండి కొందరు ఆమెను తరుముకుంటూ వస్తున్నారేమోనని
నిపిస్తున్నది. అవును! అయిదారుగురు రౌడీలు చాలా దూరంలో పరుగెత్తు
ంటూ వస్తున్నారు. ఆమె మరింత వేగంగా నడుస్తూ ఒక సందు మలుపు
రిగింది. ఆ సందు తిన్నగా వుంది. ఎంత దూరంలో వున్నా మనిషి కని

పించేటట్లుగా వుంది. సందు మాటుమణిగి వుంది. అందరూ భోజనాలు చేసి నిద్రిస్తున్నట్లున్నారు. ఆమె వెనుకకు తిరిగి చూచింది. ఆ రౌడీలు తనకు దాపుగా వస్తున్నట్లు గ్రహించింది. వెంటనే ఏదోక ఒక ఇంటిలో ప్రవేశించి తనను కాపాడుకోదలుచుకుంది.

ప్రక్కనే వున్న ఒక ఇంటిలో దీప కాంతి కనిపిస్తూ వున్నది. ఆ ఇంటికి కిటికీనుండి మబ్బువెలుతురు బయటికి ప్రసరిస్తూ వున్నది. కిటికీ దగ్గరకు వచ్చి ఆమె తొంగిచూచింది. ఒక యువకుడు కుర్చీలో కూర్చొని చదువుకుంటున్నాడు. అతని మేజాబల్లమీద అనేక పుస్తకాలు వున్నాయి. కొన్ని పుస్తకాలు తెరచి వున్నాయి. అతడు ఒక పుస్తకంలో చూచి ఏదో అత్యంతాసక్తితో వ్రాసుకుంటున్నట్లు చూచింది.

వెంటనే తలుపు దగ్గరకొచ్చింది. తన సుకుమారమైన పిడికిలితో తలుపు తట్టింది. మళ్ళీ తట్టింది.

ఆ శబ్దాన్ని విని లోపలి వ్యక్తి ఉలికిపడి లేచాడు. ఈ అర్ధరాత్రి వేళ తలుపు తట్టింది ఎవరాయని ఆశ్చర్యపోయాడు. ఆ శబ్దం ఆగిపోలేదు. మళ్ళీ మళ్ళీ వినబడుతూనే వుంది.

"ఎవరు నువ్వు?" లోపలినుండి ఆ వ్యక్తి ప్రశ్నించాడు.

"ఆపదలో వున్న ఒక స్త్రీని. త్వరగా తలుపు తియ్యండి అపాయంలో వున్నాను. త్వరగా తలుపు తీసి నన్ను రక్షించండి" అంటూ బయటినుండి వినిపించింది.

ఆమె పలుకులు భయంతో తడబడుతూ వున్నప్పటికి ఆ పలుకులలో వీణకున్న మాధుర్యం వున్నదని అనిపిస్తున్నది.

"మీరెవరో ముందు చెప్పండి. ఇంత అర్ధరాత్రి సమయంలో ఎందుకు వచ్చినట్లు? మీరెవరో చెప్పందే తలుపు తియ్యను" అని కఠినంగా పలికాడు లోపలి వ్యక్తి.

"నేనొక అనాథను. దుండగులు నా శీలాన్ని చెరపడానికి నన్ను వెంబడిస్తున్నారు. నన్ను రక్షించండి. లోపలికొచ్చిన తరువాత మీకంతా చెబుతాను. ముందు తలుపు తియ్యండి. త్వరగా! దుండగులు సమీపానికి

వస్తున్నారు, తరువాత మీరు తలుపులు తీసినా ప్రయోజనం వుండదు. తీయండి బాబూ! తలుపు త్వరగా తీయండి" అని దీనంగా పలికింది.

ఆమె వేదనాపూరితమైన విపంచీ స్వరానికి లోపలి వ్యక్తి క్రుంగి పోయాడు. లోకంలో కొంతమంది స్త్రీ శీలాన్ని కోల్పోతుంటే, తమకెందు కని ముఖం ప్రక్కకు త్రిప్పుకుంటారు. కొందరు శీలాన్ని రక్షించడానికి తమ ప్రాణాన్ని సహితం పణంగా పెడుతుంటారు. లోపలి వ్యక్తి పురుషత్వంలో వీరత్వం సమ్మిశ్రితమయింది. ఆమె రక్షించడానికి తన ప్రాణాన్ని పణంగా పెట్టడానికి నిశ్చయించుకున్నాడు. ఆమెను రక్షింపదలుచుకున్నాడు. లోపలి గడియ తీసి తలుపు తెరిచాడు.

ఆమె రివ్వున లోపల ప్రవేశించింది. ముంగిస వెంబడించిన సర్పము పుట్టలో దూరినట్లు గదిలో ప్రవేశించి, తలుపులు మూసి లోపల గడియ వేసింది. గడియనానుకొని తలుపు తీసిన వ్యక్తివైపు జూచింది. ఆ వ్యక్తి కూడా లోపలికి వచ్చిన స్త్రీని పరికించి చూచాడు.

నల్లని వస్త్రం కప్పుకుంది. ఆమె కప్పుకున్న వస్త్రాన్ని తీసి బల్ల మీద పెట్టింది. ఆమె ముఖం విదారితమై వుంది. ముంగురులు చెదిరి ముఖం మీద పడుతున్నవి. ఆమె కట్టుకున్న వస్త్రం అక్కడక్కడా చినిగివున్నది. ఆ స్థితిలో వున్న యామె అనంత సౌందర్యాన్ని జూస్తూ ఒక రెప్పపాటు అలానే నిలబడిపోయాడు.

ఆమె రెండు చేతులు జోడించి "నన్ను రక్షించండి" అంటూ గది లోపల అటూ—ఇటూ తిరుగుతూ తెరచి వున్న కిటికీ తలుపులు మూసింది. తాను దాగివుండడానికి తగిన స్థలం ఎక్కడా అని అంతా వెదుకుతూ వుంది. ఆమె ఒకచోట నిలబడడం లేదు.

"నువ్వెవరు? నీ పేరేమిటి?" అని ప్రశ్నించాడు ఒక వ్యక్తి.

"నేను ఒక అనాధను. నా పేరు సుచిత్ర. మీ పేరు?" అని ప్రశ్నించింది యువతి.

"నా పేరు మనోహర్. బి.ఇడి. ట్రైనింగు చేస్తున్న విద్యార్థిని" అని చెప్పాడు యువకుడు.

"మీరు తప్ప ఈ గదిలో ఎవరూ లేరా?" అని యాతురతతో ప్రశ్నించింది సుచిత్ర.

"లేరు గాని, అర్ధరాత్రి ఒక స్త్రీ ఒక విద్యార్థి చదువుకుంటున్న గది లోకి ఇలా ప్రవేశింపవచ్చునా? అసలు నువ్వెవరు? అని కఠినంగా ప్రశ్నించాడు మనోహర్.

"ముందు నన్ను రక్షించండి. దుండగులు నన్ను వెంబడించి వస్తున్నారు. నేను మీ గదిలో ప్రవేశించడం వాళ్ళు చూశారేమోనని నాకు అనుమానంగా వుంది. వాళ్ళు వెళ్ళిపోయాక మీకు కథంతా చెబుతాను. ఈ మంచంక్రింద దాగి వుండమంటారా?" అని మనోహర్ ముఖాన్ని జాలిగా చూస్తూ ప్రశ్నించింది.

"ఒకవేళ ఆ దుండగులు నా గదిలోకి వస్తే, తప్పకుండా మంచం క్రింద చూస్తారు" అన్నాడు మనోహర్.

"అయితే మరెక్కడ దాగి వుండమంటారు?" అని మనోహర్ ముఖాన్ని జూస్తూ సుచిత్ర ప్రశ్నించింది.

మనోహర్ వ్రేలితో జూపిస్తూ "అదిగో, నా బ్లాక్ ఓవరు కోటు. కొంకికి తగిలించి వుంది. దాని వెనుక నిలబడు. ఎవరికీ కనబడవు. నీ నల్లని వస్త్రాన్ని కూడా కప్పుకో! నీ ముఖం, పాదాలు కనిపింపకుండా వుండటానికి యత్నించు " అంటూ బల్లమీద వున్న యామె నల్లని వస్త్రం దీసి యామె భుజంమీద కప్పాడు.

మనోహర్ కొత్త వ్యక్తి అయినా ఆమెకు ఏమీ అనిపింపలేదు. తన శీలాన్ని కాపాడే జీవనదాతగా భావించింది.

"ఎర్రని నీ పాదాలు, తెల్లని నీ ముఖం కనిపిస్తున్నవి" అని మనోహర్ హెచ్చరించాడు.

ఆమె సిగ్గుతో ఆమె కప్పుకున్న వస్త్రంతో ముఖాన్ని, పాదాలను కనబడకుండా కప్పుకుంది. ఓవరుకోటు వెనుకకు వెళ్ళి నిలబడింది. ఓవరు కోటు వెనుక మనిషి దాగినట్లు ఏమాత్రము అనుమానం గలుగకుండా

మనోహర్ సరిజేశాడు. యథాప్రకారం తలుపు గడియవేసి, కిటికీ తలుపులు తెరచి, కుర్చీలో కూర్చొని చదువుకుంటున్నట్లు నటిస్తున్నాడు.

ఇంతలో బయట పెద్ద చప్పుడయింది. ఒకరిద్దరు రోడ్డుమీద పరుగెడుతున్నారు. ఒకరిద్దరు గది దగ్గరకొచ్చి తలుపులు కొడుతున్నారు.

"ఎవరది?" లోపలి నుంచి ప్రశ్నించాడు మనోహర్!

వచ్చిన రౌడీలు "ముందు తలుపు తియ్యి" అని గట్టిగా తలుపు తట్టడం ప్రారంభించారు.

మనోహర్ తలుపు తెరచి యథాప్రకారం కుర్చీలో కూర్చొని చదువుకుంటున్నాడు.

తలుపు తియ్యగానే నలుగురు వ్యక్తులు లోపలికి ప్రవేశించారు. మనోహర్‌ను అడగకుండానే లోపలంతా వెదకడం మొదలుపెట్టారు.

ఆ గదిని ఆనుకున్న మరొక గది స్నానాలగది వెదకడం మొదలు పెట్టారు.

మనోహర్ వాళ్ళందరినీ పరికించి చూడసాగాడు. పక్కా రౌడీలు. అందులో వారందరూ త్రాగివున్నట్లు కూడ తెలుసుకున్నాడు. ఒకవేళ తన ఓవర్ కోటును వారు తీసిచూస్తే-ఆ అమ్మాయి కనబడితే-బహుశః ఆమెను బలవంతంగా తీసికొనిపోతారేమో! అప్పుడు తానేమీచేయడం? మౌనంగా వుండిపోవడమేనా? ఆమె శీలాన్ని ఆ పశువులు స్వాధీనంజేసి మౌనంగా వుండిపోవడమేనా? ఇదేనా నా పురుషత్వం?

కాదు కాదు! ఆమెను ఏ విధంగానైనా రక్షించాలి! తాను మరణించినా బలప్రయోగంతో ఆమెను రక్షించాలని నిశ్చయించుకున్నాడు.

వచ్చిన వ్యక్తులు వున్న రెండు గదులు, స్నానాలగది, అవతల వున్న యావరణం అంతా వెదికారు. నిరాశతో అంతా కలిసి మనోహర్ దగ్గరకొచ్చి చుట్టూ జేరారు.

అందులో ఒకడు లావుగా నల్లగా వున్నాడు. అతని ముఖం చూస్తుంటూనే అసహ్యంగా, భయంకరంగా వుంది, సంస్కారం ఏమాత్రంలేదు. అతడు మనోహర్ వైపు కోపంగా చూస్తూ-అతని చేతిలో వున్న పుస్తకాన్ని లాగి-

"ఏయ్! ఏమీ తెలియనట్లుగా చదువుతున్నావే? ఏదీ ఆ పిల్ల?" అని తీవ్రంగా గర్జించాడు.

"ఏ పిల్ల? నాకేం తెలుసు?" అని మనోహర్ పెళుసుగా జవాబు చెప్పారు.

"ఆ పిల్లే! ఇప్పుడు లోపలికొచ్చిందే ఆ పిల్ల! ఎక్కడ దాచావో చెప్పు. దాన్ని బయటికి పంపు. లేకపోతే-దాని పనీ, నీ పనీ యేమవుతుందో తెలుసుకో. నా పేరేమిటో తెలుసా? రంగడు! నా సంగతి నీకు తెలియకపోతే వూళ్ళో అడిగి తెలుసుకో! త్వరగా చెప్పు-ఆ పిల్లని ఎక్కడ దాచావో?" అని బల్ల మీద గట్టిగా కొట్టారు.

మనోహర్ ముఖం చిట్లించి "త్రాగిన మత్తులో మీకేం తెలియడం లేదు. పిల్లెవరో—తల్లెవరో నాకు తెలియదు. కావలసివస్తే ఇల్లంతా వెదుక్కోనండి" అని పలికాడు.

"అరేయ్! అంతా వెదకండిరా! మంచం క్రిందా, టేబుల్ బల్లక్రిందా, స్నానాలగదిలో, అంతటా వెదకండి" అని రంగడు తక్కిన రౌడీలతో పలికాడు.

అంతా వెదికామనీ, ఎక్కడా లేదనీ. తక్కిన రౌడీలు రంగడితో జెప్పారు.

రంగడు సాలోచనగా మనోహర్ వైపు జూస్తూ పలికాడు-"మా పిల్లొకతె యీ ఇంట్లోకి వచ్చినట్లు అనుమానపడ్డాం. ఎప్పుడూ, ఎక్కడా బోల్తాపడని రంగడు నీ దగ్గర బోల్తా పడ్డాడు. వెళ్ళొస్తా! ఏమనుకోకు. నిన్ను గుర్తుపెట్టుకున్నా! నన్ను కూడా గుర్తుపెట్టుకో!"

"గుర్తు ఎందుకుండవు? వెనుకటికొకడు చెంపమీద ఛెళ్ళునగొట్టి, క్షమింపమని చెయ్యి పట్టుకున్నాడట. అట్లా వుంది నీ తంతు. ఇక దయ చెయ్యి" అని మనోహర్ కోపంతో బలికాడు.

రౌడీలు ఒక్కొక్కరుగా బయటికి వెళ్ళిపోయారు. మనోహర్ బయటికి వచ్చి చూస్తూ వున్నాడు. వచ్చిన రౌడీలు సందు మలుపు దిరిగారు.

చీకటిలో అదృశ్యమయ్యారు. వాళ్ళ మాటలనుబట్టి సుచిత్ర ఈ ఇంట్లోకి వెళ్ళిందని పొరబడ్డామనీ, తప్పకుండా రైల్వేస్టేషనుకు వెళ్ళి ఎక్కడికైనా పారిపోతుందనీ, కాబట్టి ఖాజీపేట రైల్వేస్టేషనుకు కొందరు, వరంగల్ రైల్వేస్టేషనుకు కొందరు, వెళ్ళి కాపలా కాయుటకు నిశ్చయించుకున్నట్లు తెలిసింది.

ఇంతలో విద్యుచ్ఛక్తి వచ్చింది. వీధిదీపాలన్నీ వెలిగినవి. గదిలో కూడా దీపాలు వెలిగినవి.

మనోహర్ తలుపులు, కిటికీలు మూసివేశాడు. గదిలో దీపాలు కూడ ఆర్పివేసి, లాంతరు వెలిగించి బల్లమీద వుంచి, సుచిత్ర వున్న ఓవరుకోటును తొలగించి, ఆమెను ప్రక్కకు రమ్మని సైగ చేశాడు.

సుచిత్ర అచ్చటినుండి తొలగి బల్ల దగ్గర వున్న దీపం దగ్గరకు వచ్చి నిలబడి దీపంవైపు చూస్తూ వున్నది.

దీపకాంతిలో మనోహర్ ఆమె ముఖారవిందాన్ని దర్శించాడు. 'స్త్రీ ఇంత సౌందర్యంగా వుంటుందా' అన్నట్లు తదేక దృష్టితో ఆమెను చూస్తున్నాడు. నల్లకలువల వలెనున్న యామె నేత్రాలు, మల్లెమొగ్గలు వరుస జేర్చినట్లు వున్న పలువరుస, సంపెంగి పూవువలె కొనదీరిన నాశిక, తుమ్మెదల నల్లదనమంతా దెచ్చి నారుపోసినట్లున్న దా కచభరము.

అయినప్పటికీ నాశిక వేడి నిట్టూర్పులతో సతమతమవుతూనే వున్నది. ఆమె కనుకొలకుల నుంచి అశ్రుబిందువులు ఒక్కొక్కటీ రాలుచున్నవి.

చంద్రబింబముమీది మచ్చవలె, పద్మము మీది తుమ్మెదల గుంపువలె ఆమె సుందర ముఖారవిందముపై కురులు పడుచున్నవి.

దీనత్వమువలన ఆమె ముఖము పాలిపోయినది. పదములయందు తొట్రుబాటు. శరీరమంతటా చెమటలు బోసినవి. భయము, వెనుబాటు, మనోవేదన, వీటన్నిటిచే ఆమె ముఖము శోకమూర్తికి ప్రతినిధిగా వుంది.

మనోహర్ ఆమె శరీరముమీద వున్న నల్లని వస్త్రాన్ని తీయుటకు యత్నించాడు. కాని అతనిని వలదన్నట్లు తన చేతులతో, అతనిని వారించి, పై వస్త్రమును దీసి కొంకికి తగిలించింది.

ఆమెను తన వామహస్తమును ఊతగా ఇచ్చి దక్షిణ హస్తముతో దీపాన్ని పట్టుకొని లోపలి గదిలోనికి తీసికొనివచ్చాడు.

ఆ గదిలో రెండు మూడు పెట్టెలు, ఇతర సామానులు వున్నవి. ఒక భాగంలో వంట సామానులు పాత్రలు వున్నవి. గది మధ్యలో ఒక బెంచి, రెండు మూడు కుర్చీలు వున్నవి.

మనోహర్‌ను ఆమె హస్తస్పర్శ రసాలకిసలయ మాధుర్యము, మృదు మధురమైన పులకలు గలిగినవి. తన వామహస్తమును నూతగాగొని, లలితపద విన్యాసముతో తనవెంట యామె వచ్చుటగాంచి, తన జీవితానికి ఒకానొక పూర్ణత్వం వచ్చినట్లుగా భావించి ఆనందించాడు.

లోపలి గదిలోనికి తీసికొనివచ్చి, ఆమెను నఖశిఖ పర్యంతముగల లలిత సౌందర్యాన్ని గమనించసాగాడు. స్త్రీ ఇంత సౌందర్యంగా వుంటుందని అప్పుడే తెలుసుకున్నట్టు ఆశ్చర్యపడ్డాడు.

"అమ్మయ్య! రౌడీలు వెళ్ళిపోయారా? నన్ను రక్షించారు" తనను ఏకాగ్రంగా తిలకిస్తున్న మనోహర్‌కు నమస్కరించి దీనంగా సుచిత్ర పలికింది.

"పేలి ముసుగును తీసి మీ ముఖచంద్రుణ్ణి చూపించారు. ఇంక మీ అసలు కథ యేమిటో చెప్పండి" అని మనోహర్ ప్రశ్నార్థకంగా ప్రశ్నించాడు.

"కోటి జన్మలెత్తినా గూడా మీ ఋణం దీర్చుకోలేను. మరి మీరు నన్ను రక్షింపకపోతే నేనేమయ్యేదాన్నో!" అని మనోహర్ మాట ముగించకుండానే సుచిత్ర పలికింది.

"కోటి జన్మలెత్తనవసరంలేదు. ఈ జన్మలోనే మీ ఋణం దీర్చుకుందురుగాని. ముందు మీ కథ చెప్పండి" అని మనోహర్ ఆతురతగా ప్రశ్నించాడు.

"నా కథ చెబుతానుగాని ముందు నన్ను మీరు అనడం మాని నీవు అన్నప్పుడే నా కథ చెబుతాను. ఆ మాట ముందు పలకండి" అని చిరునవ్వు నవ్వుతూ సుచిత్ర పలికింది.

"అట్లాగే! ఇకనుండి నిన్ను 'నువ్వు' అనే పలుకుతాను గాని, అసలు నువ్వెవరు? అర్ధరాత్రివేళ ఇల్లు వదిలి, ఈ విధంగా బజారులో తిరుగుతూ, ఇతరుల ఇళ్ళల్లో దూరే నిన్ను యేమనాలి? నిన్ను పోలీసులకు అప్పగించుతాను. నీ పేరేమిటి చెప్పావు?" అని మనోహర్ సుచిత్ర ముఖం చూస్తూ పలికాడు.

"సుచిత్ర అని ఎన్నిసార్లు చెప్పమంటారు?" అంటూ చిరునవ్వు నవ్వుతూ జవాబు చెప్పింది.

"పేరుకు తగ్గట్టుగానే చిత్రమైన వ్యక్తివి. నిన్ను పోలీసులకు తప్పకుండా అప్పగించుతాను" అని సుచిత్ర కళ్ళల్లోకి చూస్తూ మనోహర్ పలికాడు.

"మీరు కూడా పేరుకుతగ్గ వ్యక్తిలాగే కనిపిస్తున్నారు. మనోహరమైన శీలం వుండబట్టే, యీ విధంగా నన్ను రక్షింపగలిగారు. మీరు నన్ను పోలీసులకు అప్పగించుతానన్నారు. మీరు ఆ విధంగా ఎప్పటికీ చేయలేరు." అంటూ అక్కడినుంచి లేచి గదిలో తగిలించివున్న ఒక చిత్రపటంవేపు చూస్తూ-

మనోహర్ కుర్చీలోనుండి లేచి సుచిత్ర దగ్గరకు వెళ్ళి "ఎందుకని" అని సూటిగా ప్రశ్నించాడు.

మనోహర్‌వైపు ప్రశ్నార్థకంగాజూస్తూ "ఆ ప్రశ్న నన్నడగకండి! నన్ను అపాయం నుండి కాపాడిన మీరు పోలీసులకు ఏ విధంగా అప్పగిస్తారు? ఒకవేళ మీరు నన్ను నిజంగా పోలీసులకు అప్పగించితే, మీరు నా భర్త అని చెబుతాను!" అని నవ్వుతూ పలికింది.

"ఇది ఇంకా బాగుంది! నేను నీకు భర్తను ఎట్లా అవుతాను?" అని కొంచెం కోపంతో ప్రశ్నించాడు మనోహర్.

తన విశాల నయనాలను మరింత విశాలం చేసి "ఇంత చదువుకున్న మీరు ఇంత తెలివితక్కువగా మాట్లాడడం చిత్రంగా వుంది. నన్ను ఆపద నుండి రక్షించిన మీరు భర్త, ధర్త కాకపోతే మరేమవుతారు?" అని సుచిత్ర ప్రశ్నించింది.

సుచిత్ర పలుకులను త్రుంచివేస్తూ "ఇంక చాలు నీ తెలివితేటలు! నీ అసలు సంగతేమిటో నిజం చెప్పు!" అని మనోహర్ ఉద్వేగంతో పలికాడు.

సుచిత్ర గద్గద స్వరంతో "నా సంగతి తెలుసుకొని మీరు ఆరుస్తారా తీరుస్తారా? నా సంగతికి నన్ను వదిలివెయ్యండి." అంటూ ముఖం త్రిప్పుకుంది.

మనోహర్ ఆమెకు ఎదురుగా వచ్చి "నీ సంగతికి నిన్ను వదిలివెయ్యక నేనేం జేశాను? అర్ధరాత్రివేళ ఇంటిలో ప్రవేశించిన ఒక స్త్రీని నీవెవ్వరవని ప్రశ్నించడం కూడా తప్పేనా? సరే! చెప్పకు! రహస్యాన్ని దాచిపెట్టుకో." అని తిరస్కారంగా పలికాడు.

మనోహర్ తిరస్కారంతో సుచిత్ర కళ్ళల్లో నీరు క్రమ్మినవి. ఆమె తన ఉద్వేగాన్ని ఆపుకుంటూ "ఇప్పుడు మీరు నాకు ఒక సహాయం చెయ్యాలి." అంటూ కుడిచెయ్యి చాచింది.

మనోహర్ ఒక క్షణం లలితసుకుమారమైన యామె హస్తకమలాన్ని త్రోసివేస్తూ "ఆర్చేవాణ్ణీ, తీర్చేవాణ్ణీ నేను కాదుగా! నేనెందుకు నీకు సహాయం చేయాలి?" అని పలికాడు.

అదివరకు నీరుకమ్మివున్న సితేతరోత్పలమైన నేత్రములనుండి కన్నీటి భాష్పాలు జలజల రాలినవి. ఆమె విషయాన్ని దాచుకుంటూ, కంఠాన్ని సరిజేసుకుని "మనోహర్‌గారూ! జీవితంలో యితరులకు చెప్పకూడని రహస్యాలు కొన్ని వుంటూవుంటాయి. అవి నోటితో చెప్పవలసివచ్చినప్పుడు ఆత్మాభిమానం దెబ్బతింటుంది. సిగ్గుతో తలవంచుకోవలసివస్తుంది. ఆత్మహత్య చేసుకోవాలని అనిపిస్తుంది. మనోహర్‌గారూ! నన్నింక నా విషయాలు ప్రశ్నించి వేధించకండి!" అంటూ గంభీరంగా పలికింది.

సుచిత్రలో వున్న ఉద్వేగాన్ని, వేదనన్నుజూచి మనోహర్‌కు ఆశ్చర్యం గలిగింది.

మనోహర్ అతి నెమ్మదిగా "నీలో అంతటి గంభీరమైన రహస్యాలు వున్నవన్నమాట! ఆ రహస్యాలను నీలోనే దాసుకో! మరింక ప్రశ్నింపను! మరిప్పుడు నీకు నేనేం సహాయం చేయాలి?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర చెదిరిన ముంగురులు సరిజేసుకుంటూ, మనోహర్ వైపు దీనంగా చేతులుజాచి "నన్ను తక్షణం- యీ రాత్రే ఇక్కడినుండి హైదరాబాదుకో, విజయవాడకో బస్సుమీదగాని, రైలుమీదగాని పంపించండి. స్టేషనువరకు వచ్చి రైలు ఎక్కించండి. ఇప్పుడు వచ్చిన రౌడీలు నన్ను జూస్తే పట్టుకుబోతారు. నన్ను బ్రతుకనివ్వరు. ఒకవేళ వారి చేతుల్లో నేను జిక్కితే ఆత్మహత్య జేసుకుంటాను. మనోహర్‌గారూ! శీలం పోయిన తరువాత స్త్రీలో ఇంక మిగిలివుండేది ఏముంటుంది? జీవితంలో ఆమె గర్వంగా ఏ విధంగా తల ఎత్తుకుని తిరుగగలుగుతుంది? ఆ జీవితం నాకు వద్దు! ఆ భయంకరమైన, హేయమైన జీవితం నాకువద్దు."

ఆ వ్యభిచార వృత్తి నాకువద్దు. నన్ను రక్షించండి. నన్ను కాపాడండి. వెంటనే నన్ను యిచ్చటినుండి పంపివేయండి." అని కంటినీరు తొణకడం ప్రారంభించింది.

ఆ సమయంతో ఆమె ముఖకమలం శరత్కాలంలో మంచుబిందువులతో నిండిన తామరపువ్వులా వుండడం మనోహర్ గమనించాడు.

మనోహర్ ఆమె సుకుమారమైన కలువ కన్నులను తన కొనవ్రేళ్ళతో తుడుస్తూ- "సుచిత్రా! భయపడకు. నీకేం భయంలేదు. ఆ రౌడీలే కాదు- వేయిమంది రౌడీలువచ్చినా నిన్ను కాపాడుతాను. అసలు నీవెవరవో తెలుపు! నీకు, ఆ రౌడీలకు వున్న సంబంధాన్ని తెలుపు!" అని స్పష్టంగా పలికాడు.

సుచిత్ర సందేహంతో "చెప్పమంటారా? చెబితే మీరు నన్ను అసహ్యంతో చూస్తారు!" అని పలికింది.

మనోహర్ బల్లమీద వున్న ఒక పుస్తకాన్ని చేతిలోకి తీసుకొని "అసహ్యపడను సుచిత్రా! అసహ్యపడను! ఒకవేళ అసహ్యపడవలసిన విషయం ఏమైనా వుంటే- సానుభూతితో విచారిస్తాను!" అని పలికాడు.

సుచిత్ర తలవంచుకొని చెప్పలేక చెప్పలేక పెదాలను కదిలిస్తూ అస్పష్టంగా "నేను ఒక వేశ్యకు పుట్టినదానను!" అని పలికింది.

ఆమె ఉచ్ఛ్వాసాన్ని బిగబట్టి భూమిలోకి కృంగిపోతుందాయని అనిపించింది.

మనోహర్ ఈ మాటను మొదట నమ్మలేకపోయాడు. వేశ్యకు పుట్టిన స్త్రీకి యింతటి సంస్కారభావం వుంటుందా? అని అనిపించింది. అతడు కూడా ఒక నిమిషం నిస్తబ్ధుడయ్యాడు.

"వేశ్యకు పుట్టినదానవా?" అని నెమ్మదిగా ప్రశ్నించాడు.

సుచిత్ర కనులు మూసికొని శిరస్సును కుడిచేతితో బట్టుకుని- "అవును! నేను ఒక వేశ్యకు జన్మించినదానను!" అని స్పష్టంగా ఉచ్చరించింది.

మనోహర్ క్షణంలో తన నిస్తేజతను ధైర్యంగా మార్చుకున్నాడు. సుచిత్ర కన్నుల్లోకి జూస్తూ "నువ్వు ఒక వేశ్యకు జన్మించినదానవు! తరువాత?" అని ప్రశ్నించి అక్కడవున్న లాంతరు దగ్గరకువెళ్ళి దానిమీద వాలడానికి ప్రయత్నిస్తున్న పతంగాన్ని తదేకదీక్షతో చూస్తున్నాడు.

సుచిత్ర కన్నులు మూసికొనివుంది. తన ఎదుట మనోహర్ వున్నాడో లేదో అని గమనించకుండానే "మనోహర్‌గారూ! మీరు వడుపు వృత్తిని జేసేవారిని అసహ్యించుకోరా?" అని ఆమె పెదవులు పలికినవి.

మనోహర్ దీపం దగ్గరనుండి సుచిత్ర దగ్గరకు వచ్చి, సుచిత్ర అడిగిన ప్రశ్నకు క్షణం ఆలోచించి "అవును! అసహ్యపడతాను. కాని అందరినీ కాదు. కొందరిని మాత్రమే!" అని గంభీరంగా పలికాడు.

సుచిత్ర కనులుతెరచి మనోహర్‌వైపు సాలోచనగా రెప్పలువేయకుండా చూస్తూ- "మీరు ఎటువంటివారిని అసహ్యించుకోరు?" అని యాతురతతో ప్రశ్నించింది.

మనోహర్ బల్లమీదవున్న పుస్తకాలు ఒకదానిమీద ఒకటి సర్దుతూ "సుచిత్రా! మనసమాజంలో విలాసాలకుగాక, పరిస్థితుల దుష్ప్రభావం వలనా, దుర్భరదారిద్ర్యం వలనా అనేకమంది యీ వృత్తిలో జారిపడ్డారు. ఈ వృత్తి వారికేమాత్రం యిష్టం లేకపోయినా, కొన్ని విపరీత పరిస్థితుల

వలన యీ వృత్తిలో దిగి నలిగిపోతున్నారు. అటువంటివారిని జూచి జాలి పడతాను. సానుభూతి చూపిస్తాను." అని ఉపన్యాస ధోరణిలో పలికాడు.

సుచిత్ర అతని ఉచ్ఛతరమైన మనోభావాలకు మనస్సులో ఆనందించింది. ఆమె వెంటనే మనోహర్ వైపు తన విస్ఫారిత నేత్రాలతో జూస్తూ "అయితే- మీరు అసహ్యించుకునేది ఎవరిని మనోహర్ బాబు గారూ?" అని ప్రశ్నించింది.

మనోహర్ స్పష్టంగా తన మనోభిప్రాయాన్ని తెలుపుతూ! "సుచిత్రా! పడుపువృత్తిజేసే కొందరిని నేను అసహ్యించుకుంటాను. అసహ్యించుకోవడమేకాదు- ద్వేషిస్తానుగూడ! విలాసాలకోసం- ధన సంపాదన కోసం తాము పతనంజెంది, యితరులనుగూడ పతనం జేస్తుంటారు. పచ్చని సంసారాలను పాడుజేస్తుంటారు. అటువంటి వారిని నేను ద్వేషిస్తాను!" అని అదివరకటి ఉపన్యాస ధోరణిలో పలికాడు.

సుచిత్ర మనోహర్ వైపు దీనంగా జూస్తూ "మనోహర్‌గారూ! ఇంతవరకు నేనీ వృత్తిలో ప్రవేశించలేదు. మా అమ్మ నన్నీ వృత్తిలోనికి దింపాలని జూస్తున్నది. నన్ను వేధిస్తున్నది." అని హృదయ వేదనతో పలికింది.

మనోహర్ సుచిత్రను సూటిగా కళ్ళల్లోకి జూస్తూ- "నీకీ వృత్తి యిష్టం లేదన్నమాట?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర ఆవేశంతో చేతులు త్రిప్పుతూ "అవును! మనోహర్ గారూ! నాకు ముమ్మాటికీ ఇష్టంలేదు. నాకుగూడా సంసారపు స్త్రీలవలె పెళ్ళి చేసుకోవాలని వుంది. నాకు ఒక భర్తకావాలనీ, నేను గృహిణిగా జీవితం గడపాలని వుంది. కాని మనోహర్‌గారూ! నాకా యోగంలేదు. సంస్కారం వున్నవాళ్ళు ఎవరూ నన్ను పెళ్ళి చేసుకుంటారు చెప్పండి?" అని నిరాశతో పలికింది.

మనోహర్ వెంటనే అందుకుని "మరి ఏం చేయదలుచుకున్నావు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర ముఖాన్ని పైకెత్తి కనురెప్పల్ని మిలమిలలాడిస్తూ "ఒక ప్రశాంతమైన, నిర్జనమైన, ఒక శిథిలమైన దేవాలయానికి, దూరంగా ఒక

పర్ణకుటిని నిర్మించుకుని, మధురగీతాలతో స్వామిని పూజిస్తూ గడపాలని వుంది. ఈ ఆలోచన నాకు సాధ్యంకాదని తోస్తున్నది" అని నిరాశతో పలికింది.

మనోహర్ కొంచెం చిరునవ్వు చిందించి మరి ఇంకేమీ చేయదలుచుకున్నావు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర బల్లమీద వున్న సరస్వతీ విగ్రహంవైపు దృష్టి నిలిపి "ఏదైనా కుగ్రామం చేరుకుని చిన్నపిల్లలకు చదువు చెబుతూ జీవించాలని వుంది" అని ఆశతో పలికింది.

సుచిత్ర పలికే మాటలు వింటూ వుంటే మనోహర్‌కు వేదనతో పాటు నవ్వు కూడా వచ్చింది. ఆమె మనసులో విరిసిన మనోహరమైన కోరికలకు ఒకక్షణం ఆమెను నఖశిఖ పర్యంతం జూచి—ఆమె అమాయకత్వానికి మనస్సులో వే పదారు మారులు పులకించాడు.

మళ్ళీ మనోహర్ సంభాషణను ప్రారంభిస్తూ "మరిప్పుడు వచ్చిన ఆ రౌడీలు ఎవరు?" అని సాలోకంగా ప్రశ్నించాడు.

ఆ మాటలకు సుచిత్ర ఒక క్షణం మౌనం వహించింది. ముఖం మీదబడుతున్న ముంగురులను పైకెగదీసుకుంటూ ఏహ్యాభావంతో- ముఖం చిట్లించుకుని "మిమ్మల్ని బెదిరించినవాడు మా మామయ్య రౌడీరంగడు! మా అమ్మకు తమ్ముడు. మా మామయ్య అని చెప్పడానికి సిగ్గుపడతాను. వచ్చి రౌడీ, త్రాగుబోతు. మిగిలినవాళ్ళు అతనికి స్నేహితులు. రోజూ మా అమ్మను పీడించి డబ్బులు అడుక్కునిపోతూ వుంటాడు" అని పలికింది.

మనోహర్ పరిశీలనాత్మకంగా అరవిందంలాంటి సుచిత్ర ముఖాన్ని జూస్తూ-"అయితే మీ అమ్మ, యీ రంగడు నిన్ను వ్యభిచార వృత్తికి ప్రోత్సహిస్తున్నారన్నమాట" అది ఇష్టంలేక ఈ విధంగా పారిపోయి వస్తున్నావన్నమాట!

సుచిత్ర తన సంభాషణను కొనసాగిస్తూ, "అవును! ఆమెకిదేపని. నా వయస్సుగల ఇద్దరు ముగ్గురు ఆడపిల్లలు వున్నారు. వారిచేత ఈ పని చేయిస్తూ డబ్బు సంపాదిస్తూ వుంటుంది. తల్లి అయినా ఆమె అంటే నాకు

అసహ్యం. ఆమెను వదిలిపెట్టి ఎక్కడికయినా వెళ్ళిపోదామని ఎన్నో సార్లు అనుకున్నాను. అయినా నేను ఎక్కడికి వెళ్ళగలను? ఎవరాదరిస్తారు?" అని విదారకంగా పలికింది.

మనోహర్ ఆమె పరిదీన పరిస్థితికి ఒక నిట్టూర్పు విడిచి "చిన్నప్పటి నుండి అటువంటి ఇంటిలో నివసిస్తున్న నీవు ఆ వృత్తిలో ఎందుకు దిగలేదు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర బల్లమీద వున్న తన నల్లని వస్త్రాన్ని కొంకికి తగిలిస్తూ మనోహర్‌వైపు చూడకుండానే "మనోహర్‌గారూ! చిన్నప్పటి నుండి ఎందుకో ఈ వృత్తి అంటే నాకు అసహ్యం. మా అమ్మతో ఎన్నోసార్లు పోట్లాడాను. ఈ వృత్తి మానవలసిందని. కానీ యామె వినేదికాదు" అని పలికి ప్రక్కనవున్న అద్దం దగ్గరకు వెళ్ళింది.

మనోహర్ అనిమిషనేత్రాలతో అద్దంలో వున్న ఆమె ప్రతిబింబాన్ని జూస్తూ-"మరి ఈ రోజు ఎందుకని ఇలా పారిపోయి వస్తున్నావు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర అద్దంలో ప్రతిబింబిస్తున్న తన ముఖాన్ని చూచుకుంటూ "మనోహర్‌గారూ! లోకంలో అందం కావాలని ఎక్కువమంది కోరుకుంటూ వుంటారు. నేను నాకు అందం కావాలని ఎప్పుడూ కోరుకోలేదు. అందం నాకు భగవంతుడు ఎందుకు ఇచ్చాడో తెలియదు. నా అందమే నాకు శత్రువైంది. మా ఇంటికి వచ్చే విటులందరూ నా అందచందాలనే ప్రశంసించేవారు. నాకోసం ఎంత డబ్బయినా గుమ్మరించడానికి సిద్ధపడేవారు. ఛీ! ఛీ! ఇది ఎంతటి నీచమైన బ్రతుకు" అని తీగ తెగి ఆగిపోయిన వీణానాదం వలె ఆమె గొంతు ఆగిపోయింది.

మానవత్వం వున్న మనుష్యులు లోకంలో దుఃఖాలను, వేదనలను తాము అనుభవింపకపోయినా, చూస్తున్నా, వింటున్నా వాళ్ళ హృదయాలలో భరింపరాని యాటుపోటులు గలుగుతుంటాయి. వాటిని తొలగించడానికి ఉద్రుట్లూగుతూ, తమ జీవితాలను అంకితంజేయాలని కృతనిశ్చయులవుతారు. సుచిత్రతోబాటు మనోహర్ కూడా మౌనం వహించాడు. గది

క్షణకాలం నిశ్శబ్దం ఆవరించింది. చిత్రీయమాన కుడ్య చిత్రాలవలె ఇద్దరు ప్రవర్తించారు.

నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ మనోహర్ నెమ్మదిగా 'తరువాత' అని పలికాడు.

సుచిత్ర కనులు మూసుకొని వేదనాభరితమైన మధురవాణితో 'తరువాత' అనే శబ్దాన్ని ద్విరుక్తంగా పలికి "ఈ రోజు ఒక బంగారు వర్తకుడు నా అందచందాలను జూచి మోహించాడు. నేనుదప్ప మరి ఎవ్వరూ పనికిరారన్నాడు. ఎంత డబ్బయినా గుమ్మరిస్తానన్నాడు. పదివేల రూపాయల నోట్లకట్టలు మా అమ్మముందు గ్రుమ్మరించాడు. మా అమ్మ డబ్బు కాశపడింది. ఆ కామపిశాచానికి నన్ను బలి ఇవ్వడానికి సిద్ధపడింది. నేను ఇంత బ్రతిమాలినా నా మాట మా అమ్మ వినలేదు" అంటూ విలపించింది. ఆమె నేత్రద్వయం ప్రావృట్కాలపు వర్షజలధారలవలె కన్నీరు ప్రవహించింది.

మనోహర్ తన జేబులో వున్న చేతిరుమాలును దీసి జాలుజాలుగా ప్రవహించే ఆమె అశ్రుధారలను తుడిచాడు. ఒక పరస్త్రీని ఆ విధంగా స్పృశించడం తప్పన్న సంగతి ఆ సమయంలో మనోహర్ మరిచిపోయాడు. సుచిత్ర కూడా అతని సేవాపరిచర్యలకు అడ్డు చెప్పలేదు. [illegible]

[illegible] హృదయమైన సుచిత్రకు అతని పరిచర్య [illegible]

[illegible]శిస్తూ-"ఆమె నీ కన్నతల్లేనా? కన్న[illegible]

[illegible]ని ఆగిపోయారు.

[illegible] విరచి "ఏమో! నాకు తెలియదు. ఆమె[illegible]

[illegible] ఆమె దూరపు బంధువురాలు ఒకామె[illegible]

[illegible]కింది.

[illegible]తో "తరువాత ఏం జరిగింది?" అన[illegible]

సుచిత్ర విసుగుతో "నన్ను అలంకరించి మేడమీది గదిలోవేసి బయట తలుపుగొళ్ళెం పెట్టారు. నేను ఎటూ పారిపోకుండా రంగడు, ఇప్పుడు వచ్చిన రౌడీలను కాపుపెట్టింది.

బంగారు వర్తకుడు వచ్చిన అలికిడి నాకు వినబడింది. ఏదో విధంగా బయటపడడానికి యత్నించాను. కాని ఏ విధంగానూ తప్పించుకోవడానికి దారి దొరకలేదు. "మహాపదలకు నివారణ భగవన్నామస్మరణ" యన్నట్లు భగవంతుని స్మరించాను. గాజుతో వున్న కిటికీలు బ్రద్దలు కొట్టాను.

గదిలో వున్న ఒక నల్లని వస్త్రాన్ని కప్పుకున్నాను. పైనుండి నీరుపోవుటకు అమర్చిన ఇనుప గొట్టాన్ని బట్టుకొని క్రిందకు జారాను. అక్కడి నుండి దొడ్డివాకిలి తలుపు తీసకొని రివ్వున బయటికి పరుగెత్తాను. ఇదంతా నిమిషంలో జరిగిపోయింది" అని పలికింది.

మనోహర్ సుచిత్రను విచిత్రంగా జూస్తూ-

"ఆ సమయంలో నిన్నెవరూ చూడలేదా?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర మళ్ళీ గద్గద స్వరంతో "ఎవరు చూశారో, ఎవరు చూడలేదో నేను గమనింపలేదు. ఆ సమయంలో అక్కడ నుండి బయటపడడమే పరమలక్ష్యంగా భావించాను. నేను వెనుదిరిగి చూడకుండా చాలా దూరం వెళ్ళి వెనుదిరిగి చూచాను. దూరంగా కొంతమంది వేగంగా పరుగెత్తుకొస్తున్నట్లు గమనించాను. నేను రిక్షా ఎక్కి హనుమకొండకు వచ్చి సెంటర్‌లో దిగాను.

ఆ రౌడీలు కూడా రెండు రిక్షాలలో ఎక్కి నన్ను వెంబడించి వస్తున్నారు. నేను హనుమకొండ సెంటర్‌కు వచ్చి రిక్షానుండి దిగి, త్వర త్వరగా మెయిన్‌రోడ్డుమీద నడవడం ప్రారంభించాను. పాపం! రిక్షా లాగిన వ్యక్తి నా అవస్థ జూచి జాలితో డబ్బులు కూడ అడగలేదు.

రౌడీలు నన్ను వెంబడిస్తూనే వున్నారు. నేను వారు దగ్గరకొస్తున్నట్లు గుర్తించి రోడ్డు మలుపు దిరిగాను తప్పించుకోవడానికి.

ఈ సందు నిర్మానుష్యంగా వుంది. మీరు లోపల కుర్చీలో కూర్చు
చదువుకుంటున్నట్లు గమనించాను. తలుపుకొట్టి మిమ్మల్ని శరణు వేడా
మీరు నా శీలాన్ని, మానాన్ని కాపాడారు. నన్ను దుండగుల
నుండి రక్షించారు" అని ఆగకుండా విషయాన్ని విశదీకరించింది.

మనోహర్ ఆమె ధైర్యానికి, సాహసానికి ఆశ్చర్యం చెందుతు
ఆమె కట్టుకున్న చీరె అక్కడక్కడా చినిగి వుండడం, ఆమె అంత
సాహసకార్యం చేయడంవలననే జరిగిందని భావించాడు. చిన్న చిరునవ్వ
నవ్వుతూ "ఒకవేళ నేను తలుపు తీయకపోతే యేమి చేసేదానవు?" అ
ప్రశ్నించాడు.

సుచిత్ర తీవ్రంగా మనోహర్ ముఖంలోకి చూస్తూ- "ఈ ప్రశ్న
అడగాలా? మానాన్ని పోగొట్టుకోవడానికి ఇష్టపడని స్త్రీ యేమి చేస్తుందో
అదే చేసేదానిని" అని నిష్కర్షగా చెప్పింది.

మనోహర్ ఆమె ఉద్రేకాన్ని మరింత రెచ్చగొడుతూ మానాన్ని
రక్షించుకోడానికి స్త్రీ యేం జేస్తుందేమిటి?" అని ప్రశ్నించాడు.

ఆమె ఏమాత్రం ఆలోచించకుండా "సింహంలా శత్రువు మీదబ
ముక్కలుగా చీల్చివేస్తుంది. లేదా మానవ దృష్టి బడిన దేవతా సర్పం
మాదిరిగా తన తలను నేలకు కొట్టుకుని ప్రాణాల్ని వదులుతుంది. అంతే
గాని శీలాన్ని పోగొట్టుకొని జీవచ్ఛవంవలె జీవింపజాలదు" అని పలికింది.

తేజోవంతంగా వెలుగుతున్న ఆమె కనులను తిలకిస్తూ "ఇప్పుడు
ఇక్కడనుండి నిన్ను వెళ్ళిపొమ్మంటే ఏం చేస్తావు?" అని ప్రశ్నించాడు
మనోహర్.

సుచిత్ర మందస్మితం జేస్తూ "మీ నోటినుండి అటువంటి కఠిన
మైన మాటలు రావు. మీది చల్లని హృదయం" అని దీపాన్ని జూస్తూ పలి
కింది.

మనోహర్ వ్యంగ్యంగా "నాది చల్లని హృదయం అని నీకెట్లా
తెలుసు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర వెంటనే అందుకుని మనోహర్‌వైపు ముఖంద్రిప్పి "మీది

చల్లని హృదయం కాకపోతే అర్ధరాత్రిలో తలుపు దీసి ఒక స్త్రీని ఆపద నుండి కాపాడేవారా? చెప్పండి" అని నిగ్గదీసింది.

మనోహర్ నిరుత్తరుడై ఏమి చెప్పాలో అతనికి వెంటనే స్ఫురింపలేదు. అతడు అప్రయత్నంగా "అయితే నా చల్లని హృదయానికి ఏమి కానుక యిస్తావు?" అని ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నకు సుచిత్ర కూడా నిరుత్తరయైనది. క్షణంసేపు ఆలోచించి ప్రక్కనే వున్న భద్రకాళి చిత్రపటానికి అంజలి ఘటిస్తూ- "మీకు ఒకవేళ పెళ్ళి కాకపోతే చక్కని చుక్కలాంటి సుగుణవతియైన పెళ్ళికూతురు నివ్వాలనీ, ఒకవేళ మీకు పెళ్ళి అయినట్లయితే చందనపు బొమ్మలు, పనస తొనలలాంటి పాపలు గలగాలనీ యీ లోకమాతను వేడుకుంటున్నాను" అని చిరునవ్వు నవ్వుతూ పలికింది.

అప్రయత్నంగా మనోహర్ రెండు చేతులు సుచిత్ర అంజలిని స్పృశించినవి. ఇద్దరి హృదయాలలో కోటి దీపాలు వెలిగినట్లు పులకలు గలిగినవి.

మనోహర్ వెంటనే తన పొరపాటును గ్రహించి చేతులను వెనుకకు తీసుకున్నాడు. సుచిత్ర కూడా వెనుకకు జరిగింది.

మనోహర్ గంభీరంగా "సుచిత్రా! నా మనసులో లేని కోరికలు నాకు గలగాలని నీవు కోరుతున్నావు. నాకు చక్కని చుక్కా వద్దు. చందనపు బొమ్మలూ వద్దు" అని నిష్ఠూరంగా పలికాడు.

సుచిత్ర విచిత్రంగా తన నయనాలను విస్ఫారితం జేసి "మరి మీకేం కావాలి?" అని ప్రశ్నించింది.

మనోహర్ ఏమాత్రం ఆలస్యం లేకుండా "నీలాంటి పెళ్ళికూతురు కావాలి" అని మందస్మితంతో పలికాడు.

సుచిత్ర విచిత్రంగా తలద్రిప్పుతూ నాలాంటి పెళ్ళికూతురు కావాలా?" అని ప్రశ్నించింది.

మనోహర్ చిన్నపిల్లవానివలె తలవూపుతూ "అవును! నీలాంటి పెళ్ళికూతురే కావాలి" అని పలికాడు.

సుచిత్ర కొడిగట్టిన దీపాన్ని సరిజేస్తూ మనోహర్‌వైపు జూస్తూ "అంత అందంగా వున్నానా నేను" అని ప్రశ్నించింది.

మనోహర్ గంభీరంగా "అందమో! చందమో! నాకు తెలియదు నీ రెండు కళ్ళూ, చెంప క్రింద వున్న ఆ పుట్టుమచ్చ నన్ను వశపరచు కున్నవి. విజయవాడకుగాని, హైదరాబాదుకుగాని వెళతానని ఇదివరకు చెప్పావు. అక్కడ ఎవరున్నారు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర ప్రశ్నార్థకంగా మనోహర్‌ను జూస్తూ "మీది విజయవాడా?" అని ప్రశ్నించింది.

మనోహర్ బయట ఏమైనా అలికిడి వున్నదేమోనని బయటి గ లోనికి ఒకసారి వెళ్ళివచ్చి "అవును" అని జవాబు చెప్పాడు.

సుచిత్ర క్రిందపడి వున్న ఒక పుస్తకాన్ని దీసి మనోహర్ చే కందిస్తూ "మరి ఇక్కడ ఎందుకుంటున్నారు?" అని ప్రశ్నించింది.

మనోహర్ పుస్తకాన్ని తీసుకొని బల్లమీద పెడుతూ "నేను బి. చదివాను. ఉపాధ్యాయ వృత్తిమీద నాకున్న ఆసక్తితో బి.ఇడి. ట్రైనిం పూర్తిచేస్తున్నాను. ఈ ట్రైనింగు ఇంకా మూడు నెలలలో పూర్తి అవుతుం తరువాత నేను స్వయముగా ఒక పాఠశాలను నెలకొల్పాలని నా అ యము" అని పలికాడు.

సుచిత్ర విప్పారిన నేత్రాలతో అచ్చట వున్న సరస్వతీ చిత్రపటాని జూచి "మీ వాంఛ సఫలం కావాలని నా కోరిక" అని మనోహర్ వై దృష్టి సారించింది.

మనోహర్ ఏదో ఆలోచిస్తున్నాడు.

సుచిత్ర నిశ్శబ్దతను తన మంజుల నాదంతో భంగం జేస్తూ "మనో హర్‌గారూ! మీరేదో తీవ్రంగా ఆలోచిస్తున్నారు. నాలాంటి అనాధ ఆశ్రయమిచ్చినందుకు ఎవరైనా చూస్తే మీకు అపవాదు రావచ్చు. నను ఈరాత్రే-ఇప్పుడే-ఇచ్చటినుండి ఎచ్చటికైనా పంపించండి. మళ్ళీ ఆ రౌడీ ఇప్పటికి రావచ్చును గూడ. వచ్చినట్లయితే మీకు, నాకు అనేక మై చిక్కులు ఎదురుపడతవి అని పలికింది.

మనోహర్ ఆమె పలుకులకు చిరునవ్వు నవ్వి "నీ చిక్కులు దీర్చడడానికి నేనున్నానుగా! నీకేం భయంలేదు. ఈ రాత్రికి మనమెక్కడికీ కదలడానికి వీలులేదు. ఆ రౌడీలు వీధులన్నీ తిరుగుతూ వుంటారు. అంతే గాకుండా రైలు స్టేషనులు, బస్సు డిపోలు గూడా కాపలా కాస్తారు. జాగ్ర త్తగా ఇచ్చటినుండి నువ్వు బయటపడాలి" అని పలికాడు.

సుచిత్ర ఔనన్నట్లుగా మౌనం వహించింది.

మనోహర్ సుచిత్రకు ఒక ఛాపను జూపిస్తూ నీవు యీ రాత్రికి యీ గదిలో నిదురించు. నేను ముందు గదిలో నిద్రపోతాను. తెల్లవారిన తరువాత ఇచ్చటినుండి నిన్ను ఎట్లా తప్పించాలో ఆలోచించుకుందాం" అని పలికాడు.

సుచిత్ర అంగీకరించినట్లుగా తల వూపి చాప తీసుకొని క్రింద బరచుకుంది. మనోహర్ వెంటనే ఒక దుప్పటి, ఒక దిండు తెచ్చి ఆమె కిచ్చాడు. ఆమె ముందు వద్దని నిరాకరించి- మనోహర్ బలవంతంమీద చాపమీద దుప్పటి బరుచుకొని తలవైపున దిండు వుంచుకుంది.

మనోహర్ సుచిత్రతో "ఆకలవుతున్నదా?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర లేదని జవాబు చెప్పింది.

"ఆకలయితే యీ రొట్టె, పండ్లు తిన"మని చెప్పి తాను మధ్యా హ్నం తెచ్చి వుంచుకున్న అరటిపండ్లను, ఒక ఆపిలును బల్లమీద వుంచాడు.

ఆమె అవేవీ తనకు అవసరంలేదని చెప్పి కూజాలో వున్న మంచి నీటిని గ్లాసులో పోసుకొని త్రాగింది.

మనోహర్ సుచిత్రకు తాను ముందు గదిలో పడుకుంటానని చెప్పి, తన మంచం మీదకు వచ్చి పడుకున్నాడు.

సుచిత్ర లాంతరు దీపం తక్కువజేసి, చాపమీద పడుకుంది.

# 2

మనోహర్ మంచంమీద పడుకున్నాడేగాని, అతనికి నిద్రపట్టడం లేదు. లేచి హరికెన్ లాంతరు దీపం తక్కువజేసి పడుకున్నాడు. కాని అతని హృదయం అనంతమైన భావనా తరంగాలతో కదలాడుతున్నది. గత జీవితంలో గడిచిపోయిన దృశ్యాలు, భవిష్యత్తులో జరుగబోవు వూహ చిత్రాలను దర్శించుకుంటున్నాడు.

తానిప్పుడు ఒక ఘనకార్యాన్ని చేయడానికి పూనుకున్నాడు. ఒకా నొక పతిత కుమార్తెను వివాహం చేసుకోవాలనుకుంటున్నాడు.

అసలు వివాహం అనేది జీవితంలో ముఖ్యమైన ఘట్టం. మానవునికి పరిపూర్ణత్వాన్ని యిచ్చేది, వ్యక్తిత్వాన్ని యిచ్చేది వైవాహిక బంధమే. వివాహం కానప్పుడు అతడెంత గొప్పవాడయినా పరిపూర్ణుడు కాలేడని పెద్దలు చెబుతారు.

తాను తల్లిదండ్రులకు ఏకైక పుత్రుడు. తనమీద తల్లిదండ్రులు ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. తాను గూడ ఉన్నతవిద్యను బి.ఏ. వరకు అభ్యసించాడు. తండ్రి తహశీల్దారు ఉద్యోగాన్ని జేసి విరమించి, విశ్రాంతి తీసుకుంటున్నారు. ఉన్న ఒక్క చెల్లెలు వివాహమై అత్తవారింటికి వెళ్ళి పోయింది. తానే ఆ ఇంటికి ప్రస్తుతం వెలుగుదీపం. తన యీ చర్య తన కుటుంబానికి, తనకు సుఖాన్ని యిస్తుందా?" అని ప్రశ్నించుకున్నాడు.

అతని హృదయంలో మరో తరంగం లేచింది. తన పూర్వులు దొరలుగా పేరుపొందారు. సంస్కృతీపరులు, సాహితీవేత్తలు తమ ఇంట్లో ఒక పెద్ద గ్రంధాలయం ఇప్పటికీ వుంది. ఏడెనిమిది బీరువాల గ్రంధాలు వున్నవి. తెలుగులో పూర్వకవులు వ్రాసిన కావ్యాలన్నీ వున్నవి. ఎన్నో వ్యాకరణ, శాస్త్ర[illegible] ంథాలు వున్నవి. అంతేగాకుండా కొన్ని [illegible] ).

కవులు వచ్చి ఆ తాటాకు గ్రంథాలలో [illegible]తూ వుంటారు. వారు రెండు మూడు [illegible]మా అతిథి సత్కారాన్ని బొంది, వారి

పని పూర్తిచేసికొని, నాన్నగారికి ధన్యవాదాలు జెప్పి వెళుతూ వుంటారు. ఇప్పటికీ-కవి పండితులకు నాన్నగారు చేతనయిన సహాయం చేస్తూ వుంటారు,

తన కుటుంబం, తన పూర్వులు అట్టివారు. నాన్నగారు కూడ ఆ కోవకు చెందినవారే. తహశీల్దారు ఉద్యోగంజేసి, ఎంతో పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. పూర్వుల ఆస్తిపాస్తుల్ని దుర్వ్యయం కాకుండా తనకోసం కాపాడారు. నేను చేసే ప్రస్తుత కార్యం వారికి కళంకం తెస్తుందా? ఏమో!

మనోహర్ నిదురించడానికి ఎంతో ప్రయత్నిస్తున్నాడు. అతని మనస్సులో మరో తరంగం లేచింది. తల్లిదండ్రులకు తాను ఒక్కడే కుమారుడు కావడంవలన అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేశారు. తాను ఉన్నత విద్యను అభ్యసించడానికి దోహదం చేశారు. తన పదునైదవయేట మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణుడై, క్రమముగా ఇరువది రెండవ సంవత్సరము పూర్తియగు వరకు బి.ఏ. పరీక్షలో నుత్తీర్ణుడగుట సంభవించింది. అన్ని పరీక్షలలో తనకు ప్రథమశ్రేణి వచ్చుట సంభవించినది. తరువాత ఉన్నతవిద్య అవసరములేదనీ. ఉద్యోగం చేయడం అవసరం లేదనీ, ఉన్న ఆస్తిపాస్తులు తనకు చాలుననీ, ఉన్న ఒక్క కుమారుడు తన కళ్ళముందు వుంటే చాలుననీ, తల్లి పట్టుబట్టింది. తాను ఆమెకు మాటాడక పై చదువుల అభ్యసనానికి స్వస్తి చెప్పడం జరిగింది.

ఆమె అసలే చిరకాల దుఃఖిని. ఇప్పటికి పదిహేను సంవత్సరాల క్రిందట మా యింట్లో ఒక సంఘటన జరిగింది. అప్పుడు నాకు ఏడెనిమిది సంవత్సరాల వయస్సు వుండి వుంటుంది. ఆ సమయంలో ఖమ్మం దగ్గిర వున్న మధిరలో మా మామయ్య చనిపోవడం, ఆయన చనిపోయిన కొద్ది రోజులకే ఆయన భార్య కూడా చనిపోవడం జరిగింది. వారికిగల ఏకైక పుత్రిక శైలజ. మూడేళ్ళ వయసు. ఆ బాలికను మా ఇంటికి తీసుకురావడం జరిగింది.

ఆ బాలికను నాకిచ్చి పెళ్ళిచేసి, తన తమ్ముడికిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవాలని మా అమ్మ ఊహ. కాని ప్రతి కోరిక మనం భావించినట్లు జరుగదు గదా!

ఆ రోజుల్లోనే మా ఇంట్లోవున్న మా మేమందరం హైదరాబాదులో
వున్న మా బంధువుల ఆహ్వానాన్ని అందుకొని అచ్చటికి వెళ్ళడము తట
స్థించింది. ఆ సందర్భంలోనే ఒకనాడు అందరము కలిసి అచ్చట జరుగు
చున్న ఎగ్జిబిషన్ జూచుటకు వెళ్ళడం, అక్కడ మూడేళ్ళ వయస్సుగల
మామయ్య కూతురు శైలజ తప్పిపోవడం జరిగింది.

తరువాత ఆ బాలికను ఎంత వెదికినా కనిపించలేదట. ఆనాటినుండి
మా అమ్మ దుఃఖమయిగా తయారయింది. ఎప్పుడూ అదే దిగులుతో
వుంటుంది. ఇప్పటికీ ఆ బాలిక దొరుకుతుందనే యామె ఆశ.

నాకు ఎన్నో సంబంధాలు వచ్చినవి. ఎన్నో కట్నాలు కానుకలుఇస్తా
మని వచ్చారు. ఆమె మనస్తత్వాన్ని గ్రహించి, ఆమెకు దుఃఖాన్ని అధికం
చేయడం యిష్టంలేక నాన్నగారు, నేను నిరాకరిస్తూ వచ్చాము.

మరిప్పుడు నా అంతట నేను-సుచిత్రతో వివాహం చేసుకోవడం
ఆమె యిష్టపడుతుందా? ఈ ప్రసంగం తీసికొచ్చినందుకు ఆమె ఎంతగా
దుఃఖిస్తుందో!

నాన్నగారు మాత్రం వూరుకుంటారా? నేను చేసిన పనిని జూచి
అగ్నిహోత్రంగా మారిపోతారేమో! ఈరోజు ఎట్టి దుర్దినము! మా గృహ
జీవితంలో ఒక గొప్ప భూకంపాన్ని సృష్టిస్తున్నాను? బంధుమిత్రులు నన్ను
ఎంత అసహ్యించుకుంటారో ఏమో! అని మనోహర్ ఈ విధమైన యాలో
చనలతో తన మనస్సుతో తానే మాట్లాడుకుంటున్నాడు.

మళ్ళీ ఒక తరంగం లేచింది. ఈ సుచిత్ర ఎవరు? ఒక వేశ్య
కుమార్తె! కాని వేశ్య కుమార్తెగా నాకు కనిపించడంలేదు. దేవకన్యకున్న
సౌందర్యం, ఆకాశగంగకున్న పవిత్రత, స్వర్గ పారిజాతానికున్న సౌరభం
ఆమెలో నాకు కనిపిస్తున్నవి. ఒక పద్మంలా కనిపిస్తూ వున్నది ఆమె మీద
నాకెందుకింత అనురాగం కలగాలి? ఇంతవరకు నేను కాలేజీ జీవితంలోను,
బంధుమిత్రుల గృహాలలోను అనేకమంది స్త్రీలను జూడడం జరిగింది. ఎవరి
మీద గూడ గలుగని ప్రేమ, జాలి ఏమాత్రం పరిచయంలేని సుచిత్రమీద
గలగడానికి కారణం? సుచిత్రకుకూడ నామీద అనురాగం గలిగిందనియామె
మాటల వలన వ్యక్తమవుతూ వుంది.

స్త్రీ పురుషులకు కొందరికి మొదటి చూపులోనే ఒకరిపై ఒకరికి అను రాగం గలిగి, జీవితంలో విడదీయరానంత గాఢతరముగా వర్ధిల్లుతాయని పెద్దలుచెబుతారు. ఇందుకు ఉదాహరణ శకుంతలా దుష్యంతుల ప్రణయ గాథ!

వారి మొదటి చూపులోనే వారి అనురాగం వర్ధిల్లి గాంధర్వ వివా హంగా పరిణమించింది. దుష్యంతుడు మహా చక్రవర్తి. శకుంతల మేనక కూతురు. రాజకన్య. దిక్కులేని శకుంతలను దెచ్చి పెంచి పెద్ద జేశాడు కణ్వుడు. అట్టి అనాధను దుష్యంత మహారాజు భార్యగా స్వీకరించాడు. బ్రాహ్మణ కన్యయేమోనని భ్రమించిన శకుంతల రాజకన్యగా పరిణమిం చింది. అతని ప్రేమ ఫలించింది. జీవుల సుకృతం వలన ఒక్కొక్కప్పుడు వ్యతిరేకత అనుకూలతగా పరిణమిస్తుంది. అసంభవమనుకున్నది సంభవమై కూర్చుంటుంది. ఈమె శైలజ అయివుంటే ఎంత బావుండును' అను కున్నాడు మనసులో మనోహర్.

తొలికోడి దూరంగా కూసిన శబ్దమయింది. మనోహర్ తన రెండు కళ్ళమీద కుడిచెయ్యి, బొటనవ్రేలు నడిమివ్రేలితో నొక్కుకుంటూ నిదురించ డానికి ప్రయత్నించాడు. మళ్ళీ ఒక తరంగం లేచింది.

వ్యభిచార వృత్తి అనేది సమాజానికి చీడపురుగు. ఈ పడుపు వృత్తిలో జీవించే ఒక కులం, ఒక తెగ గణింపదగిన అధిక సంఖ్యలో వున్న దంటే, సమాజానికి ఎంతటి కళంకం!

ఒక వర్గం విలాసాలకోసం, ధన సంపాదనకోసం, సానివృత్తి అవ లంభించి, తాము పతనం చెందడమే గాకుండా, ఎంతోమంది యువకులను, ధనవంతులను ఆకర్షించి, వారి సంసారాలనుగూడ పతనం జేస్తుంటారు.

ఇంక రెండవ వర్గం దుర్భర దారిద్ర్యం వలనా పరిస్థితుల ప్రభావం వలన, తమకీ నీచవృత్తియందు ఇష్టం లేకపోయినా పురుషుల కామపిశా చానికి బలియై, యీ నీచవృత్తితో జీవిస్తున్నారు.

ఎందరో ప్రముఖులు ఈ నీచమైన వృత్తిని నిర్మూలింపడానికి నవ యుగ నిర్మాత కీ.శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు, కీ.శే. రఘు

వతి వెంకటరత్నం నాయుడు ఇంకా ఇతరులు ఎంతో కృషి జేశారు. సాని
వృత్తిని నిర్మూలించడానికి ఆంగ్ల ప్రభుత్వ హయాంలో చట్టాలు కూడ తీసు
కొని వచ్చారు. తరువాత ఎంతోమంది సంస్కరణ వాదులు యీ వృత్తిని
నిర్మూలించడానికి ఎంతో కృషి చేశారు.

మనకు స్వాతంత్ర్యం వచ్చి ఎన్నో సంవత్సరాలయింది. ఎన్నో
మార్పులు దేశంలో అమలుజరుగుతున్నవి. ఈ సాంఘిక దురాచారం పెరు
గుతున్నదే కాని తరగడంలేదు.

ఆ అమ్మాయిని రక్షించడం అవసరం. అంతేగాని, ఆ అమ్మాయిని
పెళ్ళి చేసుకుంటానని ముందుకు రావడం, కుటుంబంలో ఒక భూకంపాన్ని
గలుగజేయడం అనవసరమేమో! ఇటువంటి పరిస్థితిలో వున్న స్త్రీలు లక్షోప
లక్షలు! వారినందరినీ ఉద్ధరించడం నా తరమా? తల్లి కోరికను, వేదనను
ఆపడానికి, ఉన్నత విద్యను, వచ్చిన సంబంధాలను వలదన్న నేను-ఇటు
వంటి స్త్రీని పెండ్లాడి, తల్లిదండ్రులకు తీరని దుఃఖాన్ని గలిగించడం నాకు
తగునా?

మరి యీ సుచిత్రను నేను రక్షింపగలనా? ఆమెను యిచ్చటినుండి
ఎచ్చటికి తీసికొని వెళ్ళాలి? ఏ విధంగా తీసికొని వెళ్ళాలి? ఉదయం ఆ
రౌడీలు మళ్ళీ రాత్రికి వచ్చినట్లు వచ్చినట్లయితే ఆమెను ఏ విధంగా కాపాడ
గలుగుతాను? ఈ విషయం నా స్నేహితులకు దెలిస్తే-వాళ్ళేవిధంగా భావి
స్తారు? ఇల్లు అద్దెకు యిచ్చిన వకీలు గోపాలరావుగారికి తెలిస్తే ఏమవుతుంది?
వారు నాన్నగారికి స్నేహితులు. ఈ విషయం వారికి ఉత్తరంద్వారా తెలియ
బరుస్తారు. వారు స్వయంగా నన్ను శీలంలేని వ్యక్తిగా భావిస్తారు.

ఈ విధంగా సుచిత్రను రక్షించాలనే ఉన్నతాశయంతోబాటు ఒక
వైపున పిరికితనం గూడ తొంగిచూస్తున్నది. లేనిపోనిదానిలో తలదూర్చా
నేమోనని విచారింపసాగాడు.

అయితే- తాను తప్పేమీ చేయలేదనీ, ఆపదలో వున్న ఒక స్త్రీని
రక్షించి, ఆమె శీలాన్ని కాపాడాననీ, తాను ఒక వీరోచిత చర్యను జేసి
నట్లుగా భావింపసాగాడు. తాను సుచిత్రను వివాహం చేసుకుంటానంటే-

తనమీద వున్న ప్రేమతో తన తల్లి ఒప్పుకుంటుందనీ, తండ్రి కూడ తన మాటను కాదనజాలడనీ భావించసాగాడు.

ఈ విధమైన ఆలోచనలతో అతని హృదయం కల్లోల సముద్రం లాగు కదలాడి కదలాడి విశ్రమించింది. దూరంగా రైలు కూత కూసి ఆగి పోయింది. మనోహర్‌కు చిన్న కునుకు బట్టింది.

## 3

అది పాల్గుణమాసం అవడం వలన అంత చలిగాని, వేడిగాని లేక పోవడం వలన సుచిత్ర లోపలి గదిలో పడుకున్నప్పటికీ. ఆమెకు బాగానే నిద్ర పట్టింది. ఆమె హృదయంలో గూడ అనంతమైన వివిధమైన భావాలు తరంగాలుగా లేచినప్పటికీ, ఆమె దుఃఖం, వేదన ఆమెను గాఢనిద్రా పరవశురాలినిగా జేసినవి.

అయిదు గంటలకు ఆమెకు మెలకువ రావడం అలవాటు. నిద్రలేచి అయిదు నిముషాలు యిష్టదైవమును ప్రార్థన జేసుకోవడం ఆమెకు నిత్య కృత్యం.

ప్రార్థనను పూర్తి చేసికొని కాలకృత్యాలను దీర్చుకోవడానికి నెమ్మదిగా వెనుక భాగాన వున్న తలుపు తెరచింది. స్నానాల గది మున్నగునవి కనిపించినవి. ఆమె కాలకృత్యాలు దీర్చుకొని, గూటిలో వున్న పళ్ళపొడితో ముఖం కడుగుకొని స్నానాల గదిలో ప్రవేశించి తలార స్నానం జేసింది.

మరొక చీర లేనందువలన తడిచీరనే చక్కగాపిండి కట్టుకుంది. అక్కడక్కడ చీర శరీరానికి అంటుకొనిపోయి బంగారుకాంతులు వెదజల్లుతున్నవి. సుచిత్ర తన చైదమునకు తానే సిగ్గుపడి కొంకికివున్న ఒక తెల్లని వస్త్రాన్ని కప్పుకుంది. శిరోజాలు తడిఆరడానికి వెనుకకు జార్చింది. అప్పటికి ఆరుగంటలయింది.

దూరంగా ఒక ఇంట్లో రేడియోనుండి "వందేమాతరం" అనే మాతృగీతిక వినబడుతూ వుంది.

నెమ్మదిగా సుచిత్ర ముందుగదిలోకి వచ్చింది. మనోహర్ నిద్ర పోతూ వున్నాడు. అతని అలినీలకుంతలాలు, ఆయత బాహువులు, విశాల వక్షస్థలము ఆమె మనస్సును కలవరబరచినవి. పురుషుని జూడగా- ఆమెకు ఎప్పుడూ కలుగని సిగ్గు కలిగింది. ఆమె నిగ్రహంతో మనోహర్ కురులను కదిలించి నిదుర లేపింది.

మనోహర్ కనులు తెరచి చూచాడు. నవపుష్ప జంగమలతవలె తనను నిదుర మేల్కొలుపుతున్న లలితసుకుమారమూర్తిని చూచాడు.

ఆమె మేఘాలమధ్య తటిల్లతవలె అచ్చటినుండి గభాలున లోపలి గదిలోనికివెళ్ళి తలుపు వేసుకుంది. బయట పనిమనిషి తలుపు తట్టిన చప్పుడయింది. మనోహర్ మంచం మీదనుండి లేచి తలుపు తెరిచాడు.

పనిమనిషి మూలనున్న చీపురు దీసుకొని "బాబుగారు రోజూ తెల్లవారుజామునే నిద్రలేచి చదువుకునేవారు. ఇవ్వాళ ఇంకా నిద్రపోతున్నారు" అనుకుంటూ వాకిలి చిమ్మడానికి బయటకు వెళ్ళింది.

పనిమనిషి లోపలికివస్తే ప్రమాదమని గుర్తించాడు. పనిమనిషితో- "ఇవ్వాళ లోపల ఊడ్చవలసిన అవసరంలేదు. నేను త్వరగా యీ రోజు ఊరు వెళ్ళవలసిన పనివుంది. గుమ్మం ఊడ్చి, పాలడిపో దగ్గర పాల పొట్లం తెచ్చియిచ్చి వెళ్ళు" అని పలికాడు.

పనిమనిషి "అట్లాగే బాబూ!" అని తనకు కొంత పని తప్పిపోయి నందుకు సంబరపడింది.

త్వరగా వాకిలి ఊడ్చి, పాలపొట్లం తెచ్చి యివ్వడానికి డిపోకు వెళ్ళింది.

మనోహర్ బయటి తలుపులువేసి లోపలి గదితలుపు తీయమని నెమ్మదిగా తట్టాడు.

సుచిత్ర తలుపుతీసి "ఎవరో తలుపుతట్టడం విని యీ విధంగా గది లోనికివెళ్ళి తలుపు వేసికొన్నాను" అని నెమ్మదిగా పలికింది.

మనోహర్ గదిలోకివచ్చి సుచిత్రను చూచాడు. శ్రావణమేఘాల మధ్య మెరుపుతీగెవలె, నల్లని తడివస్త్రము నుండి మేనిబంగారుకాంతులు వెదజల్లుతున్నాయి.

మనోహర్ ఆమె శరీర సౌందర్యానికి మంత్రముగ్ధునివలె మాటలు రాక "స్నానంజేసి తడిబట్టలనే కట్టుకున్నావా?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర నిర్లక్ష్యంగా "ఫరవాలేదు! గంటలో చీరె ఆరిపోతుంది.. మరొక చీరె లేదుగదా!" అని సిగ్గుతో పలికింది.

ఈ మధ్య మనోహర్ తల్లి మాఘమాసంలో వరంగల్‌లో ఒక వారం రోజులు వుండి వెళ్ళింది. హనుమకొండలో వున్న వేయి స్తంభాల శివుని దేవాలయాన్ని, గుట్టమీద వున్న మీనాక్షీ దేవాలయాన్ని చూడాలని ఆమె కాంక్ష! చిన్నప్పుడు ఎప్పుడో ఒకసారి చూసిందట! మనోహర్ హనుమకొండలో ట్రైనింగ్ చేస్తున్నందువలన ఆమెకు స్వయంభూ దేవాలయాన్ని ఒకసారి చూడాలని బుద్ధిపుట్టింది. ఆమె తనతో, తన పట్టుచీరె, పట్టురవికె తెచ్చుకుంది. దేవదర్శనానికి దేవాలయానికి వెళ్ళేటప్పుడుగాని, వ్రతపూజా సమయములందుగాని ఆమెకు పట్టుబట్టలు ధరించడం అలవాటు.

ఆమె వరంగల్‌లో తన యాత్ర పూర్తిజేసికొని, తనతో సామాను తీసుకొని వెళ్ళలేక పట్టుబట్టలతో వున్న పెట్టెను మనోహర్ వచ్చేటప్పుడు ఇంటికి తీసికొనిరావలసిందని చెప్పి వెళ్ళిపోయింది.

ఈ సంగతి మనోహర్‌కి జ్ఞాపకం వచ్చింది. తల్లి పూజావస్త్రాలను ఆమెకు ఇచ్చుటకు ముందు సందేహించాడు. తరువాత సుచిత్ర సుశీలత, శుచిత్వాలను ఆకళించుకొని, తన తల్లి పూజావస్త్రాలను ఒక దీనురాలికి దానం చేసినందువలన కళంకంగాని, అపవిత్రతగాని రావని గ్రహించాడు.

మనోహర్ బల్లక్రిందవున్న చిన్న ట్రంకుపెట్టెను సుచిత్రకు జూపుతూ "సుచిత్రా! మా అమ్మ పట్టుబట్టలు ఆ చిన్న ట్రంకుపెట్టెలో వున్నవి. తడిబట్టలను ఆరవేసి పెట్టెలోవున్న పట్టుబట్టలను కట్టుకో" అని పలికాడు.

సుచిత్ర కళ్ళను విస్ఫారితంజేసి "మీ అమ్మగారి పూజావస్త్రాలను కట్టుకోమంటున్నారా? వద్దు!" అని ఏదో అపరాధం చెయ్యబోయేదానివలె పలికింది.

మనోహర్ సుచిత్ర మాటలను త్రోసివేస్తూ "ఫరవాలేదు సుచిత్రా! మా అమ్మ చాలా మంచిది. నిన్నీబట్టలతో చూసిందంటే తన అక్కున జేర్చుకుంటుంది. తడిబట్టలను విప్పి ఆరవేసుకో! కావాలనుకుంటే- తరువాత నీ బట్టలనే కట్టుకుందువుగాని. తడిబట్టలతో వుంటే జలుబుచేస్తుంది." అని బల్లక్రిందవున్న చిన్న ట్రంకుపెట్టె తీసికొనివచ్చి బల్లమీద వుంచాడు.

సుచిత్ర ట్రంకుపెట్టె తీయడానికి ఎందుకో సందేహించింది.

మనోహర్ ట్రంకుపెట్టె తెరిచాడు. బంగారుజరీ అంచుతోవున్న పట్టుచీరెను రెండుచేతులతో సుచిత్రకు యివ్వబోయాడు.

సుచిత్ర 'వల'దన్నట్లు చేతులు వూపింది.

మనోహర్ బ్రతిమాలుతున్నట్లు చీరెను ఆమె ముందుకు త్రోశాడు.

ఆమె మెత్తబడటం గమనించి తలుపువేసి ముందుగదిలోకి వచ్చి కూర్చున్నాడు.

సుచిత్ర చీర మార్చుకుని తన చీర తీసికొనివచ్చి పొరపాటున ముందుగదిలో వున్న దండెం మీద ఆరవేసింది.

ఇంతలో పనిమనిషి పాలడిపోనుండి పాలపొట్లం తీసికొనివచ్చి, బయట గుమ్మం దగ్గర పెట్టి "ఇదిగోనండి పాలపొట్లం" అని చెప్పింది.

మనోహర్ పనిమనిషి లచ్చితో "లచ్చీ! నేను రెండు మూడు రోజులు వూళ్ళోవుండను. మా వూరికి వెళుతున్నాను. రోజూ గుమ్మం వాకిలి వూడ్చి వెళుతూవుండు" అన్నాడు.

లచ్చి "అట్లాగేనండి!" అంటూ వెళ్ళిపోయింది.

తరువాత మనోహర్ బయట తలుపువేసి పాలపొడి పొట్లం లోపలి గదిగుమ్మం దగ్గరపెట్టి కాలకృత్యాలు తీర్చుకోవడానికి వెళ్ళిపోయాడు.

మనోహర్ స్నానంజేసి ముందుగదిలోకి ప్రవేశించాడు. లోపలి గదితలుపులు తెరచివుండటం చూచి లోపలికి తొంగిచూశాడు.

సుచిత్ర పట్టుబట్టను కట్టుకొని నుదుట కుంకుమబొట్టు పెట్టుకుంటూ వుంది. ఆమె జగన్మోహన సౌందర్యాన్ని మనోహర్ మరొకసారి తిలకించాడు. పట్టు జరీచీర ధరించి, ఆమె నుదుట కుంకుమ ధరించడం

చూస్తుంటే- ఒక ఉత్తమగృహిణి వ్రతపూజారంభమునకు సిద్ధమవుతున్నట్లున్నది ఆమెలో సౌందర్యం, శుచిత్వం, పవిత్రత వెల్లివిరుస్తున్నట్లున్నది. ఆ సమయంలో ఆ తేజోమూర్తితో పలకడానికి వెనుకంజవేసి ముందు గదిలోకి వెళ్ళిపోయాడు.

సుచిత్ర కూడా మనోహర్ శరీర లావణ్యాన్ని మరొకసారి తిలకించింది. అతని అలినీలకుంతలాలు, ఆయత బాహువులు, విశాల వక్షస్థలము ఆమెను మరొకసారి కలవరపరిచినవి.

స్నానం జేసిన అతని శరీరంమీద నీటి బిందువులు ముత్యాలవలె మెరుస్తున్నవి. అద్దంలో జూచి బొట్టు పెట్టుకుంటున్న సుచిత్ర మనోహర్‌ను అద్దంలోనే మరొకసారి చూడదలుచుకుంది. కాని చూడలేకపోయింది. మనసులో గలిగిన కలవరంతో అతనితో ప్రక్కకు దిరిగి తలఎత్తి అతనితో మాట్లాడలేకపోయింది. మనోహర్ అక్కడనుండి వెళ్ళిపోవడం అద్దంలో చూచింది.

"మనోహర్ వంటి ఉత్తమ సంస్కారం వున్న వ్యక్తి తనకు భర్త అయితే ఎంత బాగుంటుంది" అని మనసులో అనుకుంది.

ఆ కోర్కె యీ జన్మలో అసాధ్యమని భావించి, గోడ మీద వున్న భద్రకాళి చిత్రపటాన్ని జూచి "జగన్మాతా! అసాధ్యమైన నా యీ కోరికను నిజము చేయలేవా తల్లీ!" అని పలుకులతోగాక మనసులోనే నివేదించింది.

కోరిక సఫలమవుతుందని ఆశీర్వదించినట్లుగా ఏనాడో బజారునుండి మనోహర్ తెచ్చి వేసిన మల్లెపూల దండనుండి ఒక పువ్వు రాలి బల్లమీద పడింది.

సుచిత్ర పాలపొట్లం చించి, శుభ్రం చేసిన పాత్రలో పోసి టీ చేయడానికి ప్రారంభించింది. చెప్పకుండానే గదిలోని వస్తువులను జూచి, టీ తయారుచేస్తున్న ఆమె సమయస్ఫూర్తికి అతనికి ఆశ్చర్యం గలిగింది. ఆమెను ఈ విషవలయాన్నుండి తప్పించి ఎక్కడికి తీసికొని వెళ్ళాలి? అని అతని మనసు ఇంకా బాధిస్తూనే వుంది.

అయితే అతడు ఒక నిశ్చయానికి వచ్చినట్లు తోస్తున్నది. అనాధ అయిన సుచిత్రను అటూ-ఇటూ తీసికొని వెళ్ళి, అనేక చిక్కులకు, అవమానాలకు గురిచేయకుండా తిన్నగా తన ఇంటికి తీసుకొనివెళ్ళి, యదార్థ విషయాన్ని తన తల్లిదండ్రులకు విశదీకరించాలని భావించాడు. అందువలన తనకు సుచిత్రకు ఎటువంటి ప్రమాద పరిస్థితులు సంభవింపవు.

ఒకవేళ మా ఇరువురికి వివాహం జరుగకపోయినా, యీమెను యీ ప్రమాదంనుండి మా నాన్నగారు కాపాడగలుగుతారు ఆ విధంగా చేయకుండా యీమెను ఎక్కడికయినా దూరప్రదేశానికి తీసుకొని వెళ్ళినా ఏ స్నేహితుని ఇంటిలో వుంచినా అనేక ప్రమాదాలకు, అనుమానాలకు అస్కారం గలుగుతుంది.

చుక్కానిలేని పడవ మాదిరిగా సూత్రంలేని గాలిపడగలా వ్యవహరిస్తే, ఆమెకు నేను సహాయం చేయకపోగా, అనేక ఆపదలకు, అవమానాలకు గురిచేసిన వాణ్ణి అవుతాను. యధార్థంగా ధీరోదాత్తతగా ప్రవర్తిస్తే కార్యము జయప్రదము గాకపోయినా పశ్చాత్తాపం జెందవలసిన అవసరం వుండదు.

ఈ విధమైన ఆలోచనలతో, మనోభావాలతో వున్న మనోహర్ హృదయ సరస్సును పువ్వు విసిరి కదలిక గమనించినట్లుగా సుచిత్ర "ఏమండీ! "మిమ్మల్నే! అగ్గిపెట్టె ఎక్కడ వుంది?" అని ప్రశ్నించింది.

మనోహర్ ఒక్కసారిగా ఆలోచనా ప్రపంచంనుండి యీ లోకానికి వచ్చాడు.

చంచలమైన సుచిత్ర కన్నులలోనికి సూటిగా జూస్తూ "పాలు, పంచదార, టీపొడి, స్టౌ చెప్పకుండానే టీ తయారుచేయడానికి గదిలో వున్న సమస్త వస్తువులు సమకూర్చుకున్న నీవు అగ్గిపెట్టె ఎక్కడ వుందో తెలిసికొనలేకపోయావా?" అని మేజాబల్ల సొరుగు లోపల వున్న అగ్గిపెట్టె దీసి ఆమె చేతికివ్వబోయాడు.

ఆమె చేతిని జాపక క్రింద బెట్టమన్నట్లు సైగ జేసింది.

మనోహర్ చిరునవ్వుతో "మడి గట్టుకున్నావు కాబోలు" అని పలికాడు.

"వంట జేసేటప్పుడు ఎవరినీ అంటుకోకూడదనే సంగతి మీకు తెలియదూ?" అని సుచిత్ర స్టౌ వెలిగించి పాత్రను పైన బెట్టింది.

మనోహర్ ప్రశ్నార్థకంగా "భర్తను కూడానా?" అని ప్రశ్నించాడు.

"అవును! భర్తను కూడా!" అని అతని జవాబుకు ఎదురుచూడకుండానే, పాలపొట్లాన్ని కొద్దిగా చింపి, పాలను స్టౌ మీద వున్న పాత్రలో పోస్తూ వుంది.

ఆ సమయంలో అమృతమధనం తరువాత క్షీరసాగరంలో ఉద్భవిల్లిన అమృతకలశాన్ని చేతధరించి దేవతల హస్తపుటములయందు వొంపుతున్న మోహినిగా సుచిత్రను మనోహర్ భావింపసాగాడు. తన తల్లి కూడా వంట జేసేటప్పుడు తనను దప్ప ఎవరినీ అంటుకునేది కాదు.

మనోహర్ ఆసక్తిగా సుచిత్రవైపు జూచి "సుచిత్రా! మరి యీ సంస్కార భావాలు నీకెక్కడినుండి వచ్చాయి?" అని సాలోచనగా ప్రశ్నించాడు.

"ఈ ప్రపంచంలో కొందరికి సంస్కారం నేర్పితే వస్తుంది. కొంతమంది ఇతరులను జూచి నేర్చుకుంటారు. కొందరికి సహజంగా ఎవరూ చెప్పకుండానే చదివిన మంచి పుస్తకాలనుండి అబ్బుతవి." అంటూ పొంగుతున్న పాలపాత్రను దీసి క్రిందపెట్టి మూతబెట్టింది.

మనోహర్ ముక్కు నొక్కి ప్రశ్నిస్తూ "మరి నీకు యీ సంస్కార భావాలు ఏ పుస్తకాలను చదివితే అబ్బినవి" అని ప్రశ్నించాడు.

"సుచిత్ర విసుగుతో "ఏ పుస్తకాలు చదివితే వొచ్చినవో నాకు తెలియదు. ఇటువంటి ప్రశ్నలు ఇతరులను అడిగి బాధింపకూడదని మీకు తెలియదూ?" అని పలుకుతూ వేరొక పాత్రను 'స్టౌ' మీద బెట్టి రెండు గ్లాసుల నీరు బోసింది.

మనోహర్ సుచిత్ర మనస్సు శరీరం మాదిరిగా మనస్సు గూడ పువ్వులాంటి సుకుమారమైనదని భావించాడు. ఆమె ఏ చిన్న అవమానాన్నిగాని,

ఏ చిన్న కఠినమైన మాటను భరింపలేదని నిశ్చయించుకున్నాడు. ఆమె తనను గురించి ఇతరులు ఏ విషయాన్ని అడగకూడదనీ, ఇతరులకు తనను గురించిన ఏ విషయాన్ని చెప్పకూడదన్న మనోభావం ఆమెకున్నదని గుర్తించాడు. మనోహర్ మౌనం వహించాడు.

తాను అన్నమాటకు మనోహర్‌కు బాధ కలిగిందేమోనని సుచిత్ర ఉలిక్కిపడి "మనోహర్‌గారూ! నేనన్న మాటలకు మీకు బాధ కలిగిందేమో నన్ను క్షమించండి. ఒక్కొక్కప్పుడు ఏ మాట బడితే ఆ మాట నోటి నుండి వచ్చేస్తూ వుంటుంది నా హృదయమెప్పుడూ యీ వెలిగే స్టౌ మాదిరిగా వెలుగుతూ వుంటుంది. నా హృదయం ఎల్లప్పుడు అగ్నిహోత్రంగా జ్వలిస్తూ వుంటుంది. ఆ వేదనలో నా నోటిని నా హద్దులో వుంచుకోలేక పోతున్నాను. నన్ను క్షమించండి" అని మనోహర్‌వైపు జూస్తూ రెండు కన్నీటిబిందువులను రాల్చింది.

ఆ దృశ్యం హేమంతంలో తామరాకులనుండి హిమబిందువులు రాలినట్లు ఆమె చెంపలనుండి జారిపడినవి. టీ పొట్లంనుంచి టీపొడిని చంచాతో దీసి, స్టౌ మీద పొంగుతున్న నీటిలో వేసి మూతబెట్టింది.

మనోహర్ తన మౌనం గూడ ఆమెకు వేదన గలిగించినట్లుగా బాధపడ్డాడు. ఆమెకు సంతోషాన్ని, చిరునవ్వును తెప్పించాలనే భావంతో "నేను మౌనం వహించడానికి కారణం - మా అమ్మ పోలికలు నీలో ఎన్ని వున్నవా? అని పరిశీలిస్తున్నాను" అని చిరునవ్వుతో బలికాడు.

ఆ మాటకు సుచిత్ర మనోహర్‌వైపు చూడకుండానే మీ అమ్మగారి పోలికలు నాలో ఎన్ని వున్నవి?" అని ప్రశ్నించి, పాత్రను స్టౌమీదనుంచి దించి క్రిందబెట్టింది.

మనోహర్ వెంటనే "నూటికి నూరుపాళ్ళు" అని సమాధానం చెప్పాడు.

ఆ మాటకు సుచిత్ర మనోహర్‌వైపు చురచుర జూస్తూ-

"అయితే నన్ను మీ అమ్మగారు కోడలుగా స్వీకరిస్తుందంటారు" అని విరసంగా నవ్వు నవ్వి "మనోహర్‌గారూ! నన్ను మీరు ఏదో అంద

లం ఎక్కించాలని శ్రమ పడుతున్నారు. నాకు అటువంటి ఆకాశ హర్మ్యా లలో విహరించాలని లేదు. విష్ణుపూజకు తులసీదళాలు, సదాశివుని పూజించ డానికి మారేడు దళాలు పనికివచ్చినట్లు ఇతరమైన పత్రపుష్పాలు పనికి రావు. పూజా పుష్పాని కుండవలసిన అర్హతగాని, పవిత్రతగాని, నాకులేవు. ధూళితో దొరలాడుతున్న బాట ప్రక్కన వున్న దళిత కుసుమాన్ని నేను. పూజా కుసుమముగా నన్ను స్వీకరించడానికి కాదుగదా, నన్ను కనులు సారించి చూడడానికి కూడా లోకం యిష్టపడదు. అడవి పువ్వుగా నన్ను రాలిపోనివ్వండి" అని ఉద్వేగంగా పలికింది.

గాజు గ్లాసులో పంచదార, పాలు పోసి. టీ నీటిని కొద్దిగా పంచి, సాసరుతో కూడా మనోహర్ ముందు బెట్టింది.

గూటిలో నున్న చిన్న చెంచాను కడిగి, తుడిచి సాసరులో బెట్టింది.

మనోహర్ చెంచాతో గ్లాసులో వున్న పంచదారను కలుపుతూ, సుచిత్ర మనస్తత్వాన్నీ, విచిత్రమైన ఆమె పోకడలను తన మనో కుహ రంలో అర్థం చేసుకోవడానికి యత్నిస్తున్నాడు. ఆమె మనస్సు జ్వాలాముఖి యైన అగ్నిపర్వతంలాంటిదనీ, క్షణం తీరిక లేకుండా ఆ అగ్నిపర్వతం ప్రజ్వలిస్తూ వుంటుందనీ, ఆమె బయటికి కనబరుస్తున్న ప్రసన్న భావానికి ఆమె హృదయం వ్యతిరేకమని భావించాడు.

అందుకు ప్రధానకారణం- తాను ఒక వేశ్యకు కుమార్తెననీ, ఆ జీవితం తనకు గలిగినందుకు అనుక్షణం మనసులో బాధ పొందుతూ వుంటుందనీ, ఆమె మనస్సు ప్రపంచ సుఖాలకోసం గాకుండా ఏకాంతాన్ని, తనను ఎవరని ప్రశ్నించని దూరదేశాలకు పయనించాలని కోరుకుంటున్న దని మనోహర్ భావించాడు.

ఇట్టి తీరని వేదన, బాధ, సంస్కారం వున్న వేశ్యా జీవితాన్ని గడిపే ప్రతిస్త్రీకి వుంటుందేమోనని అతడు వూహించాడు.

అతడు ఆమెతో సాధ్యమైనంతవరకు తక్కువగా మాట్లాడి, ఆమెకు ఆవేశం గలుగకుండా చేయడానికి నిశ్చయించుకున్నాడు. మౌనాన్ని భంగం చేస్తూ, తన టీ గ్లాసులో కొంచెం పంచదార వేయమన్నాడు.

సుచిత్ర డబ్బాలోవున్న పంచదారను ఆ డబ్బాలో వున్న మరొక చంచాతో దీసి మనోహర్ టీ గ్లాసులో వేసింది.

మనోహర్ పంచదారను చెంచాతో కలుపుకుంటూ సుచిత్రను కూడ త్రాగమని పలికాడు.

సుచిత్ర సుస్వరకంఠంతో "ముందు మీరు త్రాగండి. తరువాత నేను త్రాగుతాను" అని చెప్పి బల్లమీద వున్న పండ్లను, రొట్టెను పళ్ళెంలో సర్దింది.

మనోహర్‌కు మళ్ళీ ఎలా ప్రసంగం ఆరంభించాలో తోచలేదు. మనోహర్ టీ త్రాగడం పూర్తిచేసి-"సుచిత్రా! రాత్రి విజయవాడకు వెళతా నన్నావు! అచ్చట నీకు తెలిసినవారు ఎవరన్నా వున్నారా?" అని ప్రశ్నించా చాడు.

సుచిత్ర ప్రక్కకు దిరిగి మనోహర్‌ను జూస్తూ-"ఎవరూలేరు. దూరప్రాంతంలో ఏదయినా పని చేసుకుని బ్రతుకుతాను" అని విచారంగా పలికింది.

మనోహర్ ఆసక్తితో "నీకేం పనులు చేతనవునో తెలుసుకో వచ్చునా?" అని పలికాడు.

శీతాకాలంలో ఆకాశం మల్లెచెట్టు పూచిన పూలను గాలికి ఒక్క సారిగా జలజలరాల్చినట్లు పక పక నవ్వి, ఆడవాళ్ళుచేసే వంటా, వార్పూ, వడ్డనా అన్ని పనులూ వచ్చును. నృత్యం, సంగీతం కూడ కొద్దిగా నేర్చు కున్నాను" అని పలికింది.

అప్పటివరకూ వేదనాతరంగాలు వెల్లగక్కుతున్న ఆమె హృద యంలో సంతోషతరంగాలు వెల్లివిరిసినందుకు మనోహర్ సంతోషిం చాడు.

చిరునవ్వు నవ్వుతూ-"నీకు నృత్యం, సంగీతం కూడ వచ్చునా?" అని ప్రశ్నించాడు మనోహర్ ఆశ్చర్యంగా.

సుచిత్ర కన్నులలో ఆనందాన్ని ఒలకబోస్తూ "అవును! ఆ కళ లతో నాకు స్వల్ప పరిచయం గలిగింది" అని పలికింది.

మనోహర్ ఆశ్చర్యంతో "ఎవరు నేర్పించారు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర చిరునవ్వు నవ్వుతూ-"నేనే నేర్చుకున్నాను" అని పలికింది.

"అవి స్వయంగా నేర్చుకునే విద్యలుగావుగా? ఎవరిదగ్గరైనా నేర్చుకుంటేనే అవి లభ్యమవుతాయి" అని మనోహర్ నెమ్మదిగా పలికాడు.

సుచిత్ర భక్తితో నమ్రవదనంతో కృష్ణాజిల్లాలో వున్న కూచిపూడి నుండి వచ్చి, వరంగల్లులో స్థిరనివాసం ఏర్పరుచుకున్న 'కూచిపూడి లక్ష్మి నరసింహశాస్త్రిగారి దగ్గర నేర్చుకున్నాను.

సుచిత్ర ఆ మాటలు బలుకుతున్నప్పుడు గురుభక్తి తొంగి చూస్తున్నదని గ్రహించాడు మనోహర్.

ఆమె సంగీత నాట్యానుభవాలను పరిశీలించాలనే ఉద్దేశంతో మనోహర్-"నీకు ఎవరి పాటలు పాడుతూ అభినయించడం ఇష్టం? అని ప్రశ్నించాడు.

సుచిత్ర ధ్యానసుగ్నమైన రాధికవలె కనులు మూసికొని "జయదేవుని అష్టపదులంటే నాకు యిష్టం!" అని పలికి మనోహర్ వైపు చూసింది.

మనోహర్ సహజమైన హృదయమార్దవంతో నీవు కృష్ణభక్తి పారవశ్యవన్నమాట! విరహవేదనతో, మధుర నృత్యగీతాలతో కృష్ణసాన్నిధ్యాన్ని చేరుకోవాలని భావిస్తున్నావన్నమాట" అని ప్రశ్నించాడు.

సుచిత్ర అప్రయత్నంగా ఆమె అధరపల్లవాలనుండి "అవును" అని సుమధురాక్షర పదం వెల్లివిరిసింది. ఆ క్షణంలో ఆమె కృష్ణభక్తితో పరవశిస్తున్నదానివలె మనోహర్‌కు కనిపించింది.

మనోహర్ సంభాషణను కొనసాగిస్తూ-"నాకు గూడ సంగీత కళలో స్వల్ప పరిచయం వుంది. జయదేవుని అష్టపదులలో కొన్నింటిని కంఠస్థం కూడ చేశాను.

"మీరు సంగీతం ఎవరి దగ్గర నేర్చుకున్నారు?" అని ఆసక్తితో ప్రశ్నించింది సుచిత్ర.

మనోహర్ సుచిత్రవైపు జూస్తూ-"విజయవాడలో వున్న ఒక గొప్ప సంగీత విద్వాంసుడు మా ఇంటికి అప్పుడప్పుడూ వచ్చి, తాటాకు గ్రంథాలలో వున్న విషయాలను వ్రాసుకుంటూ వుండేవారు. ఆ పరిచయంతో నేను వారి ఇంటికి వెళ్ళి వారి శిష్యులతోబాటు కొన్ని త్యాగరాజ కృతులను నేర్చుకున్నాను" పలికాడు.

"మరి జయదేవుని గీతాలు ఏ విధంగా నేర్చుకున్నారు?" అని సుచిత్ర ఆసక్తితో ప్రశ్నించింది.

"సంగీతమనేది భగవత్ప్రసాదం. లయ, తాళ, రాగ జ్ఞానం గలిగితే ఏ పాటలుబడితే ఆ పాటలు పాడుకొనవచ్చును. శాస్త్రీయమైన సంగీత కళతో గూడియుండకపోవచ్చును. గాని, సాధారణంగా పాడుకుని ఆనందింపవచ్చును" అని మనోహర్ సుచిత్ర కళ్ళల్లో చూస్తూ పలికాడు.

మనోహర్ పలుకులు సుచిత్రకు అమృత సేచనము చేసినట్లయింది. వేయి పారిజాత కుసుమాలు వికసంచి కుసుమించినట్లయింది.

సుచిత్ర మనోహర్ ఆసక్తితో జూచి "మీకు త్యాగరాజ కీర్తనలంటే ఎక్కువ ఇష్టమా?" అని ప్రశ్నించింది.

మనోహర్ అవునన్నట్లు తలవూపి "సుచిత్రా! నాకు భక్తి విషయంలోగాని, సంగీత శాస్త్రవిషయంలోగాని, అంతటి వున్నత పరిజ్ఞానం లేదు. సాధారణంగా సంగీత కళయందు నాకు ఆసక్తి.ఆ ఆసక్తే కొన్ని త్యాగరాజకృతులను, జయదేవుని కొన్ని అష్టపదులను నేర్చుకోవడానికి కారణం" అని పలికాడు.

సుచిత్ర మనోహర్ వినమ్ర మనస్తత్వానికీ, సరళమైన మనోభావాలకు కరిగిపోయింది. అతనితో ప్రసంగిస్తూ అతని మధురమైన సంభాషణలో తేలిపోవాలని అనిపించింది.

సుచిత్ర చిరునవ్వు నవ్వుతూ "మనోహర్‌గారూ! నేను జయదేవుని అష్టపదులలో కొన్నింటిని కంఠస్థం చేశాను" అని పలికింది.

మనోహర్ ఆసక్తితో "ఏయే అష్టపదులను కంఠస్థం జేశావు?" అని ప్రశ్నించాడు. రెండింటిని చెప్పు?"

సుచిత్ర ఆలోచించకుండా వెంటనే- 'ప్రళయప్రయోధిజలే ధృతవానసివేదం' (చందనచర్చిత నీలకళేబర)అనే గీతాలు నాకు చాలా యిష్టం. మీకు ఏ గీతం యిష్టమో ఒకదానిని పేర్కొనండి" అని ఆసక్తితో ప్రశ్నించింది.

మనోహర్ నవ్వుతూ జ్ఞాపకం చేసుకుంటూ "హరిహరీ! హతాదరతయా! సాగతాకుపితేవా!" అనే గీతం నాకు యిష్టం. మరి ఆధునిక తెలుగు కవుల గీతికలు నీకు యిష్టంలేదూ?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర ముఖంమీద పడుతున్న ముంగురులను పైకి దీసుకుంటూ- "మరి ఎందుకు ఇష్టంలేదూ? దేవులపల్లివారి "ప్రోయింపకోయ్! మురళీ ప్రోయింపకోయ్!" అనే గీతం నాకు చాలా ఇష్టం. విశ్వనాథవారి 'కిన్నెరసాని పాటలు" నండూరివారి ఎంకిపాటలు నాకు చాలా యిష్టం. శ్రీశ్రీగారి 'ఆనందం అర్ణవమైతే' అనే గీతం నాకు చాలా యిష్టం. నేను ప్రతిరోజూ ఆ పాటలు పాడుకుంటూ వుంటాను. మీరాబాయి భక్తిగీతాలు కూడా నేను పాడుకుంటాను" అని పలికింది.

మనోహర్ ప్రశ్నార్థకంగా "నీకు హిందీ కూడా వచ్చునా?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర సిగ్గుతో కొద్దిగా నేర్చుకున్నాను" అని పలికింది.

సుచిత్ర దీనురాలనీ, అనాథయనీ దయదలచి తన హృదయంలో ఒక భాగంలో స్థానం ఇవ్వాలనీ మనోహర్ ఇప్పటివరకూ భావించాడు. ఇప్పుడు అలా గాకుండా సుచిత్ర ఉత్తమ సంస్కారవంతురాలనీ, తన హృదయమంతా ఆమెను ఆక్రమింపజేసి తనలో లీనం చేసుకోవాలనీ భావింపసాగాడు.

సుచిత్ర కూడ మనోహర్‌మీద అదివరకులేని ఒక ఉదాత్తమైన భావం ఏర్పడింది. ఆయన సంగీత సాహిత్యప్రియుడనీ, సుకుమార హృదయుడనీ, నిగ్రహశీలుడనీ తెలుసుకుంది. ఆమె హృదయంలో తనకు స్థానం

దొరికినా దొరకకపోయినా-శ్రీపదముల దగ్గర స్థానం దొరికినా తానెంతో ధన్యురాలని భావించింది.

'ఇటువంటి సత్యశీలుని కన్న ఆ మాతృమూర్తి ఎంత ధన్య! ఆ మాతృమూర్తి కట్టిన పూజా వస్త్రాన్ని కట్టిన తాను ఎంతటి ధన్యురాలను' అని అనుకుని అద్దంలో సర్వాంగాలమీద శోభిస్తున్న ఆ చీరెను జూచి మురిసిపోతున్నది. అప్సరసకులేని చక్కదనం తనకు వచ్చినట్లు ఆనంద పరవశురాలవుతున్నది.

ఇద్దరు-మనోహర్, సుచిత్రలు ఒకరినొకరు జూచుకున్నారు. గంగా యమునలు తమ అనంత ప్రవాహ యాత్రలో-ప్రయాగలో కలుసుకున్నట్లు ఆ యిద్దరు భావస్రవంతులు యేకమైనవి. రెండు మహానదులు సంగమించి, మరింత వేగంతో తూర్పుకు ప్రవహించినట్లు, విడివిడిగా వున్న యిరువురి భావస్రవంతులు మనోవృత్తులు కలిసి మేకమై ముందుకు పయనించడానికి ఉద్యుక్తమౌతున్నవి. సంస్కారవంతులైన జీవులు ఏమి కోరుకుంటారో, ఆ పరమార్థాన్ని సాధించాలని ఇరువురి మనస్సులు పరితపిస్తున్నవి. కామ వాసన అందులో అంత ప్రాధాన్యం కాదు. ఈ విధమైన మనోవృత్తులు వున్న జీవులకు ఆశాభంగం గలుగుగదు గదా!

మనోహర్ సుచిత్రని వింతగా జూచి "స్కూలుకు వెళ్ళకుండానే యిదంతా ఎక్కడ నేర్చుకున్నావు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర విచారంతో "అవును! నేను స్కూలులో చదువుకోలేక పోయాను. ఆరేడు తరగతులవరకు మాత్రమే చదువుకోగలిగాను. తరువాత మా అమ్మ చదువు మాన్పించింది. అదికూడ నా మంచికే జరిగింది. పుస్తక పఠనం, శ్రీ శాస్త్రిగారి శుశ్రూష నాకు లభించింది." అని భక్తితో కనులు మూసుకుంది.

మనోహర్ ప్రక్కకు జూస్తూ సుచిత్రతో "నీవొక వేశ్యకుమారి ని ఆ యనకు దెలియదా?" అని ప్రశ్నించాడు.

ఆ మాటకు ఆమె మళ్ళీ బాధ పడుతుందేమోనని ఆ మాట ఎందుకు అన్నానా అని మనోహర్ తనలో తాను చింతింపసాగాడు.

ఇరువురి వ్యక్తులయందు పరిపూర్ణ స్నేహభావం గలిగిన తరువాత ఒకరినొకరు కష్టం గలిగించే మాట పలికినప్పటికీ దానిని తెక్కజేయరు. ప్పుడు వారిరువురికి అదే జరిగింది.

సుచిత్ర నమ్ర భావంతో 'శాస్త్రిగారు సహజంగా వేశ్యలకు యా ీత నాట్యాలను నేర్పకపోవడమే గాదు, దగ్గరకు కూడా రానిచ్చేవారు ు. వారికి నామీద కారణ మేమో తెలియదు. నా జన్మాంతర మహాదృష్ట ు భావిస్తాను. వారు తమ సంతానంతో సమానంగా భావించుకునేవారు. వేళ వారి సంస్కారభావమే నాకు కలుగకపోతే—నేను ఎక్కడ వుండేదా ? ఒక వేశ్యగా-ఒక నర్తకిగా" అంటూ ఆగిపోయింది.

వెంటనే మనోహర్ సరిభాషణను మార్చి లేని నవ్వు దెచ్చుకుని- చిత్రా! విజయవాడకువెళ్ళి ఏదైనా పని చూసుకుని బ్రతుకుతానన్నావు. ఏమేమి పనులు వచ్చునో నాకు తెలిసింది. అయితే నీకు జీతం ఎంత ాలి?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర అదివరకు వున్న వేదనను, మనోభావాలని మరిచిపోయి ోహర్ మాటలకు ఒక్కసారిగా పకపక నవ్వి "నాకు జీతం, బత్తెం వద్దు. అన్నం బట్టలుయిస్తే-వారికి జీవితాంతం వరకు సేవజేస్తాను"అని కింది.

మనోహర్ మృదువుగా "నీకు అన్నం బట్టలు యిస్తాను. నాకు చేస్తావా సుచిత్రా!" అని ప్రశ్నించాడు.

సుచిత్ర వెంటనే "మీకా?" అని ప్రశ్నించింది.

"అవును! నాకే" అని పలికాడు.

సుచిత్ర ఆతురతగా రెప్పలార్చి మనోహర్‌తో 'మరి నన్నేం చేమ టారు? నేను మీకు ఏమేమి పనులు చేసిపెట్టాలి?" అని మందస్మితంగా ్నించింది.

మనోహర్ గూడ సన్నని చిరునవ్వు నవ్వుతూ "నీవు నాకు పనులు చేయనవసరంలేదు. నా మనస్సు కలత జెందినప్పుడు పాటలు పాడించు టాను. నృత్యం చేయించుకుంటాను."

సుచిత్ర కనుబొమ ముడివైచి గంభీరంగా "మనోహర్‌గారూ! నా పాటలు వింటూ వుంటే, నా నృత్యం చూస్తూవుంటే మీరు పిచ్చివాళ్ళు అవుతారు. అనార్కలీని బ్రతికుండగానే సమాధి గట్టినట్లు, నన్ను గూడ మీ నాన్నగారు సమాధి కడతారు" అని పలికింది.

మనోహర్ సుచిత్ర ముఖంమీది బొమ ముడి విచిత్రంగా కనిపించింది. ఎర్రని తామరపూపుమీన తుమ్మెద వ్రాలినట్లు భావించాడు.

సుచిత్రతో మృదువుగా "ఇది అక్బర్ నాటి కాలంకాదు సుచిత్రా! నా తల్లిదండ్రులు నిన్ను అక్కున జేర్చుకుంటారు" అని పలికాడు.

సుచిత్ర వెంటనే సరస సంభాషణను త్రుంచివేస్తూ "మనోహర్ గారూ! ఎనిమిది గంటలు దాటింది. త్వరగా నన్ను ఏ రైలో, బస్సో ఎక్కిద్దురుగాని! మీకు పుణ్యం వుంటుంది" అని యాతురతగా పలికింది.

మళ్ళీ ఆమె ముఖంలో భయం, ఉద్వేగం తొంగి చూస్తున్నవి. అశ్లేష కార్తెలో ఉండి ఉండి వానజల్లులు వస్తూ వుంటవి. కొద్దిసేపు వాన, కొద్దిసేపు ఎండ కాస్తూ వుంటవి. ఆ విధంగానే సుచిత్రలో కూడ కొద్దిసేపు సంతోషం, ఉద్వేగం తరంగాలుగా వరుసగా రావడం మనోహర్ గమనించాడు.

ఆ సమయంలో మనోహర్ కూడ ఒక విధమైన ఉద్వేగానికి లోనయ్యాడు. నిగ్రహం గలిగిన మనుష్యులు గూడ ఒక్కొక్కప్పుడు అయోమయంగా వ్యవహరిస్తూ వుంటారు. అట్టి స్థితే మనోహర్‌కు గూడ గలిగింది.

మనోహర్ ఆవేశంతో "సుచిత్రా! పుణ్యం వుంది కాబట్టే-నీవు నాకు దొరికావు. నిన్ను వదిలిపెట్టను. ఏవీ నీకరపల్లవాలు, పాణిగ్రహణం చెయ్యనియ్యి" అని సుచిత్ర కోమల హస్తాలను మనోహర్ గ్రహించాడు.

సుచిత్ర నిశ్చేష్టురాలై మనోహర్ మాటలను, చేష్టలని జూస్తూ క్షణం నిలబడిపోయింది.

"నువ్వే పెళ్ళికోసం తపిస్తున్నావో, ఆ పెళ్ళి నేను జేసుకొంటాను: నువ్వే భర్తకోసం పరితపిస్తున్నావో ఆ భర్తని నేనవుతాను. భద్రకాళి జగన్మాత మనకు సాక్షి" అని పలికి మనోహర్ ఆగిపోయాడు.

సుచిత్ర మనోహర్ ఆవేశానికి విస్తుపోయింది. ఆమెకు అతనిమీద కోపం రాకపోయినా చేతులు వెనకకు దీసికొని "మనోహర్‌గారూ! నేను మీకు భార్యను గాలేను. మీరు నాకు భర్త గాలేరు" అని గద్గదస్వరంతో పలికింది.

మనోహర్ అదే ఆవేశంతో "ఎందుకని సుచిత్రా? ఎందుకు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర వేదనా పూరితమైన మందస్వరంతో "మీరు ఉన్నత కుటుంబానికి చెందిన ధనవంతులు, నేను పడుపు వృత్తి కులానికి జెందిన మంద భాగ్యురాలను" అని కన్నీరు తొణికింది.

మనోహర్ కన్నీటి బిందువులతో నిండిన సుచిత్ర నేత్రాలను, ఆమె కట్టుకున్న పట్టుచీరె బంగరు జరీయంచు కొంగుతో అద్దుతూ-

"సుచిత్రా! నా దృష్టిలో నీవు పతితవు కావు. పావన మూర్తివి! నా ధర్మపత్నివి!" అంటూ ఆమె మోమును తన హృదయానికి అద్దుకొనబోయారు. కాని ఎందుకనో అంతటి సాహసం చేయలేకపోయాడు,

సుచిత్ర మనోహర్‌కు దూరంగా తొలగి అతని ముఖాన్ని— అంతటి మాటలు అనబోకండి మనోహర్‌గారు! సమాజం, సంఘసూత్రాలు అంగీకరింపవు. మీ ముందు మీ తల్లి దండ్రులు అంగీకరింపరు.

మనోహర్ ఉద్వేగంగా ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా, నీ కోసం సర్వస్వం త్యాగం చేస్తాను. ఎవరెన్ని కష్టాలు బెట్టినా సహిస్తాను. సుచిత్రా! నీవు నాతో కలిసి పయనిస్తావా లేదా! ఒక్కమాట చెప్పు" అని తీవ్రంగా ప్రశ్నించాడు.

సుచిత్ర మనోహర్ ఉద్వేగంతో వున్నాడనీ, ఆ సమయంలో తాను తీవ్రంగా మాట్లాడితే-అతడు మరింత ఆవేశపడిపోతాడనీ గ్రహించింది.

సుచిత్ర కంఠం మార్చి ధీరోదాత్తంగా. స్పష్టంగా నాకోసం మీరెందుకు కష్టాలు కొనితెచ్చుకుంటారు? మంచి ధనవంతురాలయిన ఒక కులీన యువతిని పెండ్లి చేసికొని సుఖంగా కాపురం చెయ్యండి. జీవితం అనేది

సుఖపడటానికి మనోహర్‌గారు! సుఖపడడానికి. కష్టాలు కొనితెచ్చుకోవ డానికి కాదు" అని నెమ్మదిగా పలికింది.

మనోహర్‌కు ఇంకా ఆవేశం తగ్గలేదు. "సుచిత్రా! నేను నా జీవితంలో ఇంతవరకు ఎవరినీ ప్రేమింపలేదు. ఇంత స్వేచ్ఛగా ఎవరితోనూ మాట్లాడలేదు. నిన్ను దప్ప! నీతో దప్ప! నిన్ను వివాహం చేసుకుంటాను" అని పలికాడు.

సుచిత్ర మనోహర్ వాక్యాలను త్రుంచివేస్తూ—"ఇంత గొప్ప త్యాగం, నాకోసం మీరెందుకు చెయ్యాలి? నన్ను మీరు వివాహము చేసికున్నట్లయితే, దలిదండ్రులకు, బంధుమిత్రులకు దూరమవుతారు. సంఘాన్ని ఎదిరింపవలసి వస్తుంది. మనకు వివాహం చేసుకున్న తరువాత ఎన్నో కష్టాలు ఎదురౌతవి. ముఖ్యంగా మీ జీవితం సుడిగుండాలలో చిక్కుకుంటుంది. అనేక తుఫానులను ఎదుర్కొవలసి వస్తుంది" అని పలికి క్షణ కాలం ఆగింది.

మనోహర్ వెంటనే అందుకుని "అన్నిటినీ సంతోషంగా ఎదుర్కొంటాను. చిరునవ్వుతో సహిస్తాను." అని పలికాడు.

సుచిత్ర కొంచెం గంభీరమయిన స్వరంతో "మనోహర్‌గారూ? సంఘాన్ని ఎదిరించడం అంత తేలికగాదు! నామట్టుకు నేను సంఘాన్ని, సంఘ నియమాలను గౌరవిస్తాను. సంఘంలోని జనులు సంఘనియమాలు పాటించినప్పుడే సంఘం సంఘంగా నిలుస్తుంది. అయితే-సంఘంలో కొంత అవినీతి, కొన్ని అక్రమాలు మొలకెత్తి, మహావృక్షంలా పెంపొందుతాయి. సంఘ వినాశనానికి సాధనాలుగా పరిణమిస్తాయి. అటువంటి సమయంలో యుగపురుషులు, మహాత్ములు ముందుకొచ్చి అవినీతిని, అక్రమాలను క్షాళన జేయడానికి పూనుకొంటారు. మన సంఘంలో అంటరానితనం, వడ్డీవృత్తి, బీదతనం మొదలయినవి చీడపురుగులు. దీనిని నిర్మూలించడానికి ఎంతోమంది మహాపురుషులు ప్రయత్నించారు. ప్రయత్నిస్తున్నారు! వారికి నా వందన సహస్రములు!" అని క్షణకాలం ఆగిపోయింది.

ఆమె ఉపన్యాసచాతుర్యం, వ్యక్తిత్వధోరణి జూస్తూ మనోహర్ నివ్వెరబోయాడు.

సుచిత్ర మళ్ళీ తన ఉపన్యాసధోరణిలో మాట్లాడటం మొదలు బెట్టింది. "మనోహర్ గారూ! సంఘం సంగతి దూరంగా వుంచండి. ముక్కు ముఖం తెలియని నాకోసం మీరెందుకు కష్టపడాలి? సమాజంలో నాలాంటి అనాథలు, దీనలు కోకొల్లలు! పవిత్రంగా గృహజీవితం గడపాలనే అనేక మంది స్త్రీలు ఈ పడుపువృత్తికి బలి అవుతున్నారు. కొంతమంది విలాస వంతులు, ధనవంతుల యైశ్వర్యానికి, క్రూరత్వానికి బలి అవుతున్నారు. నా గురించి మీరు బాధలు కొనితెచ్చుకొనకండి. ప్రస్తుతానికి మీరు నా శీలాన్ని కాపాడారు ధన్యవాదాలు! స్టేషనువాకా వచ్చి నన్ను రైలెక్కించండి!" అని పలికింది.

కథ మళ్ళీ మొదలుకురావడం మనోహర్ గ్రహించి, తీవ్రంగా "సుచిత్రా! నామీద నీకు విశ్వాసంలేదా? ఒంటిరిగా పురుషుడు జీవించగలడు. కాని స్త్రీ- స్త్రీ జీవించడం అసాధ్యం! వృక్షం ఆధారంలేకుండా మనగలుగు తుంది. తీగెకు ఏదో ఒక ఆధారం అవసరం. స్త్రీ గూడా తీవెలాంటిది. ఆమెకు భర్తో, కుమారుడో, బంధువో ఎవరో ఒకరు అవసరం.

నీ శీలాన్ని కాపాడాను. నీ జీవిత నౌకను గూడ తీరంజేరుస్తాను. నా ప్రేమను తిరస్కరిస్తావా సుచిత్రా!" అని మనోహర్ దీనంగా పలకాడు.

అతని కళ్ళల్లో నీళ్ళుదిరగడం సుచిత్ర జూచింది. 'లోకంలో పురు షులలో యింతటి మృదుహృదయం గలవారుంటారా?' అని సుచిత్ర ఆశ్చ ర్యము పొందింది.

"మనోహర్ గారూ! మీరు బాధపడకండి, మీలాంటి సహృదయు డైన వ్యక్తికి భార్యగా వుండడంకంటె అదృష్టం మరేముంటుంది? మిమ్మల్ని వివాహం చేసుకోవడమేకాదు, మీకోసం అగ్నిలో దూకడానికి కూడా నేను సంసిద్ధం!" అని సుచిత్ర పలికి ఆగిపోయింది.

సుచిత్ర పలికిన ఆ మాటలకు మనోహర్ ఆనంద సముద్రంలో మునిగితేలాడు. పేయిచందమామలు ప్రకాశించినట్లు చిరునవ్వు నవ్వి, సుచిత్ర హస్తాలను తన హస్తాలలోనికి తీసుకున్నాడు.

సుచిత్ర తన చేతులను వెనుకకు దీసికొనకుండా "మనోహర్ గారూ! యీ వివాహానికి మీ తల్లిదండ్రులు అంగీకరిస్తారా?" అని ప్రశ్నించింది.

"తప్పకుండా అంగీకరిస్తారు. రేపు ఉదయం తొమ్మిదిగంటలకు జనగాంలో వివాహం జరుగుతుంది" అని మనోహర్ పలికి శీర్షమును తన దక్షిణ హస్తంతో స్పృశించాడు.

"ఒకవేళ వారు అంగీకరింపకపోయినట్లయితే" అని సుచిత్ర భయముతో మనోహర్ హృదయంలో తలదాచుకుంది.

పట్టుబట్టలతో పరమపునీతగానున్న ఆమెను తన హృదయాని కద్దుకున్నాడు. అరుణకాంతులతో మెరుస్తూ, నుదుటి పైభాగమున ముంగురులలోనున్న కుంకుమరేఖలను చుంబిస్తూ "నాతల్లిదండ్రులు తప్పకుండా ఒప్పుకుంటారు." అని మనోహర్ పలికాడు.

సుచిత్ర తలయెత్తి కుంకుమరేణువులు అంటుకొని పగడంవలె మెరుస్తున్న అతని అధరాన్ని తన చేతితో తుడిచి వెనుకకు జరిగింది.

ఇంతలో మనోహర్ మనసులో ఒక ఆలోచన తట్టింది. ఈ రోజున అతని మిత్రుడు సుధాకర్ వివాహం అని గుర్తుకొచ్చింది. బల్లదగ్గరకొచ్చి ఒక శుభలేఖను దీసి చదివాడు.

ఈ రోజున పిల్లతరపువారు (జనగాం నుండి వచ్చి) పిల్లవానిని తీసికొనివెడతారని అర్థం చేసుకున్నాడు. వాళ్ళతోబాటు సుచిత్రను యిచ్చటినుండి తప్పించి, పెళ్ళివారితోబాటు జనగాం వెళ్ళి, అచ్చటినుండి విజయవాడకు తేలికగా జేరుకొనవచ్చునని నిశ్చయించుకున్నాడు.

తన మనస్సులో ఉదయించిన ఆలోచనాతరంగాన్ని బయటపెట్టకుండా, "సుచిత్రా! సాధ్యమైనంత త్వరగా మన మిచ్చటినుండి వెళ్ళిపోవాలి. ఎవరైనా మిత్రుని జీపులోనో, కారులోనో నిన్ను స్టేషనుకు తీసికొని వెళ్ళాలి. అక్కడినుండి మనం విజయవాడ వెళదాం!" అని పలికాడు.

సుచిత్ర అలాగేనని తలవూపింది. కాని ఆ పని అంత తేలికైనదని ఆమె భావింపలేదు.

మనోహర్ సుచిత్రతో తన గడియారం చూచి "ఇప్పుడు తొమ్మిది గంటలు అయింది. పన్నెండు గంటలకల్లా నేను అన్ని ఏర్పాట్లుజేసి నిన్ను తీసికొనివెళతాను. సిద్ధంగా వుండు. నేను బయట తాళంవేసి వెళతాను. నీవు యీ గదిలోనే జాగ్రత్తగావుండు. ఎవరైనా బయట పిలిస్తే పలుక వద్దు." అని పలికాడు.

మనోహర్ చెప్పిన మాటలన్నీ సుచిత్ర చిత్తరువువలె వింటూ తల వూపింది.

"ఇప్పుడు నీవు వంటప్రయత్నంచేస్తే బయటివారెవరైనా జూస్తారు. అనేక అనుమానాలకు అవకాశం గలుగుతుంది. కాబట్టి ఇవిగో! ఈ పండ్లు, రొట్టె, టీని త్రాగుతూ, ఆకలికి పోగొట్టుకో. నేను సాధ్యమైనంత తొంద రలో రావడానికి ప్రయత్నిస్తాను." అని మనోహర్ అద్దంలో ముఖంజూచు కొని, తల దువ్వుకొని బయటికి బయలుదేరాడు.

సుచిత్ర కొంచెం చిన్నబోయిన ముఖకళవళికలతో "మీరు త్వరగా రండి" అని ఒక్క పలుకు పలికింది.

మనోహర్ "అట్లాగే"నని ముందుగదిలోకి వెళ్ళి కిటికీ తలుపులన్నీ గడియవేసి వున్నవో-లేదో ఒకసారి చూచి, బయటికివెళ్ళి వీధితలుపు తాళం వేశాడు. మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

సుచిత్ర తన యీ విచిత్ర పరిస్థితికి కనులు మూసికొని, లోపల గదిలో బల్లమీద కూర్చుని తన విషాద జీవితాన్ని నెమరువేసుకోవడం ప్రారంభించింది.

* * * *

తను ప్రస్తుతం వున్న పరిస్థితికి మనస్సులో తీరనివేదన గలగడమే కాదు- విషాదకరమైన నవ్వుకూడ వస్తున్నది. తన పదునారేండ్ల జీవితంలో ఎప్పుడూ యిటువంటి సంఘటన జరుగలేదు.

ఈ మనోహర్ ఎవరు? తను ఎవరు? అతడు ఒక కులీన కుటుం బంలో జన్మించిన యువకుడు. తానొక వేశ్యావృత్తిలో జీవించే కులట కుమార్తెను.

ఇతడు తనను వివాహమాడతాడా? ఇతని తల్లిదండ్రులు ఒప్పుకుంటారా? ఒప్పుకొనకపోతే తన గతి ఏమిటి? మళ్ళీ తన తల్లిదండ్రుల దగ్గరకొచ్చి, ఆమెను ఆశ్రయించవలసినదేనా? నేను యీ విధంగా ఇంటిలో నుండి పారిపోయినందుకు తనను ఏ విధంగా శిక్షిస్తారో! ఈ విధమైన హృదయ తరంగాలు ఆమె హృదయమందిరంలో కల్లోలితమైనవి.

తాను స్నానం జేసిన బట్టలు ఆరవేసిందిగాని, అవి ఆరలేదు. మనోహర్ యిచ్చిన అతని మాతృమూర్తి బట్టలతోనే వున్నది.

బల్లమీద కూర్చుంటే పట్టుబట్ట మాసిపోతుందేమోనని, ప్రక్కనున్న కుర్చీని దులిపి, అచ్చటనున్న ఒక తుండుగుడ్డను పరచి, దానిమీద కూర్చుంది.

అనంతమైన విషాదంతో కుమిలిపోతూ, చెంపలక్రింద కుడిచేతిని జేర్చి, మోచేతిని బల్లమీద ఆనించి, కనులు మూసికొని, బాల్యంనుండి జరిగిన తన జీవిత విశేషాలను ఒక్కటొక్కటిగా స్మృతికితెచ్చుకొనడం ప్రారంభించింది. అదెట్లా వున్నదంటే- ఆసక్తిగల పాఠకుడు తనకిష్టమైన గ్రంథాన్ని ఒక్కొక్క పుటను తిరుగవేస్తూ వున్నట్లున్నది. విషాద సాగరంలో ఒక స్త్రీమూర్తిని గొప్ప శిల్పి చెక్కినట్లుగా వుంది.

చిన్నప్పటి తన బాల్యస్మృతులు ఒక మధుర తరంగంగా హృదయంలో కదిలింది. తన తల్లి పరిమళం తనను అల్లారుముద్దుగా పెంచింది. ఏది కావాలనుకుంటే- అది తెచ్చి యిచ్చేది మంచి బట్టలు, పండ్లు, పాలు యిచ్చి చక్కగా పెంచింది. తనకు తండ్రి లేడు. "నాన్న ఏడమ్మా?" అని చిన్న వయస్సులో అడిగితే-

"నాన్న లేడు. దూరదేశానికిపోయి తిరిగిరాలేదు!" అని చెప్పేది.

పెరిగి పెద్దదాన్ని అయినకొద్దీ, అన్నీ గ్రహించేదాన్ని, అనేకమంది పురుషులు మా ఇంటికొచ్చేవారు ఆ రోజున వచ్చినవారు మరునటిరోజు వచ్చేవారుకాదు. మళ్ళీ ఎప్పుడో వచ్చేవారు! స్త్రీలుకూడ ఎక్కడినుండోవచ్చి, ఒకటి రెండూ రోజులు మా ఇంటిలో బసచేసి వెళ్ళిపోతూ వుండేవారు.

మా ఇల్లు రెండు మూడు గదులుండే చిన్న ఇల్లుకాదు. ఏడెనిమిది గదులు, ముందు హాలు వుండేది. పైన అంతస్థు కూడ వుంది. పైన కూడ అటు రెండు గదులు, ఇటు రెండు గదులుండి మధ్య ఖాళీస్థలం వుండేది.

ఇంటి వెనుక విశాలమైన దొడ్డి కూడ వుండేది. అనేకమైన చెట్లు చేమలతో పాడుబడిన ఉద్యానవనంలా వుండేది. అయిదారు కొబ్బరిచెట్లు, రెండు మూడు మామిడిచెట్లు వుండేవి.

ఒక భాగంలో నేను శుభ్రంచేసి, ఎన్నో పూలచెట్లు నాటేవాన్ని. ఒక మల్లెతీగె, సన్నజాజి పూలతీవె విశాలమైన పందిళ్ళలో ప్రాకించేదాన్ని.

అంతేగాక ఆయా కాలాల్లో పూచే బంతి, చేమంతి, గోరింట మొదలైన మొక్కలను నాటి, పూలు పూయించేదాన్ని. బ్రతుకమ్మ పండుగకు మా వీధిలోని వారందరూ మా ఇంటికి పూలకోసం వచ్చేవాళ్ళు. నేను బ్రతుకమ్మకు కావలసిన పూలు తీసుకొని, తక్కిన పూలను ఇతర బాలికలకు పంచిపెట్టేదానను. అంత పెద్ద భవనం మా అమ్మ ఎలా సంపాదించిందో నాకు తెలియదు.

మా అమ్మ దగ్గర ఎన్నో బంగారు నగలు, ధనం వున్నట్లుగా అందరూ చెప్పుకునేవారు. వచ్చేవాళ్ళు-పోయేవాళ్ళు ఎంతమంది వున్నా ఆ ఇంట్లో స్థిరంగా వుండేది ముగ్గురము. నేను, మా అమ్మ పరిమళం, రంగడు. రంగడ్ని రౌడీ రంగడు అని అందరూ పిలుస్తూ వుంటారు. అతడు ఎప్పుడు వస్తాడో, ఎక్కడ వుంటాడో ఎవరికీ తెలియదు. అతడు సంవత్సరానికి ఆరునెలలు జైలులో వుంటాడని తెలిసింది. అతడు మా అమ్మ పరిమళానికి తమ్ముడు అయినా చిన్నప్పటి నుండి అతనిని నేను అసహ్యించుకునేదానను.

మా అమ్మ పరిమళం రంగడ్ని కూడ అసహ్యించుకుంటుంది. కాని రంగడు మా అమ్మ పరిమళం దగ్గరనుండి అదిరించి, బెదిరించి అప్పుడప్పుడూ డబ్బు తీసికొనిపోతుంటాడు. డబ్బు ఇవ్వకపోతే ఏదో రహస్యం వెల్లడి చేస్తానని బెదిరించేవాడు. ఆ రహస్యం ఏమిటో మరి?

వ్యభిచారవృత్తి అంటే నేను చిన్నతనం నుండి అసహ్యించుకునే దాన్ని. నాకు ఊహ తెలిసిన దగ్గర నుండి మా అమ్మ పరిమళంతో కూడ పోట్లాడేదాన్ని. నామీద వున్న ప్రేమతో 'అది కులవృత్తి అమ్మా!' అని నన్ను బుజ్జగిస్తూ వుండేద్ధి.

దగ్గర వున్న పాఠశాలలో ఏడవ తరగతి వరకు చదివాను. అప్పుడు నాకు పన్నెండు సంవత్సముల వయస్సు.

ఇంటిలో నాకు సరియైన పర్యవేక్షణ లేకపోవడంచేత లెక్కలలో ఇంగ్లీషులో తప్పడం జరిగింది.

మా అమ్మ పరిమళం ఉన్న చదువు చాలని చెప్పి ఇంట్లోనే సంగీతం, నాట్యం నేర్చుకొనమని ఒక సంగీతం మాష్టారుని కుదిర్చింది. ఆ సంగీతం మాష్టారుకు సంగీత శిక్షణగాని, నాట్యకళారీతులుగాని తెలియవు. లలిత సంగీతమని చెప్పి ఏవో రెండు గాలిపాటలు నేర్పేవాడు. నాట్యమని చెప్పి ఏవో గంతులు వేయిరిచేవాడు. శాస్త్రీయ నాట్యకళా విన్యాసముగాని, కళాగాన పద్ధతులుగాని తెలియని అజ్ఞాని.

"ఉదరనిమిత్తం—బహుకృత వేషః" అన్నట్లు ఆ సంగీతం మాష్టారు నాట్య సంగీతాలు నాకు నచ్చలేదు. నాకు వద్దని నిరాకరించాను. మా అమ్మ నేర్చుకొమ్మని బలవంతం చేసింది. నేను వద్దని పట్టుబట్టడంతో ఆమె మెత్తబడ్డది. అంతటితో నా సంగీత నాట్యాలకు స్వస్తి జరిగింది.

తరువాత నేను పుస్తక పఠనంతో కాలం గడిపేదాన్ని. ఇంటి పనులలో మా అమ్మకు సాయంచేసేదాన్ని. ఇంటి వెనుక వున్న తోటలో శిధిలావస్థలో వున్న ఒక గది వుండేది. నేను ఎప్పుడూ ఆ గదిలో పుస్తక పఠనంలో కాలం గడిపేదాన్ని.

మా ఇంటికి సమీపంలో ఒక గ్రంథాలయం వుండేది. ఆ గ్రంథాలయంలో చందాదారిణిగా జేరి, కొంత డబ్బు అడ్వాన్సుగా కూడ చెల్లించాను. వారానికి ఒకటి రెండుసార్లు గ్రంథాలయానికి వెళ్ళి పుస్తకాలు తెచ్చి చదువుకుంటూ వుండేదానను.

మొదట్లో ఏవో చిన్న చిన్న కథలు, ఏవేవో చిన్న చిన్న నవలలు చదివేదాన్ని. నిరంతర అధ్యయనం వలన సరస్వతీదేవి ప్రసాదం వలన పుస్తక పఠనంలోగల రుచిని గ్రహింపగలిగాను.

శరత్‌బాబు నవలలు మొదట్లో నన్నెంతో ఆకర్షించినవి. ఒక పుస్త కాన్ని రెండు మూడుసార్లు చదివేదానను. చదివిన తరువాత నెమరువేసు కునేదానను. పుస్తకంలోని పాత్రలు కనులముందు తిరుగుతున్నట్లు భావించే దానను. పుస్తకం చదవడం పూర్తి కాబోతుంటే-ఆ పాత్రలతో సంబంధం తెగిపోతుందిగదా అని బాధగా వుండేది.

అలాగే విశ్వనాథవారి 'ఏకవీర, వేయిపడగలు' కూడ.

అనేకమంది తెలుగు కవుల రచనలు కూడ పఠించాను.

విశ్వకవి రవిబాబు 'గోరా' ఎన్నిసార్లు చదివానో నాకు తెలియదు.

వచన రూపంలోవున్న భారత, రామాయణ, భగవద్గీత గ్రంథాలను పఠించాను. భక్తిభావంతో స్వల్పమైన హిందీ భాషా పరిచయం వున్నప్ప టికీ తులసీరామాయణాన్ని పఠించాను. అలాగే గోర్కీ రచించిన నవల 'అమ్మ' ముల్క్‌రాజ్ ఆనంద్ రచించిన 'రెండు ఆకులు ఒక మొగ్గ' శ్రద్ధతో చదివాను. కష్టజీవుల దురదృష్టవంతుల జీవిత కష్టాలు విశ్వ మంతటా వున్నవిగదా అని కంటతడి పెట్టాను. మొదట ఆ పుస్తకాలు అర్థంకాకపోయినా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించేదానను.

గాంధీజీ ఆత్మకథను, ఆయన ఎరవాడ జైలు జీవితంలో భగవద్గీ తకు చేసిన వాఖ్యానాన్ని(పి వ్వేని సుబ్రహ్మణ్యంగారు తెలుగులో అనువదిం చారు.)

చిన్న గ్రంథం దొరికింది. దానిద్వార భగవద్గీతను తేలికగా అర్థం చేసుకోగలిగాను.

ఈ విధంగా అధ్యయనంతో రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచి పోయినవి. మూడు సంవత్సరాల పుస్తకపఠనంతో నాకు కొంత లోకజ్ఞానం. భాషాజ్ఞానం పెరిగింది. అప్పుడప్పుడు దినపత్రిక గూడ చదువుతుండేదానను. కాని వానినంత శ్రద్ధగా చదువుతూ వుండేదానను గాను.

ముఖ్యంగా ఈ అధ్యయనం అనేది నా వేదనను, నేనున్న పరి స్థితిని మరచిపోవడానికి దోహదం చేసింది.

'నేను ఒక వేశ్య కూతురునుగదా! నన్నెందుకు యీ విధంగా సృజించావు పరమేశ్వరా! పూర్వజన్మలో నేనేం పాపం చేశానో!' అని నా మనసు రోదించేది.

నేను మా అమ్మతో ఈ వేశ్యావృత్తిని సాగించడం మానవలసిందని ఎంతో గోల చేసేదాన్ని. ఆమె మొదట నిరాకరించిందిగాని, తరువాత తరువాత ఆమెలో మార్పు వచ్చింది. ఆ వృత్తిని సాగించడం మానకపోతే తాను చచ్చిపోతాననీ-ఎక్కడికైనా వెళ్ళిపోతానని బెదిరించాను.

ఆమెకు నేనే దిక్కనీ, సంపాదించే ధనం ఎవరికోసమని భావించి, ఆ వృత్తికి స్వస్తి చెప్పింది. పూజలు అర్చనలతో మునిగి తేలేవి. రోజూ ఏదో ఒక దేవాలయానికి వెళ్ళి దేవదర్శనం చేసుకునేది.

ఆమెతో నేను కూడ వెళ్ళి దేవదర్శనంతో బాటు హరికథ, పురాణ పఠనాలను శ్రద్ధగా వినేదానను. ఆమెలో వచ్చిన మార్పుకు నేను చాలా సంతోషించాను.

మరి రెండు సంవత్సరాలు ఈ విధంగా గడిచిపోయినవి. నా పుస్తక పఠనం గూడ క్రమబద్ధంగా జరిగిపోతున్నది.

ఒకనాడు మా అమ్మ, నేను భద్రకాళిదేవాలయానికి వెళ్ళి తిరిగి వస్తున్నాము. ఒక సందులో ఒక ఇంటి నుండి సంగీత, నృత్య, మృదంగ ధ్వనులు వినిపించినవి. మేమక్కడికి వెళ్ళి కొద్దిసేపు కూర్చున్నాము.

బ్రహ్మతేజస్సుతో ఒక బ్రాహ్మణుడు కుర్చీలో కూర్చున్నాడు. ముఖంమీద విభూతిరేఖలు, కుంకుమబొట్టు ప్రకాశిస్తున్నవి. పట్టుశాలువ కప్పుకొని వున్నాడు. చేతికి బంగారు కంకణం మెరుస్తూ వున్నది. చెవులకు మకరకుండలాలు ధగ ధగమంటున్నాయి. పది పన్నెండు సంవత్సరాల బాలబాలికలు వారి దగ్గర నృత్య సంగీతాలు నేర్చుకుంటున్నారు. అచ్చట నేర్చుకుంటున్న పిల్లలందరూ ఉన్నతోద్యోగులైన ధనవంతుల బిడ్డలు! వారిలో మగపిల్లలు కూడ వున్నారు.

ప్రక్కవారిని విచారింపగా, వారి పేరు కూచిపూడి లక్ష్మీనరసింహ శాస్త్రిగారనీ, వారిది కృష్ణాజిల్లాలో వున్న కూచిపూడి గ్రామమనీ. అచ్చట నుండి వలస వచ్చి వరంగల్‌యందు స్థిరనివాసం ఏర్పరచుకున్నారనీ తెలిసింది.

వారు కొంత భృతిని దీసికొని ఉదయం, సాయంత్రపు వేళలయందు నాట్య సంగీతములయందు శిక్షణ యిస్తారనీ తెలిసింది. విద్యార్థులు పాఠశాలలకు వెళ్ళి, తిరిగివచ్చి, సాయంత్రపు వేళలలో నృత్య సంగీతములను నేర్చుకుంటారనీ తెలిసింది.

నాకు శాస్త్రిగారి శిక్షణా పద్ధతి నచ్చింది.

నాకు కల్పవృక్షము, కామధేనువు దొరికినంతగా సంబరపడ్డాను. నా జీవితమునకు దారిదొరికినదని నా మనసు నాట్యం చేసింది. నేను శాస్త్రిగారి శిష్యురాలినై పూర్తిగా గాకపోయినా, కొంతయినా సంగీత నాట్యములను నేర్చుకోవాలని నిశ్చయించుకున్నాను. ఈ విషయం మా అమ్మ పరిమళానికి జెప్పాను. ఆమె ముందు అంగీకరించలేదు. తరువాత ప్రేమతో అంగీకరించింది.

శాస్త్రిగారు డబ్బుయిస్తే-ఇంటికివచ్చి సంగీతనాట్యాలు నేర్పుతారా? అని విచారింపగా, వారు యెవరి ఇంటికీ రారనీ, వేశ్యలు మున్నగువారికి అసలు నేర్పరని తెలిసింది. నేను స్తబ్ధురాలనయ్యాను. అలనాటి ద్రోణాచార్యులవారు విలువిద్య నేర్పుటకు నిరాకరించిన ఏకలవ్యునివలె తల్లితో బాటు ఇంటికి నిరాశతోతిరిగివచ్చాను.

ఆనాటి రాత్రి నాకునిదురలేదు. ఏవిధంగానైనా సంగీతనాట్యాలను స్వల్పంగానైనా నేర్చుకుని, జీవిత శిరమార్థమును సాధింపవలెనని నేను నిశ్చయించుకున్నాను.

మరునాడు గ్రంథాలయమునకని మా అమ్మ పరిమళంతోజెప్పి, శాస్త్రిగారి ఇంటికి వెళ్ళాను. అప్పుడు ఉదయం ఎనిమిదిగంటలవుతుంది. హాలులోపలికి వెళ్ళి చాపమీద కూర్చున్నాను. గోడమీద నాకు శారదాదేవి చిత్రపటము దర్శన మిచ్చింది. 'నా కోరిక పూర్తి చెయ్యి తల్లీ!'అని లేచి నమస్కరించాను.

శాస్త్రిగారిని గురించి విచారింపగా వారు పూజామందిరంలో వున్నారనీ, ఒక గంటవరకు బయటకు రారనీ తెలిసింది. చాపమీద అట్లాగే కూర్చోవడం జరిగింది.

ఇంతలో శాస్త్రిగారి కుమారుడు నాకంటె రెండుమూడుసంవత్సరాలు పెద్దవాడైన మధుసూదన శాస్త్రితో పరిచయమయింది. తరువాత శాస్త్రిగారి అమ్మాయి ప్రభావతితో పరిచయం కలిగింది. సంస్కారమంతా ఆ ఇంటిలో తొణికిసలాడుతోంది. నా ఆసక్తిని వారికి తెలుపగా నాన్నగారిని అడుగవలసిందని పలికారు.

తరువాత శాస్త్రిగారి భార్య నలుబది సంవత్సరాల వయసుకుపైబడ్డ మహాలక్ష్మమ్మగారు కాఫీ తెచ్చింది. వారికి నా విషయం తెలుపగా 'వారు అంగీకరిస్తారు! మా అమ్మాయి, తక్కిన పిల్లతోబాటుగా నీవుగూడ నేర్చుకుందువుగాని!' అని పలికింది. తరువాత తాను ఒక వేశ్యకు కుమార్తెనని తెలిసికొని వెలవెలబోతూ లోపలికి వెళ్ళింది.

శాస్త్రిగారు పూజ ముగించి హాలులోకి ప్రవేశించారు. వారికి రెండు చేతులతో పాదాభివందనంజేసి, వారు అడుగకుండానే నా వృత్తాంతాన్ని తెలియజెప్పడం, సంగీత, నాట్యములయందు నా ఆసక్తిని వివరించడం జరిగింది.

నా అదృష్టంవలన శాస్త్రిగారు నా కోరికను అంగీకరించారు. వాళ్ళ అమ్మాయి, ఇతర విద్యార్థినులతోబాటు ఉదయం ఏడుగంటలనుండి ఎనిమిది గంటలవరకు నేర్చుకొనవలసిందని నిబంధించారు.

నేను సంతోషతరంగాలతో ఇంటికి వచ్చి, మా అమ్మ పరిమళానికి జెప్పి, ఇల్లంతా అదిరిపోయేటట్లు గంతులు వేశాను.

మరునాటి దినమునుండి శ్రీ శాస్త్రిగారి దగ్గర నా సంగీతం, నాట్యశాస్త్రాభ్యాసములు ప్రారంభమయినవి. శ్రీ విఘ్నేశ్వర, శ్రీ శారదాంబా పూజలు నాతో చేయించారు. సప్తస్వర దేవతల పూజలు నాతో చేయించి నటరాజుకు నాతో మ్రొక్కించారు. ఆనాటినుండి శాస్త్రిగారి అమ్మాయి ప్రభావతి, ఇంకా ఇద్దరు ముగ్గురు నాతోటి బాలికలు నాతోబాటు నేర్చుకునేవారు.

ఆనాటినుండి నా జీవితం క్రొత్తమలుపు తిరిగింది. సంగీత లయ జ్ఞానములు నాకబ్బినవి. శాస్త్రిగారు అనేక మువ్వగోపాలుని పదములు, క్షేత్రయ్య పదములు, జయదేవుని యష్టపదులు, ఒకటి రెండు త్యాగరాజ కృతులు, రామదాసు కీర్తనలు నేర్పారు.

సంగీతంతోబాటు అభినయంకూడా నేర్చుకున్నాను. కాలి గజ్జియలతో, మిగిలిన బాలికలతోబాటు నేర్చుకున్నాను. శాస్త్రిగారి దగ్గర నేర్చుకునేది గంటసేపయినా, ఇంటిదగ్గర మిక్కిలి కృషి చేసేదాన్ని. మా అమ్మ పరిమళానికి సంగీత నాట్యములు ప్రదర్శించి చూపేదానను. ఆమె ఆనంద హృదయంతో మురిసిపోయేది.

'శాస్త్రిగారు కూడా నా శద్ధాభక్తులను గమనించి మురిసిపోయేవారు. మధుర సంగీతశృతి నాదములను, లలిత మనోహర పదవిన్యాసములను జూచి, నీవు కిన్నెరవో, అప్సరసవో అయివుండాలిసినదానవు!' అని ప్రశంసించేవారు.

మా అమ్మ పరిమళం-సాని వృత్తికాకపోయినా, వివాహంజేసికొమ్మని అప్పుడప్పుడు బ్రతిమలాడుతూ వుండేది. తన ఆఖరి రోజులు దగ్గరకొచ్చాయనీ, తన చివరి కోరిక తీర్చమనీ పట్టుబట్టేది.

నేను కూడ వివాహంచేసికోననీ, నేను అత్తవారి ఇంటికి వెళితే నీకు దిక్కెవరనీ ప్రశ్నించేదానిని. నన్ను కనిపెంచినందుకు నీ చివరి రోజుల వరకు సేవజేస్తానని, తరువాత దేవదాసిగా కృష్ణ సంకీర్తన జేసుకుంటూ మరణిస్తాననీ చెప్పేదానిని.

ఆమె మాట్లాడకుండా కనులు మూసికునేది. మూసిన కనులనుండి జలజల భాష్పబిందువులు రాలేవి. అవి సంతోషంవలనరాలినవో, లేదా విషాదంవలన రాలినవో చెప్పలేను.

మా అమ్మ పరిమళానికి అప్పుడప్పుడు గుండెపోటు వచ్చేది. ఒక్కొకనాడు తెల్లవారులు ఆమె సేవజేయవలసి వచ్చేది.

ఒకనాడు తీవ్రమైన గుండెపోటుతో బాధపడుతూ-నన్ను దగ్గరకు తీసుకొని- "అమ్మా సుచిత్రా! నేను జీవితంలో ఎన్నో పాపాలనుజేసాను.

నీకుగూడ నేను ఎంతో అన్యాయంచేశాను. ఆ అన్యాయాన్ని, రహస్యాన్ని నీకు నేను జెప్పను! ఆ రహస్యాన్ని నీకు చెబితే నీవు నన్ను 'అమ్మా!' అని పిలువవు. నా మరణపర్యంతం నీతో నేను 'అమ్మా!' అని పిలిపించుకోవాలని నా కోరిక. అందువలననే ఆ రహస్యం నీకు చెప్పడంలేదు. నా యావదాస్థినీ నీ పేర రిజిష్టరు చేయించాను. ఇది రంగడికి తెలియకుండా రహస్యంగా వుంచాను.

కాజీపేటలోవున్న వకీలు గోపాలరావుగారిని నేను మరణించిన తరువాత కలుసుకో! వారు నీకు సాయంజేస్తారు. నా యాస్తినంతా నీవు అనుభవించు! నా తరువాత నీ యిష్టం వచ్చినవరుణ్ణి పెళ్ళిచేసుకో" అని చెప్పింది.

మా అమ్మ పరిమళం చెప్పిన మాటలకు నేనెంతగానో రోదించాను. ఆనాటినుండి నా అధ్యయనానికి, సంగీత నాట్యాభ్యాసాలకు స్వస్తి చెప్పాను. ఎల్లప్పుడు ఆమెకు సమీపంలోవుండి సేవ చేయడమే లక్ష్యంగా పెట్టుకున్నాను.

శాస్త్రిగారు నేను సంగీత నాట్యాభ్యాసాలకు రాకపోవడంచూచి, ఒకనాడు మా ఇంటికి వచ్చారు. వారికి నా నిజపరిస్థితిని తెలియబరచి నమస్కరించాను.

నా మాతృసేవానిరతికి శాస్త్రిగారు కన్నులు చెమ్మగిల్లినవి. "భగవంతుడు నీకు మంచిదారి చూపుతాడు తల్లీ! " అని ఆశీర్వదించారు.

ఒక సంవత్సరం దాటింది. నా సేవాపరిచర్యలతో మా అమ్మ పరిమళానికి ఆరోగ్యం చేకూరింది. తిరుగులాడడం ప్రారంభించింది.

ఈ సంవత్సరంలో చాలసార్లు రంగడు వచ్చి, మా అమ్మను బెదిరించి, డబ్బు తీసుకుపోతూనే వున్నాడు.

ఒకనాడు నేను బయటికి వెళ్ళానని భ్రమించి, రంగడు అమ్మ గదిలో ప్రవేశించాడు. నేను బయటి గుమ్మం దగ్గర నిలిచి లోపలి సంభాషణ వింటున్నాను.

ఒక బంగారు వర్తకుడు నన్ను ప్రేమించాడని, ఎంత డబ్బయినా గుమ్మరిస్తాడని, పదివేల రూపాయలనోట్ల కట్టలను అమ్మ ముందు వుంచాడు.

నన్ను వ్యభిచార వృత్తిలోకి దింపడానికి రంగడి ప్రోద్బలం-అమ్మ వ్యతిరేకించడం-రంగడు రహస్యం బయటపెడతానని బెదిరించడం జరిగింది. అమ్మ రంగడ్ని నీకు కావలసినంత డబ్బు యిస్తానని బ్రతిమలాడింది కాని రంగడు వినలేదు. రహస్యం బయటపెడితే సుచిత్ర ఇక్కడినుండి యెచ్చటికైనా వెళ్ళిపోతుందనీ, ఆమె తల్లిదండ్రులు వచ్చి తీసుకుపోతారనీ, పోలీసులు కేసుపెట్టి జైలుకు పంపుతారనీ బెదిరించాడు. మా అమ్మ పరిమళం మెత్తబడడం, రోదించడం వినిపించింది.

నాకు అసలు విషయం అస్పష్టంగా తెలిసింది. నేను మా అమ్మకు కన్న కుమార్తెనుకాదనీ, ఏదో రహస్యమున్నదని తెలుసుకున్నాను. ఆ విషయాన్ని నెమ్మదిగా మా అమ్మను అడిగితెలుసుకుందామని అనుకున్నాను దురదష్టవశాత్తు ఆనాటి రాత్రే తనను మేడపై గదిలో బంధించడం, తాను కిటికీ గదినుండి టిగొట్టం బట్టుకొని క్రిందికి జారడం తటస్థించింది. వరంగల్‌నుండి రిక్షాబండిలో హనుమకొండకు రావడం-అక్కడినుండి దిగి కొంతదూరం నడవడం-తరువాత మనోహర్ గదిలో ప్రవేశించడం జరిగింది. మనోహర్ సహాయంతో ఆ దుండగులనుండి తప్పించుకోవడం జరిగింది.

ఇదంతా నెమరువేసికొని సుచిత్ర హృదయమంతా కలవరపడింది. బల్లమీదవున్న అరటిపళ్ళను, రొట్టెను తిన్నది. వేడి చేయకుండానే టీలో పంచదార వేసికొని త్రాగింది. ఒంటిగంట కావస్తున్నది, మనోహర్ ఇంకా రాలేదు. పన్నెండు గంటలకల్లా వస్తానని పలికాడు!

లోపల గదిలోనుండి వెలుపలికి వచ్చి, ఇంటి వెనుక భాగంవైపు చూచింది. శిశిర ఋతువు కావడంవలన వేపచెట్టు నుండి ఒక్కొక్క ఆకు నేల రాలుతూ వున్నవి. తన జీవితంలో కూడ ఆ శిశిర ఋతువు వంటిదే అనుకొని లోపలి గదిలోకి వచ్చి కుర్చీలో కూర్చుంది.

ఆమె హృదయంలో మరో తరంగం వెల్లివిరిసింది. మనోహర్ ఎంత అమాయకుడు! కులం, గోత్రంలేని నన్ను వివాహమాడతానని ఉబలాటపడుతున్నాడు. తల్లిదండ్రులు అంగీకరింపరనీ, సంఘం తిరస్కరించుతుందనీ పాపం! ఆ అమాయకునికి తెలియదు. అధోగతిలోనున్న నన్ను

ఆదరించాలని ఆశ పడుతున్నాడు. అతనికి ప్రపంచజ్ఞానం అంతగా లేదని అనిపిస్తోంది. నేరుగా తన యింటికి తీసికొనివెళ్ళి, తలిదండ్రుల ఆజ్ఞ దీసుకుని, నన్ను వివాహమాడతానని అంటున్నాడు.

ఈ విధంగా తమ కుమారునితో వచ్చిన నన్ను జూచి వారేమనుకుంటారు? నీచ స్త్రీగా నన్ను భావింపవచ్చును. అవమానించి పోలీసులకు అప్పగించవచ్చును. పోలీసులు విచారించి, ఒక వేశ్యకుమార్తెగా తెలిసికొని, వంచన నేరంక్రింద జైలు శిక్షకూడ విధింపవచ్చును. లేదా నన్ను మళ్ళీ రంగడు మున్నగు రౌడీలకు అప్పగించవచ్చును. ఈ అమాయకమైన మనోహర్ చర్య యిన్ని పరిమాణాలకు హేతువు అవుతుందేమో!

ఇక్కడినుండి ఏదో విధంగా పారిపోతే? నేను పారిపోతే మనోహర్ మిక్కిలి విచారిస్తాడు. నామీద అతనికి ఒక్కరోజులో గలిగినది అనురాగమో, నా హీనస్థితికి కారుణ్య భావమో అర్థంకాలేదు. రెండూ గలిగినవేమో! నాకోసం అతడు ప్రాణాన్ని సహితం త్యజించడానికి సిద్ధంగా వున్నాడు. నేను చెప్పకుండా వెళ్ళిపోతే మిక్కిలి ఖేదం జెందుతాడేమో! కృతఘ్నురాలినని నన్ను నిందిస్తాడేమో!

అవును! నేను యిచ్చటినుండి పారిపోతే— మనోహర్ ఖేదం జెందుతాడు! నన్ను నిందిస్తాడు. కొన్నాళ్ళకు నన్ను మరిచిపోతాడు. అతని జీవన యాత్రానౌక భద్రంగా రేవు చేరుకుంటుంది. నా చిల్లి పడవను రేవుకు జేర్చడం అసంభవం, తర్వాత తన నౌకను గూడ నీళ్ళలో ముంచుకోవడం తథ్యం! ఈత వచ్చిన వానిని సుడిగుండం నుండి రక్షించడం సులభం! ఈతరాని వానిని సుడిగుండం రక్షింపబోయి యీత వచ్చినవారు గూడ అపాయంలో చిక్కుకుంటారు.

ఇంతకు నేను యిచ్చటినుండి వెళ్ళిపోతే-మనోహర్ జీవితాన్ని ఒడిదుడులకునుండి కాపాడినదాన నవుతాను.

అన్ని యిక్కటులకు తానే కారణమేమో! రంగడు చెప్పినదానికి ఒప్పుకుంటే-ఇన్ని ఇబ్బందులు అందరికీ జరిగి వుండేవి కావేమో! అయితే నా శరీరాన్ని త్యాగం చేయవలసి వచ్చేది. దుష్టమైన నేటి సాంఘిక వ్యవస్థలో ఎంతమంది స్త్రీలను బలవంతంగా జెరపబడలేదు?

దుర్భర దారిద్ర్యంతో తిండికోసం శీలాన్ని అమ్ముకునేవారు ఎంత మందిలేరు? వారిలో నేను కూడ ఒకదానను!

జీవితాంతం వరకు తల్లిపరిమళానికి సేవ జేస్తానని మాట ఇచ్చాను. ఆమె కన్నదోలేదోగాని, పెంచి పెద్దచేసినందుకు మాట యిచ్చాను. ఆ మాట చెల్లించుకోవచ్చు! మనోహర్‌కు కూడ ఏమీ యిబ్బందులు గలగవు. అదే సరియైన దారి!

శీలంలేని స్త్రీ జీవితం ఎందుకు? మరో తరంగం లేచింది. జీవచ్ఛవం! స్త్రీ దేనిని జూచుకుని గర్విస్తుంది? నేను ఏ విధంగానైనా నా శీలాన్ని రక్షించుకోవాలి. ఎప్పటికైనా దూరదేశం పారిపోవాలి. అక్కడ ఏమైనా అభ్యంతరం లేదు. ఒకవేళ శీలం చెడితే అత్మహత్య చేసుకుంటాను.

ఇంతలో వెలుపల కాకి యరచిన శబ్దం వినిపించింది. సుచిత్ర ఉలికి పడి లేచింది: మళ్ళీ నిశ్శబ్దం రెండుగంటలు దాటుతూ వుంది. ఆమెకు ఆకలి కూడ అవుతున్నది· కూజాలో వున్న మంచినీటిని గ్లాసులో బోసు కొని త్రాగింది.

ఇంతలో మరో తరంగం లేచింది. అంతరంగం సుప్రభాతాన సూర్యోదయ సమయంలో బంగారు కాంతులు పైబడుతున్న సమయంలో లేచిన తరంగం! ఆ తరంగం ప్రసన్న మధురంగా వుంది. హృదయంలో ఒక విధమైన శాంతి క్రమ్ముకున్నది.

శాస్త్రిగారి ఇంటికి వెళితే-తనను కుమారిగా అదరిస్తారు. ప్రేమతో ఆశీర్వదిస్తారు. హృదయాని కద్దుకుంటారు. తన అపదలన్నీ గడతేను స్తారు.

శాస్త్రిగారి కుమారుడు మధుసూదనశాస్త్రి తనను చెల్లెలిగా ఆదరించే వారు. ఒకనాడు తాను మధుసూదనతో 'అన్నయ్యా! ఒకనాడు నా శీలానికి నాకు అపద వచ్చినట్లయితే నిన్నాశ్రయిస్తాను, రక్షిస్తావా?' అని ప్రశ్నిం చాను. అప్పుడు అతడు 'చెల్లీ! నా ప్రాణం యిచ్చి అయినా నిన్ను కాపాడ తాను' అని పలికాడు.

నేనెంతటి మూర్ఖురాలను! రాత్రి నేను వరంగల్ నుండి పారిపోయి వచ్చేటప్పుడు శాస్త్రిగారి ఇంటికి వెళితే ఎంత బావుండేది? వారు తప్పకుండా నాకు దారి చూపి వుండేవారు. పోలీసులకు రిపోర్టుచేసి ఆ గూండాలను పట్టించేవారు. ఈ మనోహర్‌తో పరిచయం గలిగి వుండేదికాదు. మనోహర్ పన్నెండు గంటలకు వస్తానని చెప్పి వెళ్ళాడు. మూడు గంటలు కావస్తూన్నది.

ఇంకా రాలేదు. ఎన్ని అవస్థలు పడుతున్నాడో, ఎక్కడ తిరుగుతున్నాడో యేమో? ఇంకముందు ఎన్ని ఎన్ని ఆపదలకు చిక్కుకోవలసి వున్నదో?

ఈ ఆలోచనే నాకు సరియైనదని తోస్తున్నది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. శాస్త్రిగారిని శరణు వేడుతాను. వారే నాకు గమ్యం జూపిస్తారు. శాస్త్రిగారి పాదాలవద్ద నా ప్రాణాలు పోయినా నాకు యిష్టమే! మనోహర్ వచ్చిన వెంటనే నన్ను శాస్త్రిగారి దగ్గరకు పంపమని నచ్చచెబుతాను.

కాని, మనోహర్ నన్ను శాస్త్రిగారి ఇంటికి జేరుస్తాడా? తల్లిదండ్రుల యిష్టంతో నన్ను వివాహమాడాలని జూస్తున్నాడు. సాధ్యాసాధ్యాలు గమనించకుండా విపరీత ప్రయత్నం జేస్తున్నాడు. మనోహర్ తల్లిదండ్రులు అంగీకరించడం, అతడు నన్ను వివాహమాడడం అసంభవమైన విషయాలు!

ఈ విచిత్రమైన ఆలోచనలతో నాలుగు గంటలయింది. మనోహర్ ఇంకా రాలేదు ఇంకా తాను అచ్చట వుండడం ప్రమాదకరమని సుచిత్ర తలంచింది. మనోహర్‌కు తెలియకుండా పారిపోయి శాస్త్రిగారి ఆశ్రయం పొందాలనుకుంది.

సుచిత్ర ఏ విధంగా పారిపోవాలో ఆలోచించడం మొదలుపెట్టింది. బయట గది తలుపు మనోహర్ తాళం వేసుకొని వెళ్ళాడు. లోపల గది నుండి ఇంటివెనుక భాగానికి వెళితే విశాలమైన ఆరడుగుల చుట్టుగోడ వుంది దానికెటువంటి ద్వారంలేదు. చుట్టుపట్ల ఇళ్ళేమీ లేవు. ఆ ఇల్లుకూడ విర్జనంలో వుంది. ఒకమూల ఇటుకరాళ్ళు పేర్చి యున్నవి. ఆ ఇటుకల

మీద కుర్చీగాని, బల్లగాని వేసుకుంటే ఎక్కవచ్చును. ఆరడుగుల ఎత్తు నుండి తాను దూకగలదా?

మేడ అంతస్థునుండి క్రిందికి జారిన తనకు ఆరడుగుల ఎత్తునుండి క్రిందికి జారటం అంత కష్టమేమీ గాదు.

ఇటుకలపైకి స్టూలును జేర్చి అటూ-ఇటూ జూచింది. జనసంచారం అంతగా లేదు రోడ్డు ఫర్లాంగు దూరంలో వుంది. రిజాలు, బండ్లు పోతూ వున్నవి. గోడదూకి రోడ్డుజేరితే- ఏదయినా రిజాఎక్కి, శాస్త్రిగారి ఇల్లు జేరుకోవచ్చునని నిశ్చయించుకుంది.

రివ్వుమని గదిలోకి ప్రవేశించింది. మనోహర్ తల్లి పట్టుబట్టలను విప్పి. ఉదయం ఆరవేసిన తన వస్త్రములను ధరించింది. అపవిత్రమైనతాను ఒక కులీన స్త్రీ చీరను కట్టుకున్నందుకు పశ్చాత్తాపం చెందింది. వాటిని భద్రంగా మడిచి బల్లమీద పెట్టింది. ముందుగదిలోవున్న ఆ ఆరవేయబడిన చీరెను ధరించింది.

గది అంతా ఒకసారి కలియజూచింది. మనోహర్, తనకు జరిగిన మధుర సంభాషణలను ఒకసారి స్మృతికి దెచ్చుకుంది. ఒక్కసారిగా ఆమె కన్నులనుండి అశ్రుధారలు జలజల రాలినవి.

బల్లమీద వున్న 'మనోహర్'. అని వ్రాసి వున్న డైరీని దెరచి, అక్కడ వున్న పెన్సిలుతో 'మనోహర్‌గారూ! నాకోసం చింతించకండి! నన్ను వెదకటానికి ప్రయత్నింపకండి. మీరు సుఖంగా వుండాలని నా కోరిక' 'సుచిత్ర' అని వ్రాసి పుస్తకమును మూయకుండా కుర్చీలో తెరచి వుంచింది.

కూజాలో వున్న మంచినీటిని గ్లాసులో వంచుకుని త్రాగింది. 'నెమ్మదిగా తలుపులు వేసి, అంతా జాగ్రత్తగా వున్నదో లేదో' అని ఒకసారి కలయజూచింది.

నాలుగు గంటలయింది. మనోహర్ వస్తువేదైనా జ్ఞాపకార్థం తీసుకుని వెళదామనుకుంది. అతని ఖద్దరు జేబురుమాలు కొంకిన వ్రేలాడుతున్నది. దానిని తన స్తన యుగ్మంలో భద్రపరచుకున్నది. మళ్ళీ తలుపులువేసి నెమ్మ

దిగా గోడ దగ్గరికు జేరుకున్నది. ఇటుకలపైకెక్కి తొంగి చూచింది. ఒక వ్యక్తి సైకిలుమీద రావడం గమనించింది. అతడు వెళ్ళిపోయాక, గోడఎక్కి క్రిందికి జారుదామనుని నిశ్చయించుకుంది.

ఇంతలో అనుకోనని సంఘటన జరిగింది. బయటినుండి మనోహర్ తలుపుతీసి గదిలోనికి ప్రవేశించాడు.

గది తలుపులు గడియవేసి, లోపలి గదిలోనికి వెళ్ళాడు. గది నిర్మానుష్యంగా వుంది. సుచిత్ర లేదు. ఆమె ఉదయం ఆరవేసిన బట్టలు కొంకికి లేవు. తన మాతృమూర్తి పూజావస్త్రాలు చక్కగా మడిచి బల్లమీద వున్నవి.

తన డైరీ బల్లమీద తెరచివున్నది. తెరచిన పుస్తకంపైన సుచిత్ర వ్రాసిన అక్షరపంక్తులు చదువుకున్నాడు. తల తిరిగినట్లయింది. అతనికి దుఃఖం ముంచుకువస్తున్నది.

సుచిత్ర ఏ విధంగా పారిపోయిందో తెలిసికొనగోరుతూ, ఇంటి వెనుక భాగానికి చెరచెర పరుగుదీశాడు. అప్పుడే సుచిత్ర ఇటుకల మీద వున్న బల్లపైకెక్కి గోడపైకి ఎక్కుటకు యత్నిస్తూ వున్నది.

మనోహర్ "సుచిత్రా!" అని ఒక్కకేక వేశాడు.

సుచిత్ర గోడమీదకి ఎక్కకుండా స్టూలుబల్లమీద ఆగిపోయింది.

మనోహర్ పరుగెత్తి, పేర్చిన ఇటుకలపైకి వెళ్ళాడు. స్టూలుబల్లమీద నిల్చునివున్న సుచిత్ర ముంగాళ్ళను, ఊరువులను తన హృదయానికి జేర్చుకుని స్టూలు దిగవలసినదని ఆమె ముఖంవైపు చూశాడు. అతని కనుల వెంట బాష్పధారలు దొలుకుతున్నాయి.

అది చూసి సుచిత్రకు కూడ వర్షజలధారలవలె కన్నీరు ప్రవహింపసాగింది.

సుచిత్ర స్తబ్ధతగా అతని శిరస్సు రెండు చేతులతో స్పృశించి, భుజములపై రెండు చేతులను వుంచి అతని కౌగిలిలోనే క్రిందికి జారింది. ఇరువురి హృదయాలు ఒకచోటికి జేరినవి.

కాని మనోహర్ కాలిక్రింద యిటికరాళ్ళు చెదిరి, మనోహర్ కాలు జారడం- ఇరువురూ పేర్చిన యిటుకలవరుస నుండి క్రిందబడడం తటస్థించింది. ఇరువురికీ ఉదయంనుండి భోజనం లేకపోయినందున శోషవచ్చినదో ఏమో, ఒకక్షణం ఇరువురు స్పృహతప్పడం తటస్థించినది. తరువాత ఇరువురు తెప్పరిల్లి, దెబ్బలేమన్నా తగిలినవేమోనని చూచుకొన్నారు. ఇరువురిలో అదృష్టంవలన ఎవరికీ స్వల్పమయిన గాయం కూడ తగులలేదు.

మనోహర్ సుచిత్రను పువ్వు మాదిరిగా తన ఆయత బాహువులతో పైకెత్తి హృదయానికి అద్దుకొని లోపలికెత్తుకొని వస్తున్నాడు. కొద్దిదూరం ఆ విధంగా తనను మనోహర్ ఎత్తుకుని వస్తూవుంటే సుచిత్ర సిగ్గుపడి, మనోహర్ రెండు చేతులనుండి క్రిందికి జారింది. ఆమె సుకుమారమైన పాలభాగాన్ని మనోహర్ తన దక్షిణ హస్తంతో స్వీకరించాడు.

ఆమె కాదనక ద్వితీయ హస్తాన్ని అతని దృఢమైన భుజములను ఊతగా గొని సుకుమారమైన పదవిన్యాసాలతో గదిలోనికి నడిచింది.

గది నిశ్శబ్దంగా వుంది సుచిత్ర బల్లమీద కూర్చున్నది. మనోహర్ కుర్చీలో కూర్చున్నాడు. గడియారం టిక్కుటిక్కుమంటూ టేబుల్ బల్లమీద ఊ కొట్టుతున్నది. చిన్నముల్లు ఐదుమీద వున్నది. పెద్దముల్లు దానిని చేరుకోవాలని ప్రయత్నిస్తున్నది.

మనోహర్ నిశ్శబ్దతను భంగపరుస్తూ- "సుచిత్రా! ఇప్పుడు నీవు చేసిన పని ఏమిటి? యీ విధంగా చెప్పకుండా పారిపోవడం భావ్యమేనా?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర తన రుద్ధమైన కంఠస్వరాన్ని సరిజేసికొని "మనోహర్ గారూ! నేను ఎవరినీ చిక్కుల్లో పెట్టదలుచుకోలేదు. అందుకే ఇచ్చటినుండి వెళ్ళిపోదలుచుకున్నాను," అని పలికింది.

మనోహర్ ఉద్వేగంతో "అయితే- నన్ను అసమర్థునిగా, అబ్బనిగా భావిస్తున్నావన్నమాట" అని పలికాడు.

సుచిత్ర వెంటనే అందుకుని "అంతమాట అనకండి. మీరు అసమర్థులయితే యీ విధంగా యిప్పటివరకు నన్ను కాపాడేవారా? మీకు నేను ఎప్పటికీ కృతజ్ఞురాలను!" అని వినయంగా పలికింది.

మనోహర్ వెంటనే అందుకుని "కృతజ్ఞురాలవు కావు. కృతఘ్నురాలివు. నామీద నీ కెటువంటి విశ్వాసము లేదు.

నా మాటలను బూటకములుగా భావిస్తున్నావు. నన్ను ఎందుకూ పనికిమాలినవానిగా, అసమర్థుడిగా ఊహిస్తున్నావు" అని పలికాడు.

సుచిత్ర మనోహర్ చేతులు పట్టుకొని "కాదు! కాదు! అలా భావించకండి." అని కంటనీరు తొణుకుతూ అంది.

మనోహర్ సుచిత్ర చేతులు విదిలించి "నీవు శైలూషివి! నాట్యకత్తెవు. అంతా నటన!" అని మృదఘటము రాతిమీద ఎత్తివేసినట్లుగా పలికి, ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు.

సుచిత్ర రోదన కంఠంతో విలపిస్తూ "అవును! నేను శైలూషినే! నాట్యకత్తెనే! నాట్యం తెలిసిన నాకు నటించడం సహజమేకదా! నన్ను యిచ్చటినుండి వెంటనే పంపించండి." అని పలికింది.

మనోహర్ మండిపడి తీవ్రంగా "నన్ను వేధింపకు. వెంటనే ఇచ్చటినుండి వెళ్ళిపో" అని పలికి చకచక ముందుగది తలుపులు పెద్ద శబ్దంతో తెరచి, మొదటి గదిలోనికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

సుచిత్ర వేగంగా ముందుగదిలోనికి వెళ్ళింది. మనోహర్ సుచిత్ర వెళ్ళిపోతున్నదేమోనని అనుమానించాడు. అంత కర్కశంగా అతడెప్పుడు ఎవరితో మాట్లాడి ఎరుగడు. ఆ విధంగా మాట్లాడినందుకు తన్నుతానే నిందించుకున్నాడు.

అందులో ఒక స్త్రీని- అనాథను- తాను ఆశ్రయమిచ్చిన వనితను ఆ విధంగా పలికినందుకు తనకు తానే నొచ్చుకున్నాడు కుర్చీనుండి లేచి, సుచిత్ర వెళ్ళిపోతున్నదని భావించి, ముందుగదిలోనికి ప్రవేశించాడు. సుచిత్ర ముందుగదిలోనికివెళ్ళి, బయటి తలుపులు మూసి, గడియ వేస్తున్నది.

మనోహర్ తలుపు దగ్గర నిలబడిన సుచిత్ర దగ్గరకు వెళ్ళాడు. తనను క్షమించమని వేడుకున్నట్లుగా ఆమె రెండు చేతులను బట్టుకొని దీనంగా చూశాడు.

ఆమె కూడ అతనివైపు దీనంగా జూచింది. ఇరువురి నేత్రముల నుండి నీళ్ళు తిరుగుతున్నవి. ఆ విధంగా కన్నీటి భాష్పాలు కళ్ళల్లో తిరుగుతూ వుండడం వలన, ఒకరి కొకరు అస్పష్టంగా కనిపిస్తున్నారు. ఆమెను మళ్ళీ లోపలి గదిలోనికి తీసుకొనివెళ్ళి, కుర్చీలో కూర్చోబెట్టి, తాను బల్లపై కూర్చున్నాడు.

మనోహర్ సుచిత్రతో క్లుప్తంగా "కఠినంగా మాట్లాడినందుకు నన్ను క్షమించు సుచిత్రా!" అని వేదనతో పలికాడు.

అతడా విధంగా పలుకుతూన్నప్పుడు సుచిత్రకు కనుకొలకులనుండి రెండు కన్నీటి బిందువులు రాలినై. కన్నులను తుడుచుకుంటూ- "మీరే నన్ను క్షమించాలి. మీకు నేనెంతో బాధకలిగిస్తున్నాను" అని రుద్ధకంఠంతో పలికింది.

మనోహర్ మళ్ళీ గంభీరంగా "గోదదూకి ఎచ్చటికి వెళ్ళదలుచుకున్నావు?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర మనోహర్ కళ్ళల్లోకిజూస్తూ- "శాస్త్రిగారి ఇంటికి. వారి సహాయంతోనే నేనీ ఆపదనుండి గడతేరాలని ప్రయత్నం జేశాను." అని పలికింది.

మనోహర్ వెంటనే "నేను నిన్ను శాస్త్రిగారి ఇంటికి జేరుస్తాను. ఆ విధంగానే వారి రక్షణ పొందవచ్చును!" అని పలికాడు.

సుచిత్ర సాగరకల్లోలితమైన హృదయవేదనతో "మనోహర్‌గారు! నేనే వెళతాను! వారు ఆశ్రయమిస్తారో లేదో, నావలన వారికెన్ని చిక్కులు గలుగుతవో యేమో" అని పలికింది.

మనోహర్ స్ఫుటంగా "సుచిత్రా! నీకెవరిమీదగూడ విశ్వాసంలేదు. నీవు ఎవరినీ నమ్మవు. ఎవరికీ చిక్కులుగలిగించనని అంటూనే-అందరికీ చిక్కులు గలిగింపదలుచుకున్నావు" అని కటువుగా పలికాడు.

సుచిత్ర రుద్ధమైన కంఠస్వరంతో "నేనెవరికి చిక్కులు గలిగించాను?" అని పలికింది.

మనోహర్ ఆవేశంతో "నీవు నాకు చిక్కులు గలిగించావు. నన్ను ప్రేమించినట్లు నటించి, నా ప్రేమను తిరస్కరించి, నన్ను వేదనలో ముంచి వెళుతున్నావు. మళ్ళీ శాస్త్రిగారినికూడ చిక్కులు పెట్టడానికి ప్రయత్నిస్తున్నావు. శాస్త్రిగారు నీలాంటి యువతికి ఆశ్రయం యెలా యిస్తారు? లోకం యేమనుకుంటుంది? శాస్త్రిగారి కుటుంబసభ్యులే యేమనుకుంటారు? అంతేగాదు-రాత్రి వచ్చిన రౌడీలే శాస్త్రిగారికి అపకారం జేయవచ్చును" అని తీవ్రంగా పలికాడు.

సుచిత్ర మనోహర్ చెబుతున్నదంతా నిజమేనని భావించింది. దిక్కులేని తనలాంటి స్త్రీకి యెవరుకూడ ఆశ్రయమిచ్చి, ఆపదలు కొని తెచ్చుకొనరని భావించింది.

సుచిత్ర మౌనముద్రను మనోహర్ భంగంజేస్తూ "సుచిత్రా! నీకు నామీద విశ్వాసంలేదన్నమాట! నా తల్లిదండ్రులు సంస్కారవంతులు! దయాస్వభావులు! నన్ను వివాహం జేసుకోవడం నీకు ఇష్టంలేదన్నమాట" అని పలికాడు.

సుచిత్ర బొటబొట కన్నీటి బిందువులను రాల్చుతూ-పైట తొలగింపకుండా తన స్తనయుగ్మంలోదాచుకున్న మనోహర్ ఖద్దరు జేబు రుమాలునుదీసి, మనోహర్‌కు జూపుతూ- "మనోహర్‌గారూ! నిన్నటివరకు జగద్రక్షకుడైన ఆ వేణుగోపాలమూర్తిని ప్రేమించేదానను! నాకు గతీ-పతీ అన్నీ అతడేనని భావించేదానను. నిన్నటినుండి మీ పరిచయం కలిగింది. మిమ్మల్నిగూడ నాకు గతీ-పతీ అని భావించాను. మీ ప్రేమకు చిహ్నంగా చూడండి! మీ చేతిరుమాలును తీసికొని వెళుతున్నాను" అని పలికింది.

సుచిత్ర దగ్గరవున్న జేబురుమాలును దీసికొని సుచిత్ర మెడలో వేసి- "సుచిత్రా! ఒక్కరోజు-ఇరవైనాలుగు గంటలు వేచిచూడగూడదా? నా తల్లిదండ్రులు ఎటువంటివారో నీకు తెలుస్తుంది. జగన్మాతముందు నేను జేసిన ప్రతిన నిజమోకాదో తెలుస్తుంది" అని సాలోచనగా పలికాడు.

సుచిత్ర అప్రయత్నంగా మనోహర్ హృదయంలోకి ముఖం జేర్చి కనులు మూసికొంది. మూసిన కనులనుండి అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి.

మనోహర్ సుచిత్ర వదన సరోజాన్ని తన రెండు చేతులలోనికి తీసుకున్నాడు. సుచిత్ర కంఠంలోవున్న తన రుమాలుతో కన్నీటి భాష్పాలను తుడిచాడు.

సుచిత్ర చిత్రీయమాణ చిత్రపటమువలె, మహాశిల్పి చెక్కిన శిల్పంవలె నిశ్చేష్టురాలుగా వుంది. కనులు మూసికొని నిలిచిన సుచిత్ర అపూర్వ సౌందర్యాన్ని మనోహర్ ఆశ్చర్యంగా తిలకింపసాగాడు.

## 4

గడియారం ఐదున్నరగంటలవడంజూచి మనోహర్ ఉలిక్కిపడ్డాడు. సుచిత్ర చేయిబట్టుకొని "సుచిత్రా! మనం జాగ్రత్తపడాలి! ఏడుగంటలకల్లా సుధాకర్ కారు పంపుతానన్నాడు. మనం దానిమీద వెళ్ళాలి" అని పలికాడు.

సుచిత్ర యిప్పటివరకు ఊహాలోకాలలో విహరిస్తూ వున్నది. మనోహర్ పలికిన మాటలతో వాస్తవ లోకంలోనికి వచ్చినది. సుచిత్ర కనులు తెరచి "మనం యెక్కడికి వెళ్ళాలి?" అని ప్రశ్నించింది.

మనోహర్ సుచిత్రవైపు జూస్తూ "సుధాకర్ యింటికి. అక్కడి నుండి పెళ్ళివారితో గలిసి జనగాం వెళ్ళాలి. అక్కడ నుండి విజయవాడకు రైలుమీదగాని, బస్సుమీదగాని జేరుకుందాం" అని పలికాడు.

సుచిత్ర మనోహర్ వైపు చూడకుండానే "అయితే నేనిప్పుడేం చేయాలి?" అని ప్రశ్నించింది.

మనోహర్ వెంటనే "నువ్వు యీ పట్టుబట్టలను ధరించు! కులీన యువతివలె అలంకరించుకో! నువ్వు నా మేనకోడలివనీ, భవిష్యత్తులో నిన్ను నాకిచ్చి వివాహంజేస్తారనీ చెప్పాను. తల్లిదండ్రులు చిన్నప్పుడే చనిపోయారని, మా అమ్మే నిన్ను పెంచినదనీ చెప్పాను. నీవు గూడ అట్లాగే చెప్పాలి" అని పలికాడు.

"అట్లాగే చెబుతాను" అని సుచిత్ర పలికింది.

మళ్ళీ సుచిత్రతో మనోహర్ "మా అమ్మ సుస్తీగా వుండటంవలన నన్ను తీసికొనివెళ్ళడానికి వచ్చిందని, నీ పేరు 'శైలజ' అని చెప్పాను" అని పలికాడు.

సుచిత్ర మళ్ళీ నిర్లిప్తతో "నా పేరు శైలజ!" అని పలికింది.

మనోహర్ వేగంగా సంభాషిస్తూ "నువ్వు వేశ్య కుమార్తెవన్న సంగతిని మర్చిపో! ఒక ఉన్నత కుటుంబంలో, సభ్యసమాజంలో మెలిగిన దానివలె ప్రవర్తించాలి" అని పలికాడు.

"అట్లాగే ప్రవర్తిస్తాను!" అని అదే నిర్లిప్తతతో సుచిత్ర పలికింది.

మనోహర్ తొందరపడుతూ "సుచిత్రా! ఒక గంటసమయం మాత్రమే వుంది! నీవు వెంటనే సిద్ధంకావాలి" అని పలికాడు.

ఆమె అదే నిర్లిప్తతో యోగినిలా పట్టుబట్టలు తీసుకొని స్నానాల గదిలోకి వెళ్ళింది.

ఈలోగా మనోహర్ తీసికొని వెళ్ళవలసిన వస్తువులు అన్నీ సర్దాడు. రెండుజతల దుస్తులు, రెండుమూడు తుండుగుడ్డలు, తేలికపాటి దుప్పటి మున్నగువానిని రెండు చిన్న ట్రంకుపెట్టెలలో సర్దాడు. బాదర బందీలేకుండా సాధ్యమైనంత తక్కువ బరువు వుండాలని, అవసరమయితే-కూలివాని సహాయం అవసరంలేకుండా తాను, సుచిత్ర చెరొక పెట్టెను చేతిలో పుచ్చుకొని వెళ్ళిపోయేటట్లు సర్దివుంచాడు. తన దగ్గర డబ్బు ఎంత వుందో చూచుకున్నాడు. దాదాపు వెయ్యిరూపాయలు వున్నవి. అవిపర్సులో దాచుకున్నాడు. ఇంక సుచిత్ర సిద్ధమవడమే ఆలస్యం అన్నట్లు అన్నీ సిద్ధం చేశాడు. ముందుగదిలోకి వచ్చి కూర్చున్నాడు.

సుచిత్ర త్వరగా స్నానంజేసి, తలను రెండు జడలుగా వేసికొని, కుంకుమబొట్టు పెట్టుకుని, ఒక విద్యార్థినివలె వేషం మార్చుకుంది. అయితే ఆమె కట్టుకున్న పట్టుచీరె, ముఖానవున్న కుంకుమబొట్టు ఒక కులీనయువతి లక్షణాలను తెచ్చిపెట్టుతున్నవి. ముఖానవున్న బొట్టును, చేతులకున్న బంగారు గాజులను, తీసివేద్దామనుకున్నది. కాని ఆమె మనస్సు అంగీకరింప లేదు. ఆరు గంటలకల్లా సిద్ధమై, ఆమె ముందుగదిలోకి వచ్చింది.

మనోహర్ ఆమె అపూర్వ సౌందర్యాన్నిజూచి, ఆశ్చర్యంజెందాడు. ఆమె ఉల్లాసంతోకూడిన ప్రవర్తననుగాంచి యింకా ఆశ్చర్యంజెందాడు.

తాను జెప్పినట్లు ప్రవర్తించదని, ముఖం మాడ్చుకుంటుందని అనుకున్నాడు. ఒక్కొక్కప్పుడు మానవుడు వూహించదానికి వ్యతిరేకంగా పనులు జరుగుతూ వుంటాయి. అతడు ఊహించినదానికి వ్యతిరేకంగా జరిగింది.

ఇప్పటి ఆమె రూపంజూచి సుచిత్రగా ఎవరూ భావింపరు. తానొక కులీన యువతిగా ప్రవర్తిస్తున్నది.

అదివరకున్న బిడియం, అనుమానం, వేదన, స్తబ్ధత నామమాత్రం కూడా లేవు. సెలయేటి తరంగం మాదిరిగా పరుగులు తీస్తున్నది. సుచిత్రలో వున్న యే ఒక్క లక్షణం కూడా ఆమెలో లేవు. ఆమె ఇప్పుడు శైలజ. ఒక ఉన్నత కుటుంబంలో అతిగారాబంగా పెరిగిన బంగారు బొమ్మ. సుచిత్రను జూడగా తనకే ఒక సిగ్గుతెర దోబూచులాడింది. తన చేతికున్న గడియారాన్నిదీసి సుచిత్ర చేతికి ధరింపజేశాడు.

సుచిత్ర నవ్వుతూ "మరి మీకు?" అని ప్రశ్నించింది.

మనోహర్ కూడ నవ్వుతూ "నీకున్నట్లయితే నాకున్నట్లే" అని పలికాడు.

సుచిత్ర చురుకుగా "అయితే నేటినుండి నేను మీకు మార్గదర్శకురాలను" అని పలికింది.

మనోహర్ వెంటనే "మార్గదర్శిపేకాదు, గమ్యాన్నిజేర్చే పథికురాలవుగూడా" అని పలికాడు.

సుచిత్ర మనోహర్ వైపు చూస్తూ "మీకేం భయంలేదు. మీ ఇంటికి మిమ్మల్ని భద్రంగా జేరుస్తాను" అని పలికింది

అతను మందస్మితంగా "సుచిత్రా! తప్పు పలుకుతున్నావు. మా ఇల్లు అని అంటున్నావు. మన ఇల్లు అని అను" అని అన్నాడు.

సుచిత్ర కిలకిలా నవ్వుతూ "మీది-నాది అనే భేదం యెప్పుడో పోయింది. మీదంతా నాది, నాదంతా మీది" అని పలికింది. ఆమెతోపాటు అతనుగూడా గొంతు కలిపాడు.

సుచిత్ర మనోహర్ వైపు జూచి "పొద్దుటి నుండి మీకూ-నాకూ భోజనంలేదు. ఫలహారమేమైనా తెస్తారా?" అని పలికింది.

మనోహర్ తన మతిమరుపుకు చింతించి ఒక చేతి సంచిని సుచిత్ర చేతికిచ్చాడు. తాను వచ్చేటప్పుడు కొన్ని పండ్లు, ఫలహారాలు కొని తెచ్చాడు. కాని సుచిత్ర జ్ఞాపకం చేసేవరకు ఆ సంచీ సంగతి మనోహర్‌కు జ్ఞాపకం రాలేదు.

సుచిత్ర సంచీ అందుకొని అందులోవున్న పండ్లు, ఫలహారాలతో వున్న పొట్లాలు బల్లమీద పెట్టింది. అందులో ఒక పెద్ద పొట్లాం చందన సువాసనలు వెదజల్లుతున్నది.

సుచిత్ర "ఇదేమిటి?" అని ప్రశ్నించింది.

మనోహర్ చందనపు దండల పొట్లం చేతిలో బట్టుకొని-"గంధపు చెక్కను చిన్న చిన్న రెబ్బలుగా చిత్రీబట్టి వానితో పెద్దదండ గ్రుచ్చు తారనీ, వీనిని ఖాదీ గ్రామోద్యోగ భాండాగారంలో వధూవరులకు కానుకగా కొనితెచ్చాననీ" పలికాడు.

సువాసనలు వెలిగ్రక్కుతున్న ఆ చందనపు దండలను చూడాలని సుచిత్ర పట్టుబట్టింది.

మనోహర్ చందనపు దండల పొట్లాన్ని సంచిలో బెడుతూ—"పెండ్లిలో వధూవరులు వేసుకున్నప్పుడు చూద్దువుగాని, ఇప్పుడు పొట్లాం విప్పవద్దు" అని పలికాడు.

సుచిత్ర మనోహర్ వద్దంటున్నా చందనపు దండలను చూడాలని ఆకాంక్షతో పట్టుబట్టి సంచీలోవున్న పొట్లాందీసి విప్పి చూసింది.

ఆ దండలను జూస్తే తాను గానంచేసే పాటలలో కృష్ణుడు ధరించే వైజయంతీమాల జ్ఞాపకానికి వచ్చింది. ఆ దండ వేసుకుంటే మనోహర్ ఎలా వుంటాడో చూడాలనుకుంది. తానుకూడ ఒక దండ వేసుకొని అద్దంలో చూడాలనుకుంది.

సుచిత్ర మెరుపులా-ఒక దండను రెండు చేతులతో బట్టుకుని మనోహర్ మెడలో వేసింది. ఆ దండ వేసుకున్న మనోహర్‌ను ఆమె వేణు

గోపాలునిగా భావింపసాగింది. ఆమె అనిమిషనేత్రాలతో అతనిని జూడ సాగింది.

మనోహర్ సుచిత్ర చేష్టకు నిర్విణ్ణుడయ్యాడు. ఆమె ఇంత సాహసంతో ప్రవర్తిస్తుందని అనుకోలేదు.

సుచిత్ర రెండవ దండనుగూడ దీసికొని తన మెడలో ధరించి అద్దంలో తన ప్రతిబింబం చూచుకొని "మనోహర్ బాబూ!" ఇప్పుడు నేను ఎట్లా వున్నాను? చెప్పండి" అని ప్రశ్నించింది.

మనోహర్ మరింత ఆశ్చర్యపడి అప్రయత్నంగా "ఆముక్త మాల్యద వలె వున్నావు" అని పలికాడు.

"అంతటి అదృష్టమా?" అని సుచిత్ర మెడలో వున్న చందనపు దండ తీసి చేతితో బట్టుకుంది.

సుచిత్ర వ్రేలాడుతున్న వాలుజడలలో ఒకదానిని చేతిలోకి దీసుకొని, దానికున్న రంగుల రిబ్బను చేతితో స్పృశిస్తూ ఆహా! మీ చేతిలో మురళి వుంటే ఎంత బాగుంటుంది? అని అంజలి ఘటించింది.

మనోహర్ సుచిత్ర సుకుమార హస్తములను స్పృశించి "సుచిత్రా! ఆలస్యమవుతున్నది. త్వరగా ఫలహారంచేసి సిద్ధం కావాలి" అని తన మెడలో నున్న దండను దీసి సుచిత్రకిచ్చాడు.

సుచిత్ర తన మెడలో వున్న దండను దీసి, రెండింటిని యధా ప్రకారముగా కాగితములో చుట్టి సంచీలో భద్రపరిచింది.

సంచిలో నుండి తీసిన ఫలహారములను ఇరువురూ భుజించారు. కూజాలో వున్న మంచినీటిని త్రాగి కుర్చీలో కూర్చున్నారు.

ఇంతలో తలుపు తట్టిన శబ్దం వినిపించింది.

సుచిత్ర వేగంగా లోపలి గదిలోనికి వెళ్ళి తలుపు వేసుకుంది.

మనోహర్ ఆందోళనతో తలుపు తెరచి చూచాడు-"పని మనిషి లచ్చి!"

మనోహర్ కొంచెం కోపంగా "లచ్చి! నిన్ను ఎప్పుడుబడితే అప్పుడు రావద్దంటే ఎందుకొస్తావు? ఏం కావాలి?" అని ప్రశ్నించాడు.

"ఏంలేదు బాబుగారూ! ప్రొద్దున్న మీరు వూరికెడతానన్నారు. నేను ఇటు బోతాబోతా బాబుగారు ఊరికెళ్ళారో లేదో అని చూద్దామని యిటు వచ్చాను. తలుపుకు తాళం వేయకుండా వుంటే మీరు లోపల వున్నారని పిలిచాను" అని పనిమనిషి లచ్చి పలికింది.

పనిమనిషి లచ్చికి యాభై పైబడి వయసు వుంటుంది. పుగాకు తాగే అలవాటు వుంది. మనోహర్ అప్పుడప్పుడూ లచ్చికి డబ్బులు ఇస్తూ వుంటాడు.

మనోహర్ లచ్చి చేతిలో ఒకరూపాయి పెట్టి- "ఇంక వెళ్ళ మన్నాడు.

లచ్చి రూపాయి చేతిలో బట్టుకొని "మీ అమ్మగారి కడుపు చల్లగా వుండాలి. మీరు నూరేళ్ళు బ్రతికాలి బాబయ్యా!" అంటూ దండెం మీద వున్న చీరెమీద దృష్టి సారించింది.

మనోహర్ కూడ దండెంమీద వున్న చీరెనుజూచి స్తబ్ధుడయ్యాడు.

"అమ్మగారు వచ్చారా బాబూ?" అని లచ్చి ప్రశ్నించింది ఆతురతగా.

"నీకెందుకే?" అని మనోహర్ ప్రశ్నించాడు.

"ఏంలేదు బాబుగారూ! మొన్న అమ్మగారు ఈ వూరు వచ్చినప్పుడు ఒక గుడ్డముక్కను అడిగాను. "అందుకు అమ్మగారు యీ తడవ వచ్చినప్పుడు తెచ్చి ఇస్తానులేవే" అని అన్నారు. ఆ ఆశతో అడుగుతున్నాను బాబయ్యా" అని లచ్చి అంది.

మనోహర్ పనిమనిషిని ఏదో విధంగా వదిలించుకుందామని-"లచ్చీ! మా అమ్మగారు రాలేదు. కాని మా బంధువులు వచ్చారు. సరే! యీ చీరె, రవికె తీసికొనిపో. ఎవరికీ అమ్ముకోకు" అని మనోహర్ దండెంమీద వున్న సుచిత్ర చీరెను, రవికెను లచ్చిని తీసుకోమన్నాడు.

లచ్చి ఆ బట్టలను దీసికొని సంబరంతో అమ్ముకుంటానా బాబయ్యా! చివిగి ముక్కలయ్యేదాకా కట్టుకుంటాను" అని చీరె రవికె దండెం మీద వున్నది తీసికొని భుజాన వేసుకున్నది.

మనోహర్ దాని పీడ వదిలించుకుందామని దలచి లచ్చితో "చూస్తా వుగా! నువ్వు కట్టుకుంటావో, అమ్ముకుంటావో. ఇంక వెళ్ళు" అని పలి కాడు.

లచ్చి సంతోషంగా "ఈ రోజు ఎవరి ముఖం చూచానో చీర, రవిక దొరికినవి" అని గుమ్మందాటి మెట్లుదిగి వెళ్ళిపోయింది. మనోహర్ తలుపు వేసుకున్నాడు. పీడ విరగడయిందనుకున్నాడు.

సుచిత్ర లోపల నుండి కొంచెం బిక్క మొగంతో బయటికి వచ్చింది.

వస్తూన్న సుచిత్రను జూచి మనోహర్ "సుచిత్రా! ఎవరు గుర్తు పట్టలేనంతగా మారిపోయావు. ఆకారంలో, ప్రవర్తనలో. గదిలో దాగి వుండడం దేనికి?" అని ప్రశ్నించాడు.

"అవును! నేను కూడా అదే అనుకున్నాను. శైలూషినిగదా! ఇంకా ఎంతమంది దగ్గర ఎన్ని విధాలుగా నటింపవలసి వున్నదో" అని కిల కిలా నవ్వింది. ఆ నవ్వు హృదయాంతరాళం నుండి వచ్చినట్లుగా లేదు.

మనోహర్ గూడ నవ్వుతూ "ఇంకా ఇరవైనాలుగు గంటలేగా నువ్వు నటింపవలసింది" అని నర్మంగా పలికాడు.

ఇరవైనాలుగు గంటలేకాదు. జీవితాంతం వరకు మీకోసం శైలూగా నటిస్తాను. మీమీద నాకు అంత ప్రేమ" అని మనోహర్ ముంగురులను సవరిస్తూ పలికింది.

"నీ నటనకు నేను సూత్రధారినన్న సంగతి మరచిపోకు. నేను చెప్పినట్లుగానే నీవు నటించాలి!" అని చమత్కారంగా మనోహర్ పలి కాడు.

ఇరువురూ నవ్వుకున్నారు. సుచిత్ర తన బట్టలను పనిమనిషికి మనోహర్ దానమిచ్చినందుకు ఏమీ అనలేదు. పైగా సంతోషించింది. ఒక ఘనకార్యాన్ని, లేదా సత్కార్యాన్నిజేసే ముందు దానధర్మాలను జేస్తారు. ఆదే జరిగిందని సుచిత్ర భావించింది.

సుచిత్ర కొంచెం చురుకుగా దృష్టి సారించి- "నా బట్టలను పని మనిషి లచ్చికి నన్నుడుగకుండానే దానమిచ్చారు. అన్ని వస్తువులను అలాగే దానం చేస్తారా?" అని ప్రశ్నించింది.

"పాపం బీదరాలు, వృద్ధురాలు! నిన్ను దలుచుకుంటుంది. అయినా నీకూ—నాకూ తరతమభేదం ఇంకా ఎక్కడుంది? 'నా వన్నీ నీవి. నీవన్నీ నావి' అని నీవేగా చెప్పావు. నా వస్తువులను నీవు గూడ దానం చేయ వచ్చును. కావలసివస్తే కాగితంమీద వ్రాసి యిస్తాను" అని మనోహర్ పలికాడు.

"ఆ కాగితం మీ దగ్గరే వుంచుకోండి. దాచుకోవడానికి స్థలంలేదు" అని సుచిత్ర పలికింది.

మనోహర్ వ్యంగ్యంగా "జేబురుమాలు దాచుకోవడానికి స్థలం వుంది. కాని కాగితం దాచుకోవడానికి స్థలంలేదు" అని పలికాడు.

ఇరువురూ పకపక నవ్వుకున్నారు.

సుధాకర్ పంపిస్తానన్న కారు రావడానికి ఇంకా పావుగంట మాత్రమే సమయం వుంది. సామానంతా సర్ది రెండు ట్రంకుపెట్టెలను ముందు గదిలో బెట్టుకున్నారు.

తలుపులు గడియదీసి వోరగా వుంచాడు. హరికెన్ లాంతరు వెలి గించారు. కరెంటు ఎప్పుడు వస్తుందో, ఎప్పుడు పోతుందో నురి!

"మనోహర్! మనోహర్! అంటూ ఒక వ్యక్తి మెట్లు ఎక్కి లోపలి కొస్తున్నాడు. సుచిత్ర వేగంగా లోపలికి వెళ్ళడానికి ప్రయత్నించింది. కాని వకీలు గోపాలరావుగారి కంటబడ్డది.

గోపాలరావుగారు పేరుపొందిన వకీలు, యాబధి సంవత్సరముల పైబడి వయసు వుంటుంది. వారు కాజీపేటలో వుంటారు. మనోహర్ తండ్రికి చిన్ననాటి స్నేహితుడు. మనోహర్ నివసిస్తున్న ఇల్లు వారిదే. ఇంకా నిర్మాణంలో వుంది.

ఒక భాగం తయారయింది. దాంట్లోనే మనోహర్ అద్దెకుంటున్నాడు. వెనుక గూడ ఒక పోర్షను నిర్మించాలని వుంది. ఇంకా కరెంటు కూడా సరిగా వేయలేదు. మనోహర్ రెండు వందల రూపాయలు అద్దె యిస్తూ వుంటాడు.

గోపాలరావుగారు అద్దె కోసమే గాకుండా అప్పుడప్పుడూ వచ్చి, స్నేహితుని కుమారుడైన మనోహర్ మంచిచెడ్డలను విచారించిపోతూ

వుంటాడు. ఆయన రెండవ కుమారుడు రామారావు మనోహర్‌తోబాటు బి.ఇడి. ట్రైనింగ్ కోర్సు చదువుతున్నాడు.

గోపాలరావుగారు లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. మనోహర్ బల్లమీద వున్న పొట్లం విప్పి, ద్రాక్షపళ్ళను గోపాలరావుగారి ముందు పెట్టి లోపలికి వెళ్ళి గ్లాసుతో మంచినీళ్ళు తీసుకువచ్చి బల్లమీద వుంచాడు.

గోపాలరావుగారు మనోహర్‌తో "ఎక్కడికో ప్రయాణమయినట్టు న్నారు? ఇప్పుడు లోపలికి వెళ్ళిన అమ్మాయి ఎవరు?" అని ప్రశ్నించాడు.

మనోహర్ ఎటువంటి తొట్రుపాటు, వడిదుడుకు లేకుండా "ఇంటికి వెళుతున్నాను. బాబాయ్! అమ్మకు సుస్తీగా వున్నదట. నన్ను గురించి కలవరిస్తున్నదట. లోపలికి వెళ్ళినది నా మేనకోడలు. చిన్నప్పుడే తల్లి దండ్రులు చనిపోయారు. మా అమ్మే పెంచి పెద్దచేసింది. ఆమె బంధువు వరంగల్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. వారిని ఒకసారి జూచి ఒకటి రెండు రోజులుండి నన్ను వెంటబెట్టుకొని తీసుకురమ్మని పంపింది" అని పలికాడు.

మనోహర్ మాటలకు గోపాలరావుగారికి ఎటువంటి సందేహం అనుమానం కలగలేదు. చెప్పిన మాటలో కొంత గజిబిజి వున్నా, మనోహర్ వంటి సత్శీలుడు ఎక్కడ వుండడని వకీలుగారి నమ్మకం. ఇంకేమీ ప్రశ్నించకుండా "తిన్నగా ఇంటికేనా?" అని ప్రశ్నించాడు.

మనోహర్ తడబడకుండా "ఈ రాత్రికి పెళ్ళి వారితో బాటు జనగాం పెళ్ళి, అక్కడే పెళ్ళి చూసుకుని రేపు సాయంత్రానికి విజయవాడ చేరుకుంటాను" అని పలికి అద్దె తాలూకు రెండు వందల రూపాయలు పర్సునుండి దీసి గోపాలరావుగారి చేతికిచ్చాడు.

గోపాలరావుగారు నోట్లను జేబులో బెట్టుకొని మా రాము గూడ ఆ పెండ్లికే ప్రయాణమయ్యాడు. కాని నేనే వద్దన్నాను. నేను రేపు, ఎల్లుండి ఊరు వెళ్ళవలసి వుంది. ఇంటిదగ్గర ఎవరూ వుండరని పెళ్ళికి వెళ్ళవద్ద న్నాను. లేకపోతే మా రామూ కూడా మీతో వచ్చి వుండేవాడు" అని పలి కాడు.

మనోహర్ గోపాలరావుగారిని ఏ విధంగానైనా పంపించాలను కున్నాడుగాని వారు. కదిలేటట్లుగా లేదు. లోపల సుచిత్ర, బయట మనో హర్ ఆందోళన పడసాగారు.

మనోహర్ ఒక కవరును గోపాలరావుగారి చేతికిచ్చి యీ కవరును మా ట్రైనింగ్ కాలేజీ ప్రిన్సిపాల్‌గారికి ఇవ్వమని మీ రాముతో చెప్పండి. ఇది లీవు లెటరు. ఒక వారం రోజులలో తిరిగి వస్తానని మీ రాముతో చెప్పండి" అని పలికాడు.

"అట్లాగే!" అని కవరును ప్రక్క జేబులో బెట్టుకొని కళ్ళజోడు సరిజేసికొని "మనోహర్! ఏదీ! మీ మరదలు పిల్లను బయటికి రమ్మను. ఒకసారి జూస్తాను. నీకు కాబోయే పెళ్ళికూతురు ఎంత అందంగా వుంటుందో!" అని గోపాలరావుగారు పలికాడు.

ఈ మాటలు విన్న సుచిత్ర గుండెలు కొట్టుకొనసాగినవి. ఈ గోపాలరావుగారు ఒకటి రెండుసార్లు వాళ్ళ ఇంటికి వచ్చి, పరిమళమ్మతో ఏవో వ్యవహారాలు మాట్లాడినట్లు గుర్తు. తనను గూడ జూచినట్లు గుర్తు.

ఒకసారి తల్లి పరిమళం గుండెపోటుతో బాధపడుతున్నప్పుడు "నా ఆస్తి అంతా నీ పేరుమీద వ్రాశాను. నా మరణానంతరం కాజీపేటలో వున్న వకీలు గోపాలరావుగారిని కలుసుకోమని అన్నది. ఆ గోపాలరావు గారేనేమో! ఇంకేముంది. తన గుట్టు బట్టబయలు జేస్తాడు" అని ఆమె గుండెలు తటతట కొట్టుకొనసాగినవి.

మనోహర్ కూడ కొంచెం అధైర్యం చెందాడు. అయితే అతడు సహజమైన కంఠంతో "శైలజా! అని కేకవేశాడు. లోపలి గుమ్మం దగ్గర కొచ్చి రమ్మని సైగ జేశాడు.

ఆమె కూడ లేని ధైర్యం దెచ్చుకొని మెరుపులాగా మెరిసి గోపాల రావుగారి ముందు నమస్కరించి నిలబడింది.

గోపాలరావుగారు ఆమె అందచందాలను జూచి మురిసిపోయాడు. "అబ్బాయ్! మనోహర్! ఈ అమ్మాయివంటి ముఖమే ఎక్కడో చూచి నట్లుగా గుర్తుగా వుంది. కాని జ్ఞాపకం రావడం లేదోయ్" అని పలికాడు.

వకీలుగారు మళ్ళీ "శైలజ అని పేరుకూడ ఎక్కడో విన్నట్లు గుర్తుగా వుందోయ్" అని పలికాడు.

మనోహర్ పకపక నవ్వుతూ "బాబాయ్! మీరు అనుభవజ్ఞులు ప్రతిరోజూ ఎన్నో జూస్తూ వుంటారు. ఎన్నని మీకు గుర్తుగా వుంటాయి అని పలికాడు.

వకీలుగారు తన మతిమరపుతనాన్ని మనోహర్ ఎగతాళి చేస్తున్నా డేమోనని భావించి మాట మార్చి, "మనోహర్! పేరుకు తగినట్లే అమ్మాయి శైలజ లాగే వున్నది. ఇంత అందమైన కోడలును ఇంట్లో బెట్టుకొని మీ నాన్న మీ యిద్దరికి పెళ్ళెందుకు చేయలేదో ఉత్తరం వ్రాస్తానుండు" అంటూ ఒక చిరునవ్వు నవ్వి- మరొక ద్రాక్షపండు నోట్లో వేసుకుని చప్పరించాడు.

మనోహర్ నవ్వుతూ "నేను వివాహం చేసుకోవడానికి సిద్ధంగా వున్నాను. కాని శైలజ జేసుకోనంటున్నది. మీరయినా చెప్పండి" అని పలివ కాడు.

గోపాలరావుగారు మరొక ద్రాక్షపండును గుత్తిలోనుంచి దెంపి "అమ్మాయి శైలజా! మనోహర్‌కు ఏమి తక్కువని జేసుకోనంటున్నావు" అని పలికారు.

మనోహర్ జేసిన అసంబద్ధ ప్రసంగానికి అతనివైపు తీవ్రంగా ఒక చూపుచూచి-వకీలుగారితో "వారు చెప్పిందంతా అబద్ధమండీ! నేను చేసుకోడానికి సిద్ధంగా వున్నాను. ట్రయినింగ్ పూర్తికానిదే? చేసుకోనని అంటున్నారు."

వకీలుగారు గుత్తినుండి త్రుంచిన ద్రాక్షపండును నోట్లో వేసికొని. రసాన్ని మ్రింగుతూ "మీ ఇద్దరికీ యీడూ, జోడు చక్కగా వుంది. రతీ మన్మధుల్లాగా వున్నారు. త్వరగా వివాహం చేసుకోండి" అని పలికారు.

వకీలుగారు రెండు ద్రాక్షపండ్లను చేతితో త్రుంచుకొని లేచి- "వెళ్ళి వస్తాను మనోహర్! పొద్దుపోయింది. జాగ్రత్తగా ఇంటికి వెళ్ళండి. రోజులు బాగాలేవు". అని పలికాడు,

మనోహర్ అవునన్నట్లు తలవూపుతూ, వెళ్ళిపోతున్నందుకు సంతోషిస్తూ "ద్రాక్షపళ్ళ పొట్లం తీసికొని వెళ్ళండి బాబాయ్! ఇంటికివెళ్ళి తిందురుగాని" అని పలికాడు.

వకీలుగారు వద్దంటూనే పొట్లాన్ని భద్రంగా సంచీలో బెట్టుకుంటూ "వెళ్ళవస్తాను" అని మరోసారి పలికి, సుచిత్రవైపు మరొకసారి ఎగాదిగా జూస్తూగుమ్మందాటి మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

వకీలుగారు వెళ్ళిపోగానే మనోహర్ మళ్ళీ తలుపులు దగ్గరగా వేశాడు. ఆపద గడిచిందిగదా! అని ఒకరినొకరు కౌగలించుకున్నారు. ఇరువురి హృదయాలు టకటకా కొట్టుకుంటున్నాయి. వారి ఆలింగనము ఒక గుండె ఆవేదనను మరొక గుండె ఓదార్చుతున్నదా అన్నట్లున్నది. ఇంతలో బయట కారు వచ్చిన శబ్దం, హారన్ మ్రోగిన శబ్దం వినబడింది.

ఇరువురి నోటినుండి "అమ్మయ్య! ఆపద గడిచింది" అనే వాక్యం వెలువడింది.

మనోహర్ తలుపులు తెరిచి బయటికి, సుచిత్ర లోపలి గదిలోనికి వెళ్ళడం ఒక్కసారిగా జరిగింది.

కారు లోపలినుండి చంద్రకళ రివ్వున లోపలికొచ్చింది.

# 5

మనోహర్ ఆరోజు ఉదయం 'సుచిత్ర తాను ఏ విధంగా ఇచ్చటినుంచి బయట పడాలా' అన్న ఆలోచనలతో బయటికి వెళ్ళాడు. కాని అది అంత తేలిక అనిపించలేదతనికి. రంగడు మొదలయిన రౌడీలు సుచిత్రను ఏమాత్రం జూచినా ప్రమాదమని గుర్తించాడు. ఆమెతోబాటు తాను గూడ విషవలయంలో చిక్కుకోవలసి వస్తుందని తావించాడు.

తన ప్రియమిత్రుడు సుధాకర్ రెడ్డి వివాహం రేపు ఉదయం జనగాంలో జరుగబోతున్నదనీ, ఈరోజు జనగాంనుండి పెళ్ళివారు వచ్చి సుధాకర్ ను యీ రాత్రికి తీసుకువెళతారని కూడ వూహించాడు.

సుధాకర్ రెడ్డి కులస్థులు సంపన్నులు. తనతోబాటు బి.ఇడి. కోర్సు పూర్తి చేస్తున్నాడు. సుధాకర్ గదికి, మనోహర్ కాజీపేటలో వున్న సుధాకర్ గృహానికి వస్తూపోతూ వుండేవారు. మనోహర్‌కు సుధాకర్ ఇంటిలోని వారందరూ పరిచయమయ్యారు. సుధాకర్ చెల్లెలు డాక్టరు కోర్సు చదువుతూ వున్నది. మనోహర్‌ను "అన్నయ్యా!" అని పిలిచేది. మనోహర్ గూడా చంద్రకళను "చెల్లీ" అని పిలిచేవాడు.

"సుచిత్ర పెళ్ళివారితో ఇచ్చటినుండి వెళితే, ఎవరూ గుర్తించరని మనోహర్ భావించాడు. పెళ్ళి వంకతో జనగాంవరకు వెళ్ళి, అచ్చటినుండి విజయవాడకు తేలికగా రైలుమీదగాని, బస్సుమీదగాని తేలికగా వెళ్ళవచ్చునని అతని ఊహ!

ఈ విషయమంతా సుధాకర్‌కు తెల్పియజేయాలా? వద్దా? అని సందేహం గలిగించి. అతనికి నిజవిషయమంతా తెలియచేసినట్లయితే-అతదేమనుకుంటాడో ఏమో. తెలియజేయకపోతే ప్రియమిత్రునకు ద్రోహం చేసినట్లు గాదా?" అని వూహించాడు మనోహర్.

ఇన్ని ఆలోచనలతో అతడు హనుమకొండ నుండి కాజీపేటకు బయలుదేరాడు. చౌకులో రంగడు కనిపించాడు. అతని గుండె కొట్టుకున్నది. రంగుడు కూడ మనోహన్‌ను జూచాడు. మనోహర్ అతనిని లెక్కజేయకుండా చూచీ చూడనట్లు ముందుకుబోయాడు. కొద్ది దూరంవెళ్ళి రంగడు తనను వెంబడించాడేమోనని వెనుదిరిగి చూచాడు. అతడు కొంత దూరం వచ్చి వెనుదిరిగిపోవడం గమనించాడు మనోహర్.

మనోహర్ తిన్నగా కాజీపేటలో వున్న తన మిత్రుడు సుధాకర్ ఇంటికి వెళ్ళాడు. ఇల్లంతా అలంకరింపబడి వుంది మేళతాళాలతో, మంగళధ్వనులతో కళకళలాడుతున్నది.

సుధాకర్‌ను పెళ్ళికొడుకును జేస్తున్నారు. ముత్తయిదువులు కాళ్ళకు పారాణిబెట్టి, ముఖమందు పెళ్ళిబొట్టుపెట్టి, బుగ్గమీద కాటుకతో చుక్కబొట్టుపెట్టి, మంగళహారతి యిస్తున్నారు.

మనోహర్ దూరం నుండి సుధాకర్‌ను జూచి, చిరునవ్వు నవ్వాడు. సుధాకర్ కూడ మనోహర్‌ను జూచి చిరునవ్వు నవ్వాడు.

మనోహర్ తన వివాహమునకు రావడం జూచి, సుధాకర్ ఖికి
ఆనందించాడు. వారిరువురు బంధువులు కాకపోయినా ప్రాణస్నేహితు
కొంతమంది లోకంలో చిరకాలం స్నేహం చేసినా ఆప్తమిత్రులు కాలే
కొంతమంది కొద్దికాలపు పరిచయంతోనే ప్రాణస్నేహితులవుతారు. వారి
స్నేహం అటువంటిది.

తరువాత సుధాకర్ మంగళవస్త్రములతో మనోహర్ దగ్గరకు వ
కరచాలనం చేశాడు.

మనోహర్ కూడ సుధాకర్‌ను అభినందించాడు.

"తాను పెండ్లికి రావడంలేదనీ, తన తల్లికి సుస్తీగా వుండ
వలన ఇంటికి వెళుతున్నాననీ తెలియజేశాడు. తనకోసం-తన మేనగోడ
విజయవాడ నుండి వచ్చినట్లు తెలియజేశాడు.

సుధాకర్ విచారిస్తూ "మిత్రమా! ఒక్క రోజులో ముంచుకుపోయి
దేమీలేదు. మీరిరువురూ రాత్రికి మాతో వచ్చి, రేపు ఉదయం పెం
చూచుకుని జనగాంమీదుగా విజయవాడకు వెళ్ళవచ్చునని సూచించాడు.

తనతోబాటు తన మేనగోడలు వున్నదని మనోహర్ సుధాకర్‌తో
పలికాడు. ఆమె తన చెల్లెలితోబాటు వుంటుందనీ, ఇరువురూ రావలసిందని
బ్రతిమాలడం జరిగింది. సాయంత్రం ఏడుగంటల సమయానికి కారు పంపు
తానని పలికాడు.

తాను అంగీకరించడం, తిరిగి రావడం జరిగింది. తాను తిరిగి వచ్చే
సరికి సుచిత్ర పారిపోవడానికి ప్రయత్నించడం, తాను ఆమెను ప్రసన్న
రాలిని చేయడం జరిగింది. పనిమనిషి లచ్చి, వకీలు గోపాలరావుగారు
రావడం-పోవడం జరిగింది. సుచిత్ర, తాను ఎన్నో అబద్ధాలాడడం, నటిం
చడం జరిగింది. ఇతరులకు హాని గలుగకుండా, తన అభిమానం పోకుండా
అబద్ధాలాడవచ్చునేమో!

ఏడుగంటల సమయంలో సుధాకర్ కారు పంపుతానన్నాడేగాని,
తన సోదరి చంద్రకళనే పంపుతాడని మనోహర్ ఊహించలేదు.

చంద్రకళ కారులో నుండి రివ్వున ఇంట్లోకి వచ్చి-"అన్నయ్యా! పెళ్ళికి రాకుండా తప్పించుకుందామని అనుకున్నావా? అదేమీ సాగదు. అన్నయ్య సుధాకర్ నిన్ను వెంటబెట్టుకుని తీసుకురమ్మన్నాడు. నీతో బాటు వదిన ఉన్నదని కూడ చెప్పాడు. ఏదీ మా వదిన? ఎక్కడ వున్నది?" అంటూ మనోహర్ సమాధానం ఆశించకుండా చరచరా లోపలికి వెళ్ళింది.

చంద్రకళను జూచి సుచిత్ర ఆశ్చర్యబోయింది.

తన అంత అందగత్తె గాకపోయినా, తనకంటే లోకజ్ఞానం తెలివి తేటలు ఆమెలో తొంగిచూస్తున్నవి

తనతో సమానమైన వయస్సుగలదిగా కనిపించింది. కోల ముఖం, కొంచెం శ్యామలవర్ణం. కాని ఒక విచిత్రమైన అందం, తేజస్సు ఆమె ముఖంలో దోబూచులాడుతున్నవి.

ఇతరులతో మాట్లాడడం అంటే, తనవలె ఏమాత్రం అనుమానం, సిగ్గు, భయము కనిపించడం లేదు.

ఆధునిక విద్యాసముపార్జన వలన ఆ విధంగా మనుషులు మారి పోతారేమోనని వూహించింది.

చంద్రకళ సుచిత్రను ముందు గదిలోకి తీసికొని వచ్చి-"ఇంక బయలుదేరండి. కొద్దిసేపటిలో ఘటికాస్థాపన, గౌరీపూజ జరుగుతుంది. దానికి మనం అందుకోవాలి" అని పలికింది.

మనోహర్ వెంటనే అందుకుని "నీవచ్చుట మంగళహారతి కూడ పాడాలికదూ చెల్లీ!" అని చిరునవ్వు నవ్వాడు.

"అవును! పాడాలిగాని నాకు రాదుగదా!" అని మనోహర్‌తో చంద్రకళ పలికింది.

"రాకపోతే ఆడబిడ్డ కట్నం రాదు సుమా!" అని మనోహర్ నవ్వుతూ-సుచిత్రను జూపుతూ-"మీ వదినకు మంచి మంచి మంగళహార తులు వచ్చును. ఆమెతో పాడించు" అని పలికాడు.

మనోహర్ మాటలకు సుచిత్ర మాట్లాడకుండా ముఖం చిట్లించింది.

చంద్రకళ అది గమనించకుండా-"వదినా! శైలజా! పెళ్ళి అయిపోయే వరకు నీవు నా ప్రక్కనే వుండాలి. నిన్ను వదిలిపెట్టను. నన్ను హారతి పాడమన్నప్పుడల్లా నీవు పాడుతూ వుండాలి" అని సుచిత్ర చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది.

సుచిత్ర తన మనసులో గలుగకపోయినా లేని చిరునవ్వు తెచ్చి పెట్టుకుంది. అడుగడుగున మనోహర్ లేనిపోని సమస్యలు తెచ్చిపెడుతున్నాడని కలవరపడింది. చంద్రకళ చతుర సంభాషణకు నివ్వెరబోయింది.

"ఏమిటో! యీ ఆచారాలు, సంప్రదాయాలు. పురుషులకేమోగాని, స్త్రీలకు ప్రాణాలుబోతూ వున్నవి" అని చంద్రకళ విసుగుతో పలికింది.

ఆ మాటకు మనోహర్ అందుకుని-"మీ అన్నయ్యకు రెండులక్షల రూపాయల కట్నంతోబాటు నీకు పదివేల రూపాయలు ఆడబిడ్డ కట్నం వస్తున్నదిగదా" అని అన్నాడు.

చంద్రకళ ఆ మాటను విదిలించి-"అన్నయ్యా! వున్నవాళ్ళు కాబట్టి యిస్తున్నారు. మరి లేనివాళ్ళ సంగతి?"

"నా పెళ్ళికి గూడ యీ లాంఛనాలన్నీ యివ్వాలిగదా?" అని ప్రశ్నించింది.

మనోహర్ చంద్రకళను రెచ్చగొడుతూ- "చెల్లాయ్! మరిప్పుడు నువ్వు ఏమి చేయాలని కోరుకుంటావు?" అని ప్రశ్నించాడు.

చంద్రకళ బొమలు చిట్లించి-"నేనేమీ చేయాలని కోరుకోవడంలేదు. నేననేది ఇది చెడ్డ సాంప్రదాయమని మాత్రమే! స్త్రీలకు కూడ తండ్రి ఆస్తిలో భాగం యిస్తే సరిపోయేది. ఈ కట్నాలు, కానుకలు అనే ఆచారాలు లేకుండా. కట్నం అనే పేరుతో స్త్రీలను అవమానిస్తున్నారు తప్ప. గౌరవభావం ఏమాత్రం కనిపించడంలేదు" అని పలికింది.

స్త్రీని గురించి అంత వేదనా పూరితంగా మాట్లాడుతున్న చంద్రకళను కౌగలించుకోవాలనిపించింది సుచిత్రకు.

మనోహర్‌కు చంద్రకళ మాటలయందు సత్యం-అసత్యం ఎంత
ఆమె మనోహరమైన కంఠస్వరాన్ని, మధురవాక్య విన్యాసాన్ని
ని మనోహర్ కుతూహలం.

మనోహర్ చంద్రకళతో "చెల్లాయ్! నీవు చెప్పేదంతా యదార్థమే!
ట్నాల సంగతి అలా వుంచు. ఒక విషయాన్ని అడుగుతాను నీ అభి
మేమిటో తెలుపుతావా?" అని ప్రశ్నించాడు.

"ఏమిటది?" చంద్రకళ తీవ్రంగా ప్రశ్నించింది.

మనోహర్ సుచిత్రవైపు ఒక చూపుచూసి- "పడుపు వృత్తిని
ది నీ అభిప్రాయం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

చంద్రకళ శబ్దజాలాన్ని ఏమాత్రం వెదుకకోకుండా-"ఆదికాలం
పురుషుడు స్త్రీని వేధిస్తున్నాడు.

స్త్రీని ఒక బానిసగా చూస్తున్నాడు. అందులో ఒక భాగమే పడుపు
! రాతియుగం నుండి ఎన్నో దశలుగా మానవుడు మార్పు చెందాడు.
తిపరుడుగా, నాగరికుడుగా మారాడు. కాని యీ విషయంలో
ం ఆనాటి ప్రాథమిక దశలో వున్న అజ్ఞానంలోనే వున్నాడు" అని
ంది.

మనోహర్ మళ్ళీ గంభీరంగా-"ఎంతోమంది మహానుభావులు ఈ
ంలో కృషిజేశారుగదా! ఎందుకు మార్పు రాలేదు?" అని విషయం
ని విద్యార్థివలె ప్రశ్నించాడు.

"చంద్రకళ-"అవును! మన తెలుగుదేశంలో కీ.శే. కందుకూరి
లింగం పంతులుగారు, రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు, ఇంకా
మంది ప్రముఖులు ఈ సానివృత్తి నిర్మూలనం కోసం కృషి చేశారు.
మార్పు జరిగింది" అని పలికి కంఠాన్ని హెచ్చుచేసి-"అన్నయ్యా!
డు మనం గొంగడిలో పెరుగన్నం తింటున్నాం. ఈనాటి మన సామా
వ్యవస్థలో అనేక చెడు సాంప్రదాయాలు, అనేక కట్టుబాట్లు వున్నాయి.
పూర్తిగా మటుమాయం కావాలంటే, ముందుగా మన ఆర్థిక వ్యవ
మార్పులు రావాలి. ఈనాటి దుష్టమైన ఆర్థికవ్యవస్థే-అన్నింటికీ మూల

కారణం. ఈ వ్యవస్థ మారనిదే మనం మార్పులు, చట్టాలు ఎన్ని తెచ్చినా బూడిదలో పోసిన పన్నీరే" అని పలికి చేతి గడియారం చూసింది. ఏడున్నర గంటలయింది.

మనోహర్‌ను చంద్రకళ తొందరబెడుతూ "ఇంక బయలుదేరండి అన్నయ్యా! ఎనిమిదిగంటలు కావస్తున్నది" అని పలికింది.

మనోహర్ నవ్వుతూ "చెల్లాయ్! నీ మధురమైన ఉపన్యాసం వింటూ వుంటే-నాకు సుధాకర్ పెళ్ళికి వెళ్ళాలనిలేదు" అని పలికాడు.

చంద్రకళ వక్తృత్వ మాధుర్యానికి, లోకజ్ఞానానికి సుచిత్ర మనస్సులో ఎంతగానో మెచ్చుకుంది. ఆమె కోరినట్లుగా పెళ్ళి పూర్తిగా జరిగేటంతవరకూ-తాను వెళ్ళిపోయేవరకు ఆమె వెంటనంటి వుండాలనుకుంది.

సుచిత్ర చంద్రకళను కౌగిలించుకుని "చంద్రా! నువ్వు యీ విషయాలన్నీ పాఠశాలలో నేర్చుకున్నావా?" అని ప్రశ్నించింది.

చంద్రకళ సుచిత్ర మాటలకు జవాబు చెప్పకుండా, ఆమె భుజాలమీద రెండు చేతులువేసి, ఆమెను ముద్దు పెట్టుకుంది. ఆక్షణం ఒకరిపైని ఒకరికి సౌజన్యభావం వెల్లివిరిసింది.

సుచిత్ర కంఠం బోసిగావుండడం జూచి తన మెడలోవున్న రెండు బంగారు గొలుసులలో ఒకదానిని తీసి సుచిత్ర మెడలో వేసింది.

సుచిత్రకు ఆ గొలుసు వేసుకున్నందువలన అదివరకులేని క్రొత్త అందం వచ్చింది. సుచిత్ర చెవులకు అదివరకు బంగారు రింగులు వున్నవి. చంద్రకళ ఆ రింగులుదీసి తాను బెట్టుకుని తన చెవులకున్న ముత్యాలు, పగడాలు పొదిగిన కమ్మలుదీసి సుచిత్ర చెవులకు బెట్టింది. అద్దం జూడమని అద్దం దగ్గరకు తీసికొనివెళ్ళి చూపింది.

సుచిత్ర అద్దంలో తన రూపం చూచుకుంది. పట్టుచీరెమీద బంగారు హారం మెరుస్తూవున్నది. చెవులకు దిద్దులు క్రొత్త అందం తీసికొనివచ్చినవి. ఒక కులీన స్త్రీకివలె, క్రొత్త ముత్తయిదువుకువలె తానిప్పుడున్నది. 'ఇంక తనను ఎవరు గుర్తుపట్టగలరు?' అని అనుకున్నది.

సుచిత్ర చంద్రకళతో "నేనిప్పుడెట్లా వున్నాను?" అని ప్రశ్నించింది.

చంద్రకళ వెంటనే "పెళ్ళికూతుపవలెనున్నావు. బుగ్గమీద కాటుక చుక్క ఒకటిబెడితే-పెళ్ళికూతురువు నీవే అనుకొని అందరు నీ వైపు జూస్తారు" అని నవ్వింది.

మనోహర్ కూడ చంద్రకళతో కలిసి నవ్వాడు.

సుచిత్ర ముఖంమీద సిగ్గుతెరలు దోబూచులాడినవి.

చంద్రకళ కారు డ్రైవరును పిలిచి మనోహర్ రెండు ట్రంకుపెట్టెలను కారులో బెట్టించింది.

మనోహర్ చందనపు దండలతోవున్న సంచీని సుచిత్ర జేతికిచ్చి, మనోహర్ బయటి తలుపుకు తాళం వేశాడు. ముగ్గురూ కలిసి కారు దగ్గరకు వెళ్ళారు. మనోహర్ డ్రైవర్ ప్రక్కన కూర్చున్నాడు. సుచిత్ర, చంద్రకళలిద్దరు వెనుకవయపలో కూర్చున్నారు. కారు బయలుదేరింది. మెయిన్‌రోడ్డుమీద నుండి కాజీపేటవైపుకు కారు పోతూవున్నది.

## 6

కారు వెళ్ళి కాజీపేటలో ఒక విశాలమైన భవనంముందు ఆగింది. ఆ భవనంముందు పెద్ద పందిరివేసి వున్నది. మామిడితోరణములు, అరటి చెట్లు, కొబ్బరి మండలను స్థంభములకు కట్టి అలంకరించారు. రంగు రంగుల కాగితములను చిత్ర విచిత్రములైన పువ్వులుగా చిత్రించి, పందిరి అంతా అలంకరించారు. ఆ భవనంముందు ఎన్నో కార్లు, రిక్షాలు, జట్కా బళ్ళు నిలిచివున్నవి. బయట మధురమంగళ సంగీతధ్వనులు చెలరేగుతున్నవి. భవనము లోపల మంగళగీత మధుర రవములు వినబడుచున్నవి.

ఆ సమయంలో ఒకరిమాట ఒకరు వినిపించుకొనునట్లు లేదు. అందరూ పెండ్లి పనులలో అటూ-ఇటూ పరుగెడుతున్నారు. పెండ్లివారు పెండ్లికుమార్తె యింటికి వెళ్ళుటకు రెండు మూడు గంటలు వ్యవధి మాత్రమే వున్నది.

ఆగిన కారులో మనోహర్ ముందు దిగాడు. చంద్రకళ సుచిత్రతో కలిసిదిగి, డ్రైవరుతో మనోహర్ పెట్టెలను తన గదిలో భద్రంగా వుంచమని చెప్పింది.

సుచిత్ర పూలదండలతోవున్న సంచిని మనోహర్‌కిచ్చింది. సంచిని చంద్రకళకిస్తూ ఇది కూడా ఆమె గదిలోనే భద్రపరచమని చెప్పి, తాను అతిధులకొరకు వేసిన కుర్చీలలో ఒకదానిపై కూర్చున్నాడు.

చంద్రకళ సుచిత్రను తన గదిలోనికి తీసికొనివెళ్ళి, అక్కడవున్న కుర్చీలో ఆసీనురాలినిగాజేసి, మనోహర్ యిచ్చిన సంచిని భద్రపరచి, సుచిత్రను అచ్చటనే కూర్చోమనిచెప్పి, తాను అన్నగారువున్న పూజా మందిరంలోకి వచ్చి, మనోహర్‌ను తీసుకువచ్చాననీ, అతనితోపాటు అతని మేనగోడలు కూడ వచ్చినదని, తన గదిలో కూర్చున్నదని చెప్పింది.

సుధాకర్ సంతోషించి, మనోహర్‌ను కలుసుకుందామనుకున్నాడు. ఇంతలో గౌరీపూజకు ముహూర్తం సమీపించిందని, వెంటనే రావలసిందని కబురుజేశారు. హారతి మున్నగునవి యిచ్చుటకు తోబుట్టువుకూడ దగ్గర వుండాలని చెప్పారు. సుధాకర్ చంద్రకళనుగూడ రమ్మని పూజామందిరం లోకి వెళ్ళిపోయాడు.

సుచిత్ర చంద్రకళ గదిలో కూర్చున్నదిగాని, ఆమె హృదయంలో వేయి రైలుబండ్లు పరుగెడుతూ వున్నవి. తనను ఎవరైనా గుర్తిస్తే-తన పనియేమవుతుంది?

మనోహర్‌కేం? అతడు పురుషుడు! తప్పించుకుంటాడు. మనోహర్ తనను తనయింటికి తీసికొనివెళ్ళక యీ పెళ్ళివారింటికి యెందుకు తీసికొని రావాలి?

హనుమకొండ, కాజీపేట వరంగల్లులో అంతర్భాగములు. హనుమకొండలో వున్నవారు కాజీపేటకు, కాజీపేటలో వున్నవారు వరంగల్లుకు వస్తూపోతూ వుంటారు.

తానున్నది వరంగల్లు! మనోహర్ వున్నది హనుమకొండ. వివాహము జరుగుతున్నది కాజీపేటలో! ఈ పెండ్లి పందిరిలో ఎవరయినా తనను గుర్తించి జూస్తే ఏమికాను? ఒకవేళ రంగడే యిచ్చటికి వస్తే?

అయినా యిట్టి కులీన కుటుంబ వ్యక్తులతో తాను యీ విధంగా ప్రవర్తింపవచ్చునా? తానొక చరిత్రహీన. పగిలినపాత్ర. పురివిడివడిన చేదాడు. సూత్రంలేని గాలిపడగ. తనను యీ సమాజంలో ఎవరూ గౌర వింపరు. తనకీ సంఘంలో ఎటువంటి స్థానమూలేదు.

తనను మనోహర్ యీ విధంగా ఆటబొమ్మగా ఆడిస్తున్నాడా? లేక నిజంగా ప్రేమిస్తున్నాడా? మనోహర్‌ను జూస్తుంటే—అనుభవశూన్యుడైన ఆవేశపరునిగా కనిపిస్తున్నాడు. నిజ విషయాన్ని నేనెంతగాజెప్పినా, అతడు వినిపించుకోవడంలేదు. ఇందులో నా తప్పేముంది?

నేనొక శైలూషినిగా నటిస్తున్నాను. నేను నటిస్తున్నది ఒక నాటకం మాదిరిగా వుంది. ఈ నాటకం ముగుస్తుందా? సుఖాంతం అవుతుందా? విషా దాంతం అవుతుందా? లేక మధ్యలో ఆగిపోతుందా?

ఇక్కడినుండి తప్పించుకుని వెళ్ళిపోతే? చంద్రకళ తనను విశ్వ సించి, తన బంగారు గొలుసును నా మెడలో అలంకరించింది. ఈ స్వర్ణా హారంతో నేను పారిపోతే నన్ను మోసగత్తెగానేగాకుండా-దొంగతనాన్ని నాకు ఆరోపించి, పోలీసులకు రిపోర్టు జేస్తారు.

ఈ ఆలోచనలతో చంద్రకళ గదిలో కూర్చున్న సుచిత్ర కలవర బాటు పడుతున్నది.

ఇంతలో చంద్రకళ గదిలోనికి చరచరావచ్చి "వదినా! శైలజా త్వరగా వెళదాం. పద. అన్నయ్య సుధాకర్ పూజామందిరంలో గౌరీపూజ చేస్తున్నాడు. మనం అక్కడికి వెళ్ళాలి" అని పలికింది.

సుచిత్ర కలవరబాటుతో "నేనెందుకూ?" అని ప్రశ్నించింది.

చంద్రకళ సరసంగా "ఇప్పటివరకు నీకు చెప్పింది ఏమిటి? మా అన్నయ్య వివాహం జరిగేటంతవరకు నీవు నావెంట వుండాలి. నన్ను మంగళహారతి పాడమన్నప్పుడల్లా, నీవు పాడుతూ వుండాలి! అని చెప్ప లేదూ?" అని పలికింది.

సుచిత్ర మరింత కలవరపాటుతో "నాకు మంగళహారతులు రావు! నేను ఎప్పుడూ-ఎక్కడా పాడలేదు" అని పలికింది.

చంద్రకళ నవ్వుతూ "అమ్మదొంగా! అన్నీ అబద్ధాలేనా? ఇప్పుడేగా మనోహర్ అన్నయ్య చెప్పాడు. నీకు ఎన్నోపాటలు వచ్చుననీ, కంఠం ఎంతో బాగుంటుందనీ కావలిసివస్తే నాకు వచ్చిన కష్టంలో సగం నీకు యిస్తాలే" అని నవ్వుతూ పలికింది.

సుచిత్ర ముఖం చిట్లించి "వారు అబద్ధం చెప్పారు! నేను రాను. నువ్వు వెళ్ళు" అని పలికింది.

చంద్రకళ దీనంగా సుచిత్రవైపు జూచి "వదినా! నన్ను పెళ్ళివారి ముందు అవమానిస్తావన్నమాట. 'పాటలురాని ఆడబడుచు' అని అందరూ ఎగతాళిజేస్తారు" అని పలికింది.

సుచిత్ర చంద్రకళ వైపుజూచి "నీకుబదులు నేను పాటబాడడం జూచి, అప్పుడు మాత్రం పాటలురాని ఆడబడుచు అని అనరా?" అని పలికింది.

చంద్రకళ చిరునవ్వు నవ్వుతూ "నన్ను పాటపాడమనగానే నీవు పాట మొదలుపెట్టాలి! నీ పాటను నేను అందుకుంటాను" అని పలికింది.

సుచిత్ర చిరునవ్వు చిందిస్తూ "ఇన్నిమాటలు నేర్చినదానవు పాటలు ఎందుకు నేర్చుకోలేదు?" అని ప్రశ్నించింది.

చంద్రకళ వెంటనే "ఇంక నేర్చుకుంటాను, నీవే నాకు గురువు" అని చేతులుబట్టుకొని సుచిత్రను లేవదీసింది. భుజముమీద చేతులువేసికొని పూజామందిరంలోనికి తీసికొని వెళ్ళింది.

పూజామందిరం గది చాలా విశాలంగావుంది. గది అంతటా చాపలు బరచివున్నవి. గది అంతా ముత్తయిదువులతో నిండివున్నది. కొద్దిమంది పురుషులు ఒకవైపున కూర్చున్నారు. వచ్చిన ముత్తయిదువులందరకీ కాళ్ళకు పసుపు రాసి, నుదుట కుంకుమదిద్ది, కంఠసీమయందు గంధం రాస్తు న్నారు.

చెవులకున్న మకరకుండలాలు కదలాడుతుండగా, నుదుటి విభూతి రేకలు నర్తించుచుండగా నలుగురు విప్రులు స్వచ్ఛమైన స్వరములతో పూజా మంత్రములను ఉచ్చరిస్తూ వున్నారు. గదికి ఈశాన్యదిశయందు గోడపై కుంకుమ-చందనమిశ్రిత ద్రవ్యములతో శ్రీకారము వ్రాయబడివుంది. ఆ

మూలయందే నవధాన్యములను అడుగునబోసి, నీటితో నిండియున్న మృద్భాండములను అమర్చారు. వానిపై పసుపువస్త్రమునుకప్పి అక్షితలను వానిపై జల్లారు.

వానిముందు సువర్ణరజితకుందులలో, ప్రమ్మిదలలో దీపజ్యోతులు వెలుగుతున్నవి. ఒక పీఠముపై మంగళకలశము అమర్చబడినది. దానికి సమీపమున చందనద్రవ్యములతో శుద్ధిపరుపబడిన సానపై చిత్రమైన రంగులతో వున్న రవికమడుపు, దానిపై ఖర్జూరపండ్లు, పోకలు, తమలపాకులు, మామిడాకులు మున్నగువానితో అలంకరింపబడి, వాని మధ్య పసుపు ముద్దతో, గౌరీదేవిని ఎండుకొబ్బరి కుడుకలో ప్రతిష్ఠించడం జరిగింది.

చంద్రకళ సుచిత్ర పాదములకు పసుపురాసి, నుదుట కుంకుమదిద్ది, కంఠసీమయందు గంధముంచినది. సుచిత్ర తన సౌభాగ్యమునకు ఉప్పొంగిపోయినది. కాని అట్టి కులీన కుటుంబీకుల పూజామందిరంలో ప్రవేశించి, ఆ ముగ్ధబాలికచే కాళ్ళకు పసుపురాపించుకున్నందుకు మిక్కిలి చింతించింది. చంద్రకళ తన కాళ్ళకు పసుపురాస్తున్న సమయంలో తాను స్పృహతప్పి పడిపోతానేమోనని అనుకుంది. కాని నిగ్రహించుకున్నది.

సుచిత్ర పెండ్లికుమారుడు సుధాకర్ ముఖంవైపు ఒకసారి చూచింది. అతడు అచ్చంగా మనోహర్ వలె వున్నాడు. ఇద్దరినీ ఒకచోట వుంచి చూసినట్లయితే అన్నదమ్ములనుకుంటారు.

వరునికి తల్లిదండ్రులు నూతన వస్త్రములను ధరింపజేశారు. వరుని తల్లిదండ్రులు చెరియొకవైపున కూర్చుని వరునిచేత గౌరీపూజ చేయిస్తున్నారు. పౌరోహితుడు ముచ్చురిచేత ముందుగా విఘ్నేశ్వరపూజ చేయించాడు. పుణ్యాహవచనముజేసి విప్రులు ఆశీర్వదించారు.

ఘటికా ప్రతిష్ఠాపనజేసి గృహదేవతలను, త్రింశత్కోటి దేవతలను పూజింపజేశారు. గౌరీ కంకణ దేవతను పూజింపజేసి, అందరికీ కంకణ ధారణ జేయించాడు. తరువాత గౌరీభాష్య దేవతను వరునిచేత పూజింపజేసి భాష్యధారణ చేయించారు.

తరువాత లక్ష్మీనారాయణులను పూజింపజేసి మహాగౌరీ, మహాలక్ష్మి, మహాసరస్వతులను పూజింపజేయించారు. వైదికాచారసంపన్నులైన బ్రాహ్మ

జోత్తములు చెప్పిన వస్తువులన్నీ అదివరకే సిద్ధంచేసి వుంచారు. అడిగినదే తడవుగా అన్నీ తెచ్చియిస్తున్నారు. ఈ పూజావిధానమంతా గంటసేపు సాగింది. రాత్రి తొమ్మిదిగంటలు కావస్తున్నది.

సుచిత్ర చంద్రకళ ప్రక్కన కూర్చుని అంతా జూస్తూవున్నది. చంద్రకళ కూడా కొన్నిపనులు ఆచరిస్తూవున్నది.

గౌరీపూజలో సుధాకర్‌కు చందన-కుంకుమలు, మున్నగు పూజా ద్రవ్యములను అందిస్తూవుంది.

సుచిత్ర చంద్రకళ ప్రక్కన కూర్చునివుండి, పూజావిధానమంతా చూస్తూవున్నది.

పూజావేదికకు కొంచెం దూరంలో సుచిత్ర కూర్చొనివుంది. సుధాకర్ పూజాసమయంలో తన చెల్లెలిప్రక్కన కూర్చున్న యువతి మనోహర్ మేనగోడలని గ్రహించాడు. ఆమె మనోహరమైన రూపవైభవానికి అచ్చెరువంది, నేను వరించబోయే వధువుకూడ అటువంటి అందచందాలుగలిగి వుండాలని గౌరీదేవిని ప్రార్థించాడు.

సుచిత్ర తనకు ఒకవేళ మనోహర్‌తో వివాహం జరిగితే యీ విధంగానే మనోహర్ కూడ గౌరీమహాదేవి పూజ చేస్తాడని భావించింది. ఆ సమయంలో తాను చూడలేనుగదా! సుధాకర్‌లో మనోహర్‌ను జూచుకొని ఆనందిస్తూవుంది. పూజాసమయంలో సుధాకర్‌చేసే ప్రతి పూజాప్రక్రియను జాగ్రత్తగా తిలకిస్తూ వుంది.

ఆ పూజా విధానమంతా మనోహర్ చేస్తున్నట్లుగానే భావించింది. పూజా వేదికపైనున్న మహాగౌరీదేవిని తనను కటాక్షింపమనీ, తన కోరికను నెరవేర్చమనీ సుచిత్ర ప్రార్థించింది.

తరువాత వరునిచేత వసంతంతో నింపిన 'గరిడి ముంతకు' పూజ చేయించారు. ఆ పాత్రకు కంకణముగట్టి దానిని పసుపు-కుంకుమలతో అలంకరించారు. ఆ పాత్రలో వసంతమును నింపి, కుంకుమ-చందనాది సుగంధ ద్రవ్యములను, ఆమ్రపత్రములు దానిలో వుంచారు. ఆ పాత్రను వివాహ వేదికకు తీసికొనివెళ్ళవలసి వుంది.

పూజా విధానము పూర్తిఅయిన తరువాత బ్రాహ్మణోత్తములు మంగళాష్టకములు పఠించారు. తరువాత స్త్రీలను మంగళహారతినిబాడి, వరునకు శ్రీతిలకమునుదిద్ది, ముత్తయిదవలు మంగళహారతులతో ఆశీర్వదింపమని బ్రాహ్మణోత్తములు అనుశాసించారు.

ముత్తయిదవలతోపాటు పెండ్లికుమారుని తోబుట్టువు మంగళహారతిని పాడవలసివుంది. ముత్తయిదులందరు చంద్రకళను మంగళహారతిని పాడమని తొందరజేశారు.

చంద్రకళ ప్రక్కనవున్న సుచిత్ర చేతిని గిల్లి సైగజేసింది. రెండవసారి గట్టిగాగిల్లి దీనంగా జూచింది.

సుచిత్ర వెంటనే చంద్రకళ ప్రక్కకుజేరి మంగళహారతి పాడటం మొదలుపెట్టింది. హంసపదధ్వని—ఆదితాళంతో శాస్త్రిగారిదగ్గర తాను నేర్చుకున్న త్యాగరాజకృతిని గానం చేసింది.

శ్రీరఘు కులమందు యిట్టి
సీతను జెయినకొనిన రామచంద్ర ! ॥శ్రీరఘు॥
ఆరామమందు మునులకోరిక
లీడేర సేయ బూనుకున్న రామ ! ॥శ్రీరఘు॥
వరరత్న పీఠమందు మజ్జనము
పుడమి సురులచేత గైకొన్న రామ ॥శ్రీరఘు॥
పరమ భక్తులను బాలనము సేయు
సాకేతవాస త్యాగరాజనుత ! ॥శ్రీరఘు॥

మనోహరమైన ఆమె గానమాధుర్యమును అచ్చటి ముత్తయిదవలు, బ్రాహ్మణోత్తములు మంత్రముగ్ధులై విన్నారు. ఈమె ఎవరని అచ్చటి ముత్తయిదవలు ప్రశ్నించారు. వెంటనే చంద్రకళ నా స్నేహితురాలని చెప్పింది.

సుచిత్ర "ఈమె ఎవరని" అక్కడివారు ప్రశ్నించేటప్పుడు మొదట తలపంచుకుంది. చంద్రకళ జవాబునకు ఎవరికి ఏమీ అనుమానం కలుగకుండా తల ఎత్తి చిరునవ్వు నవ్వింది.

ముత్తయిదువులందరు వరునకు నుదుట కుంకుమనుదిద్ది, మంగళాక్షతలు జల్లి ఆశీర్వదించారు. సుచిత్ర చేతికికూడ కుంకుమభరిణను యిచ్చి, వరునికి కుంకుమ దిద్దమన్నారు. సుచిత్ర ముందు సందేహించింది. తరువాత తన దోషం యిందులో ఏమీలేదని, తన వేణుగోపాలుని స్మరించి, సుధాకర్‌కు కుంకుమదిద్ది, మంగళాక్షతలు జల్లి, పూజావేదికమీద ధూపదీపములను కళ్ళకద్దుకుంది. సుధాకర్ తన చెల్లెలుజేసిన మంగళాశీర్వచనములకంటె మిక్కిలి సంతోషించాడు. తరువాత వరుడు వేదవిప్రులకు, తల్లిదండ్రులకు, అక్కడవున్న పెద్దలకు నమస్కరించి, వారి ఆశీర్వచనములను శిరోధారణ జేశాడు. సుచిత్ర చంద్రకళ గదిలోనికిబోయి కూర్చుంది.

తరువాత పెండ్లివారందరు పంక్తులుగా కూర్చుని భోజనాలుజేశారు. చంద్రకళ సుచిత్రను కూడ తీసికొని వచ్చింది. తాను వారి పంక్తిలో కూర్చుంటే అపచారమేమోనని బాధజెందింది. ఎవరన్నా తెలిసినవారుచూస్తే యింకో ప్రమాదమని భావించింది.

అయితే- చంద్రకళ బలవంతంమీద సుచిత్ర పంక్తిభోజనం చేసింది. మనోహర్‌గూడ భోజనం చేశాడు. వరవేషంలోవున్న సుధాకర్‌ను మనోహర్ కరచాలనం చేశాడు. చిరునవ్వు నవ్వాడు.

"నీవుకూడ త్వరలో ఈ వేషం ధరిస్తావులే" అని హాస్యమాడాడు సుధాకర్ మనోహర్‌తో.

కాజీపేటనుండి రాత్రి పదకొండు గంటలకు జనగాంకు బయలుదేరాలని వారి కార్యక్రమం. రేపు ఉదయం తొమ్మిది గంటలకు వివాహం. తెల్లవారేసరికి పెళ్ళివారు జనగాంలో వుండాలి.

కాని పెళ్ళివారు అన్నీ సర్దుకొని బయలుదేరేసరికి ఒంటగంట దాటింది. కాజీపేటనుండి జనగాంకు వెళ్ళుటకు రెండుమూడు బస్సులు ఏర్పాటు చేయబడినవి.

మంగళధ్వనులతో వరుడు గరిడిముంతతో కుడికాలు బయటపెట్టి, అలంకరించిన చిన్నకారులో బయలుదేరాడు.

మరొక కారులో చంద్రకళ సుచిత్రను తన దగ్గర కూర్చోబెట్టు కుంది. ఆ కారులో మనోహర్ డ్రైవర్ ప్రక్కన కూర్చున్నాడు. ఇంకా ఒకరిద్దరు ముత్తయిదువులు కూడ ఆ కారులో కూర్చున్నారు.

మనోహర్ తమతో తెచ్చిన రెండు చిన్న ట్రంకుపెట్టెలను, వధూ వరులకోసమని తెచ్చిన పూలదండల సంచీని తన దగ్గరే భద్రపరచు కున్నాడు.

"మంగళతూర్యముల మధ్య పెండ్లి వారు జనగాంకు బయలుదేరారు. సప్తమి చంద్రుడు మింటిపైకెక్కుతూ తన ప్రసన్నకాంతులను వెదజల్లు తున్నాడు.

## 7

తెలతెలవారుతున్నది. అరుణరేకలు ఒక్కటొకటిగా వికసిస్తున్నవి. పెళ్ళివారు జనగాం చేరుకున్నారు. పెండ్లివారికి జనగాంలో చక్కని విడిది ఏర్పాటుజేశారు. మనోహర్ తాము తీసికొని వచ్చిన రెండు చిన్న ట్రంకు పెట్టెలను భద్రపరచి, తాను వధూవరుల కోసం తీసికొనివచ్చిన చందనపు పూరేకల సంచీని చేతధరించాడు. చంద్రకళను సుచిత్రను విడువకుండా తన దగ్గరే వుంచుకుంది.

తరువాత వధువు తరపువారు మేళతాళములతో పసుపుకుంకుమ, చందన తాంబూలాదులతో, మంగళ దీపములు అలంకరించిన పళ్ళెములతో వరుడు వున్న విడిదికి వచ్చి స్వాగత సత్కారములిచ్చారు.

అనంతరము పెండ్లికుమారుని తండ్రి మున్నగువారు కొంతమంది సుగంధద్రవ్యములు, పట్టుబట్టలు, ఖర్జూరపండ్లు మున్నగువానితో, వధువు గృహమునకు బోయి, నిశ్చితార్థముగా తాంబూలములిచ్చి తిరిగివచ్చారు.

పెండ్లికి ముందు జరుగు ఆచారములన్నియు జరిగిపోయినవి. విడి దిలో అందరూ ఫలహారములు జేసిరి.

ఇంతలో ముహూర్తమునకు సమయమైనదనీ, అతిధులు విడిది గృహమునుండి బయలుదేరవలసినదని ఎవరో వచ్చి తెలియజేయడం జరిగింది.

వధువు తరపు వారందరూ మంగళ తూర్యములతో విడిదివారింటికి రావడం జరిగింది. వారూ—వీరూ అందరూ కలిసి మంగళధ్వనులు మ్రోగుచుండగా వీధులలో వూరేగింపుగా వివాహవేదికకు బయలుదేరిరి. అలంకరించిన టాపులేని కారులో వరుని కూర్చొనజేసిరి. స్త్రీలు, పురుషులు వెనుకా ముందు నడుచుచుండగా వధువు గృహమునకు- వివాహవేదికను జేరుకొనిరి.

వివాహవేదిక నిర్మించిన కన్యాదాత గృహము విశాలమైన భవనము, గృహావరణంలో ఒక చలువపందిరి నిర్మించారు. మామిడి తోరణములతోను అరటియాకులు, కొబ్బరి మండలతోను అలంకరింపబడినది. ఎత్తయిన వివాహవేదికకు ఎదురుగా అందరికి కుర్చీలు, సోఫాలు ఏర్పాటు చేయబడినవి.

మనోహర్ ఒక కుర్చీలో కూర్చొని కార్యక్రమమంతా పరిశీలిస్తూ వున్నాడు. తనకు గూడ యిదే విధముగా మంగళ మహోదయము జరుగుతుంది. కాని ఒకవైపున సిగ్గు, భయము, ఆనందము దోబూచులాడుతూ వున్నవి.

ముందుగా వధువు తండ్రి వరుని వివాహవేదిక పైకి తీసికొనివచ్చి మధుపర్క ద్రవ్యములతో పూజించి, నూతన వస్త్రములతో సత్కరించుట జరిగింది.

నూతన వస్త్రములను వివాహవేదికపైనే ధరింపవలెనట, సుధాకర్‌కు పంచె కట్టుకొనుట అంతగా తెలియదు. వరుడు మేనమామ సహాయముతో పంచెను ధరించాడు. పెండ్లికుమారునికి పంచె కట్టుకొనుట రాదని వధువు తరపువారు ఎవరో హాస్యమాడిరి. సుధాకర్ నవ్వి కొద్దిగా సిగ్గుబడ్డాడు.

ఆ మాటలు విని మనోహర్‌కు కూడా నవ్వు వచ్చింది. మనోహర్ సుధాకర్‌ను తననుగా భావించుకొంటూ వున్నాడు. అతనికి జరుగు పన

ర్యాలు తనకు జరుగుచున్నట్లుగా, అతడు చేయు పనులన్నియూ తాను జేయుచున్నట్లుగా భ్రాంతి జెందుచుండెను.

అదే సమయమున గృహాంతర్భాగమున గౌరీపూజ వధువుచేత జేయింపబడుచుండెను. పూజా మందిరమున చిన్న వేదిక ఏర్పాటుచేయబడి, అలంకరింపబడింది.

సుచిత్ర చంద్రకళతో గౌరీపూజ వేదిక దగ్గర కూర్చుండెను. సుచిత్ర కొలది దినములలో మనోహర్ తల్లిదండ్రులు అంగీకరించినట్లయితే [తన అదృష్టము వలన] తనకు గూడ శుభకరమైన, మంగళకరమయిన విధి విధానమంతయు జరుగును కదా అని కలలు గనుచుండెను. ఇదియంతయు తన కొరకు జరుగుచున్నట్లు భ్రాంతి జెందుచుండెను.

వధువు పేరు పద్మజ. గౌరీపూజ జేయించుటకు ముత్తయిదువలందరూ కలిసి వధువును గౌరీపూజా వేదిక దగ్గరకు తీసికొనిరాబడినది. జ్యోత్స్న శుచిసీ కల్పద్రుమా దుకూలములు ధరించినది.

పద్మజ అచ్చముగా సుచిత్రవలె వున్నది. చంద్రకళ సుచిత్రతో "వధువు అచ్చముగా నీవలె వున్నది వదినా!" అని పలికినది. సుచిత్ర సిగ్గుపడినది.

విప్రవరుల వేదమంత్రములతో గౌరీపూజ ప్రారంభమయినది. కుంకుమ చందనములతోను, పండ్లు పూవులతోను, వధువు గౌరీదేవిని అర్చించింది. ముత్తయిదువల మంగళ హారతులతో పూజ సమాప్తమైనది.

ముహూర్త సమయము ఆసన్నమైనదనీ, వధువును తీసికొని రావలసినదని బ్రాహ్మణోత్తములు హెచ్చరించిరి. వివాహవేదికపైకి ముత్తయిదువలు వధువును దీసికొని వచ్చిరి. మహా సంకల్పమును బఠించి, బ్రాహ్మణోత్తములు వధువు తండ్రిచేత వరునకు కన్యాదానము జేయింప బడెను. వరుడైన సుధాకర్ వధువైన పద్మజ పాణిని స్వీకరించెను.

విప్రులు వివాహ మంత్రములు జదువుచుండగా వధువు తల్లి సువర్ణ కలశముతో నీరు పోయుచుండగా, వధువు తండ్రి కన్యాదాత తన చేతిలోని జలధారలు వరుని చేతిలో బడునట్లు చేయుచుండెను. క్రింద ఒక పళ్ళెము అమర్చబడియుండెను. ఈ విధముగా కన్యాదాన ప్రక్రియ జరుగుచుండెను.

మనోహర్ ఆ సమయములో సుచిత్ర మృదుహస్తము త
ున్నట్లు, పైనుండి సువర్ణ కలశమునుండి జలధారలు తన హస్త
బడుచున్నట్లుగను భావించుచుండెను.

వివాహవేదికపై పద్మజ తలపైకెత్తి చూడక సిగ్గుబడు
మనోహర్ భావించుచుండెను. వేదికకు సమీపమున చంద్రక
కూర్చున్న సుచిత్ర అట్లే భావించుచుండెను.

సరిగా ముహూర్తసమయమునకు విప్రులు చూర్ణికను
బెల్లము, జీలకర్ర రెండింటిని కలిపిన మిశ్రిత ద్రవ్యమును ఒకరి శి
నొకరిచేత బెట్టించిరి.

ఆ సమయంలో సుధాకర్ అంతగా సిగ్గుబడలేదు. కాని
తలఎత్తి సుధాకర్ శిరస్సుపై గుడ-జీలకర్రతోనున్న హస్తము ను
సిగ్గుబడెను. అంతట అచ్చటనున్న ముత్తయిదువలు గుడ-జీలక
నున్న ఆమె హస్తమును ఎత్తి సుధాకర్ శిరస్సుపై నుంచునట్లు జేసి

తరువాత మాంగల్యదేవతా పూజ, గౌరీపూజ జరుపబడెను.
పౌరోహితుడు ఒక రజితపళ్ళెరములో అక్షింతలతో నున్న మాంగల
పెండ్లికి వచ్చిన పెద్దలందరూ హస్తములతో ఆశీర్వదించునట్లు పెద్ద
దగ్గరకు తీసికొనివచ్చెను వచ్చిన పెద్దలందరూ మాంగల్యమును
దించిరి. అందరికి మంగళాక్షితలు పౌరోహితులు ఇచ్చిరి.

మంగళవాద్యములు భోరున మ్రోగుచుండగా, విప్రులందరును
శాష్టకములు జదువుచుండగా, సుధాకర్ పద్మజ కంఠసీమయందు మా
దేవతను ధరింపజేసెను.

తరువాత వధూవరులు తలంబ్రాలు బోసికొనిరి. సన్నెకంట
ఒకరి పాదమును మరియొకరు ద్రొక్కునట్లు అచట గల ముత్తయిదు
సహాయపడిరి. తరువాత ఏదో హితుడు వేదమంత్రములతో వధూవర
బ్రహ్మముడులు వేసి దీవించెను.

అక్షతారోపణ జరిగిన తరువాత సుధాకర్ తాను తెచ్చిన చందన పూలమాలను వధూవరులకు వేయించమని పౌరోహితున కిచ్చెను. ఆ దండలను పౌరోహితుడు వధూవరులకిచ్చి, ఒకరికొకరు వేసికొనుడని ప్రబోధించెను. సుధాకర్ ఎటువంటి తడబాటు లేకుండా పద్మజ కంఠమందు ఆ మాలను ధరింపజేసెను. పద్మజ కొంచెం సిగ్గుతో తలఎత్తి సుధాకర్ మెడలో వేసెను. ఆ సమయంలో వారిద్దరు రాధికా కృష్ణులవలె భువన మోహనమైన అంద చందాలు వెల్లివిరిసింది.

మనోహర్ కి సుచిత్రకు కూడా తామే చందన పూమాలలను ధరించినట్లుగా, సీతారాములవలె నున్నట్లుగా భ్రాంతిజెందిరి.

వధువు చీరెకొంగుకు, వరుని పై పంచె కొంగుకు సుగంధద్రవ్యములతో ముడులు వేసినపుడు మనోహర్, సుచిత్రలు తమకే యీ బ్రహ్మముడులు వేసినటుల భ్రాంతిపడిరి. తమ గృహస్థజీవితము శుభకరమగునని భావింపసాగిరి. సుచిత్ర తన చీరకొంగును జూచుకొని సిగ్గుపడెను. అల్లే మనోహర్ గూడ తన భుజము సర్దుకొని పైపంచె లేకపోవుటను గమనించి సిగ్గుపడెను.

వివాహానంతరము వధూవరులు బ్రహ్మముడులతో సప్తపదులు వేయుచు వివాహవేదిక చుట్టూ ప్రదక్షిణ మాచరించిరి. ఆ దృశ్యము సుందరము, మనోహరముగా నుండెను. మనోహర్, సుచిత్రలు గూడ తాము సప్తపదులు వేయుచున్నట్లు భ్రాంతిజెందిరి. వచ్చిన బంధుమిత్రులు కెమెరాలు వున్నవారు ఫోటోలను చిత్రీకరించిరి.

అనంతరము పురోహితుడు వధూవరులచేత అరుంధతీ, సప్తఋషుల దర్శనము, ధ్రువ నక్షత్రమును దర్శింపజేసి తమతో వున్న 'గరిటిముంత' లోని వసంతముతో అర్ఘ్యమును సమర్పించి నమస్కరింపజేసిరి. పగలు వివాహమగుటచే ఆ నక్షత్రములు కనిపింపలేదు. అయినను ఆ నక్షత్రములు ఎల్లప్పుడును ఉత్తరదిశగా నుండును. గావున ఆ దిక్కునకు వధూవరులు నమస్కరించునట్లు ఆజ్ఞాపించెను. పౌరోహితుడు జెప్పినట్లు వధూవరులు ఆచరించిరి. అంతటితో వివాహ కార్యక్రమము సమాప్తము జెందెను.

తరువాత వధూవరులు బ్రహ్మముడులతో బ్రాహ్మణోత్తములకు, తల్లిదండ్రులకు, పెండ్లికి వచ్చిన పెద్దలకు నమస్కరించిరి. పెద్దలందరును ఆశీర్వదించారు.

మరల వధూవరులను పౌరోహితుడు పూజామందిరములోనికి గొని పోయి బ్రహ్మగంధి, భాష్యములను విప్పి, విధి విధానముగా కార్యక్రమును పూర్తిజేసెను. పెండ్లికి వచ్చిన బంధుమిత్రులు కానుకలను వధూవరులకు చదివించారు. మంగళహారతి ముత్తయిదువులచేత యివ్వబడినది.

ఈ విధముగా సుధాకర్, పద్మజలకు వివాహం జరిగింది. తమకు జరిగినట్లుగా మనోహర్, సుచిత్రలు భావించారు.

అనంతరము పూజా మందిరంనుండి పౌరోహితుడు ఇతర ముత్తయిదవలు బయటికి వచ్చిరి. చంద్రకళ కూడా ముందుగా వచ్చి, గది తలుపులు గొళ్ళెంవేసి, వధూవరులను భర్త భార్య పేరు, భార్య భర్తపేర్లను జెప్ప మనీ, అలా చెప్పినపుడే తాను తలుపు గొళ్ళెం తీస్తానని చెప్పింది. వివాహ సమయమందు భార్యాభర్తలను, తమ భార్య పేరు, భర్త పేరు చెప్పమనుట ఆచారము. కొంతమంది ముత్తయిదువలు లోపలనే యుండిరి. సుచిత్ర కూడ లోపలనే యుండెను.

చంద్రకళ బయటనుండి వధూవరులను పేర్లను చెప్పమనెను. వరుడు కొంతసేపటికి వధువు పేరును 'పద్మజ' అని చెప్పెను. వధువు వరుని పేరు చెప్పుటకు సిగ్గుబడుచుండెను. ఎంతకును జెప్పలేదు. చివరకు నెమ్మదిగా మొలక నవ్వు తొంగిచూచుచుండగా 'సుధాకర్' అని చెప్పింది.

చంద్రకళ తలుపు తీసింది. సుచిత్ర దగ్గర తాను 'మనోహర్' అని చెప్పవలసి వుంటుందని భావించింది.

సుచిత్ర వివాహమందు జరిగిన ఆ మధుర ఘట్టము తనకు జరిగినట్లుగా భావించింది. సిగ్గుతో, పులకలతో ఆమె మొగము మరింత ఎర్రబారింది.

అనంతరము సుధాకర్ బయటికి వచ్చి, మిత్రులందరిని కలిసికొని, కరచాలనము జేసెను. వారు కూడ సుధాకర్‌ను అభినందించిరి. సుధాకర్, మనోహర్‌లు కౌగలించుకొనిరి.

అనంతరము పెండ్లి పందిరిలో విందు ఘనముగా జరిగినది. ఆ ందులో సుధాకర్ ప్రక్కన మనోహర్ కూర్చుండెను. చంద్రకళ ప్రక్కన ుచిత్ర కూర్చుని యుండెను. వచ్చిన అతిథులకు సుధాకర్, మనోహర్ లో వరుడు ఎవరా అని సందేహము గలిగెను. ఆ విధముగనే చంద్రకళ ుక్కన కూర్చున్న సుచిత్రనే పెండ్లికుమార్తెగా అతిథులు భావించు ుండిరి.



భోజనాలు చేసిన తరువాత సుచిత్రకు ఏమి చేయవలెనో స్ఫురింప దు. చంద్రకళతో గదిలో కూర్చుని మనోహర్ రాకకు ఎదురుచూస్తూ ున్నది.

మనోహర్ తన ప్రయాణము సంగతి సుధాకర్‌కు తెలియజేసెను. ుధాకర్ మనోహర్‌తో ఆరోజు ఆగి వెళ్ళవలసినదిగా పలికాడు. కాని తను తన ప్రయాణ నిశ్చయాన్ని తెలియజేశాడు.

సుధాకర్ తన చెల్లెలు చంద్రకళతోను, తన తల్లితోను, సుచిత్రకు గిన గౌరవము చేయవలసిందిగా పలికాడు.

చంద్రకళ సుచిత్రకు కుంకుమదిద్ది, చందనమద్ది కాళ్ళకు పారాణి ట్టింది. చంద్రకళ నవ్వుతూ "రేపు నీ పెళ్ళికి వస్తానో రానో! పెళ్ళికూతురు లంకారములన్నీ ఇప్పుడే చేస్తాను. కోపగింపకు." అని పలికి బుగ్గను ుటుక దిద్దంది.

సుచిత్ర చంద్రకళ ముగ్ధమోహనమైన ఆసౌజన్యమునకు మారాడక ంగీకరించెను. చంద్రకళ సుచిత్రను అలంకరించి అద్దము జూపింది. అప్పుడే ండ్లయిన పద్మజకు, తనకు భేదము లేనట్లుగా గుర్తించింది. తన సౌభా గ్యమునకు మురిసిపోయింది.

తరువాత సుధాకర్ తల్లి, ఒక పట్టుచీరెను, ఒక పట్టు రవికెనుదెచ్చి సుచిత్ర ఒడి నింపింది. ఒక కొబ్బరి బోండమును, కొన్ని ఖర్జూరపండ్లను ఆమె ఒడిలో పెట్టి "త్వరలో సౌభాగ్యవతివి కావమ్మా!" అని ఆశీర్వదించింది.

సుచిత్ర ఆమెకు వంగి పాదాలకు నమస్కరించింది.

సుచిత్ర చంద్రకను కౌగలించుకున్నది. విడిపడుతున్నందుకు కళవళ పడుతున్నది. చంద్రకళకు సుచిత్రతో పరిచయమై ఒక్కరోజు కూడాకాలేదు. కాని వారికి అనంత కాలంనుండి స్నేహం వున్నట్లుగా, ప్రస్తుతం విడిపో తున్నట్లుగా చంద్రకళ బాధపడింది.

చంద్రకళ సుచిత్రతో "మీ పెళ్ళికి తప్పకుండా వస్తాను వదినా!" అని చిరునవ్వు నవ్వింది.

సుచిత్ర నవ్వుతూ "నీ పెళ్ళికి గూడ" అని అన్నది.

చంద్రకళ వెంటనే "నేను ఇప్పుడు పెళ్ళి చేసుకోను. డాక్టర్ కోర్సు పూర్తిచేశాక పెళ్ళి చేసుకుంటాను" అని ఆగి మళ్ళీ "నేను జీవితాంతం పెళ్ళి చేసుకోలేనేమో! ప్రజాసేవ చేయాలని నా మనస్సులోని కోరిక!" అని పలికింది.

చంద్రకళ మనస్సులోని కోరికకు ఆశ్చర్యపోతూ-అభినందిస్తూ సుచిత్ర నిన్నటి రోజున చంద్రకళ తన మెడలో వేసిన బంగారు గొలు సును దీసి ఆమె మెడలో అలంకరించింది.

చంద్రకళ వెంటనే సుచిత్రతో "హారాన్ని ఇస్తే యిచ్చావు కాని, కమ్మలు మాత్రం యివ్వకు. నా కమ్మలు నీ దగ్గర, నీ రింగులు నా దగ్గర జ్ఞాపకచిహ్నాంగా వుంటాయి" అని పలికింది.

ఆమె మొదట అంగీకరింపలేదు, తరువాత బలవంతంమీద చంద్ర కళ మాటకు ఒప్పుకుంది.

చంద్రకళ, సుచిత్రలు, మనోహర్, సుధాకర్‌లు విడుపలేక విడువ లేక విడిపోయారు. బస్సుస్టాండు వరకు వెళ్ళుటకు కారు ఏర్పాటు చేయ బడింది. మనోహర్ రెండు పెట్టెలను కారులో పెట్టబడినవి. సుచిత్ర ఒడి,

నింపిన వస్తువులను సంచీలో పెట్టుకుని చేతితో పట్టుకున్నది. మనోహర్, సుచిత్రలు వచ్చి కారులో కూర్చున్నారు. వాళ్ళిద్దరూ చంద్రకళా, సుధాకర్‌ల దగ్గర సెలవు దీసికున్నారు. బస్సుస్టాండుకు కారు బయలుదేరింది.

# 9

అప్పుడు సమయం రెండు గంటలు దాటింది. మనోహర్ మొదట విజయవాడ రైలుమీద వెళదామనుకున్నాడు.

కాని అది సాయంత్రం ఐదు గంటలకు వుంది. బస్సుమీద వెళ్ళినట్లయితే త్వరగా చేరుకోవచ్చుననే ఉద్దేశంతో బస్సుమీద వెళ్ళవలెనని నిశ్చయించుకొని, కారు బస్సు డిపోకు పోనిమ్మని డ్రైవరుకు చెప్పాడు.

కారు బస్సు డిపోకు చేరుకోగానే సుచిత్రా, మనోహర్‌లు తమ ట్రంకు పెట్టెలను చెరియొక చేతితో పట్టుకొని, బస్‌డిపోలో ప్రవేశించారు. సంచీని మనోహర్ రెండవ చేతితో పట్టుకున్నాడు.

కారు బస్ డిపో చేరుకునేవరకు ఎదురుగా జనగాంనుండి సూర్యాపేటకు వెళ్ళే బస్సు సిద్ధంగా వుంది.

జనగాంనుండి విజయవాడకు వెళ్ళే మార్గాలు యితరమైనవి వున్నా, సూర్యాపేట నుండి వెళ్ళవచ్చుననీ, బస్‌డిపోలో ఎవరయినా తెలిసినవారు వచ్చినట్లయితే ప్రమాదమని భావించి, మనోహర్ వెంటనే సుచిత్ర సూర్యాపేట బస్ ఎక్కమని జెప్పి, తానుగూడ ఎక్కి కూర్చున్నాడు.

అదృష్టవశాత్తు యిద్దరు ప్రక్కనే కూర్చునే ఒక బెర్తు ఖాళీగా ఉంది. దానిలో ఇద్దరూ ప్రక్క-ప్రక్కనే కూర్చున్నారు.

సుచిత్రకు తాము యే బస్సు ఎక్కిందీ తెలియదు. మనోహర్‌ను అనుసరిస్తూ వున్నది. అందరి దృష్టి తమపైని పడుతుందనే ఉద్దేశంతో- చంద్రకళ తన బుగ్గన బెట్టిన కాటుకచుక్కను చెరిపివేసింది. "మంగళ సూత్రములేదు" అనే సంగతి ఎవరికీ తెలియకుండా వుండేందుకు వెనుక

వున్న పైటని ముందుకులాగి కంఠసీమను, శరీరము కనబడకుండా కప్పు కుంది.

తరువాత మనోహర్ సూర్యాపేటకు రెండు టికెట్లు తీసికొన్నాడు. సుచిత్ర తాము వెళుతున్నది సూర్యాపేటకు అని గ్రహించింది. బస్సు బయల్దేరింది.

సుచిత్ర, మనోహర్‌తో బస్సులో ప్రయాణిస్తూ "మనము వెళు తున్నది ఎక్కడికి?" అని బెదురుగా ప్రశ్నించింది.

మనోహర్ దృఢంగా "సూర్యాపేటకు" అని పలిగాడు.

ఆమె ఆతురతగా "సూర్యాపేటకు ఎందుకు?" అని ప్రశ్నించింది.

మనోహర్ అదే స్వరంతో "అక్కడనుండి విజయవాడ వెళదాం" అని పలికాడు.

ఆమె మౌనం వహించింది.

బస్సు వేగంగా పోతున్నది. బస్సు కిటికీలోనుండి చూస్తే చెట్లు-చేమలు ముందునుండి వెనుకకు పరుగెత్తుతున్నట్లు కనబడుతున్నవి. మనోహర్ మనస్సులోగూడ అనేకమైన ఆలోచనలు కదలాడుతున్నవి.

ఇంటికి వెళ్ళగానే యీ విషయాన్ని ఏ విధంగా తెలియజేయాలి? ఏ విధంగా ప్రారంభించాలి? ముందుగా తల్లికి తెలియజేస్తే? శైలజ వియోగంతో అసలే బాధపడుతున్నది. ఇంకా బాధపడుతుందేమో!

లేదు! ముందు తన తండ్రికే తెలియజేయాలి! తన తండ్రి ఉదారవంతుడు! సంస్కారవంతుడు! తాను చేసిన పనికి సంతోషిస్తాడా? బాధను పొందుతాడా? ఏమో! సుచిత్ర తన తల్లిదండ్రుల దగ్గర ఏ విధంగా ప్రవర్తిస్తుంది? వాళ్ళు అడిగే ప్రశ్నలకు ఏమని సమాధానం చెబుతుందో?

సుచిత్రను ఎవరైనా మిత్రుని ఇంటిలోవుంచి తండ్రికి తెలియజేస్తే? సుచిత్ర తనను ఒక పిరికివానిగా భావిస్తుంది. ఇప్పటికే నామీద విశ్వాసం లేకుండా ఒకవిధంగావుంది. ఈ విధంగా మనోహర్ మనస్సు అనేకమైన ఆలోచనలను జేయసాగింది.

సుచిత్రకూడ యిట్టి ఆలోచనలలోనే మునిగితేలుతోంది. 'మనోహర్ తన తండ్రితో ఏ విధంగా తనను పరిచయం చేస్తాడు? తల్లితో ఏమని చెబుతాడు? వారు కుమారుని మాటలకు ఎంతవరకు అంగీకరిస్తారు? తనను వారు వెళ్ళిపోమ్మంటే ఎక్కడికి వెళ్ళిపోవాలి?' ఇటువంటి ఆలోచనలతో సుచిత్ర కలవరపడుతోంది.

మనోహర్‌కు సమయం తొందరగా గడిచిపోతూ వున్నది. బాగా ఆలోచించేటందుకు కొంత సమయంవుంటే బాగుండును అని అనిపించింది. ఇప్పటివరకు అతదేమీ ఆలోచించుకోలేదు. పెళ్ళిసందడిలో ఇవేమీ అతనికి తోచలేదు.

ఒకరోజు విజయవాడలో ఎవరైనా స్నేహితుని ఇంటిలో వుండి వెళితే? లేకపోతే మార్గమధ్యంలోనే ఒకరోజు ఆగిపోతే? ఇటువంటి ఆలోచనలతో మనోహర్ మనస్సు కల్లోలసాగరంవలె కలవరపడుతున్నది.

బస్సు సూర్యాపేట బస్సుడిపోలో ఆగింది. సూర్యాపేట విజయవాడ హైదరాబాదుకు మధ్యలోవుంది. తామిప్పుడు బస్సుదిగి విజయవాడ బస్సులో ప్రయాణింపవలసి వుంది.

మనోహర్, సుచిత్రలు బస్సు దిగారు.

చెరొక పెట్టెను చేతితో పట్టుకొని విజయవాడ బస్సులు నిలిచేచోటుకి వెళుతున్నారు.

ఇంతలో మనోహర్‌కు పరిచయమైన ముఖము ఒకటి కనిపించింది. అతడు దూరపుబంధువు. అతనికి సుచిత్రను తన భార్య అని చెబితే-పెళ్ళెప్పుడు జరిగిందని ప్రశ్నిస్తాడు. అతనికెన్నో అబద్ధాలు జంకకుండా జవాబు చెప్పాలి. అతనిముందు సుచిత్ర ఎలా ప్రవర్తిస్తుందో!

మనోహర్ ఆ దూరబంధువును జూచి అక్కడే ఆగిపోయాడు. మనోహర్‌తో సుచిత్రకూడా ఆగిపోయింది. వారు నిలుచున్నచోటనే నాగార్జున సాగర్ (వయా) మిర్యాలగూడ అని బోర్డువ్రాసివున్న ఎక్స్‌ప్రెస్ బస్సు సిద్ధంగావుంది బయలుదేరడానికి. డ్రైవరుకూడ సీటులో కూర్చుని హారన్ మ్రోగించాడు.

ఆగిపోయిన మనోహర్ వెంటనే ఆ బస్సులో ఎక్కాడు. సుచిత్ర కూడ అతడిని అనుసరించింది. బస్సునిండా జనం వున్నందువలన అది వరకు కూర్చున్నట్లు ఒకే బెర్తు వారికి దొరకలేదు. స్త్రీలు కూర్చున్న స్థలములో ఒక సీటు ఖాళీగావుంది. సుచిత్ర అచ్చట కూర్చుంది. మనోహర్‌కి సీటు దొరకలేదు.

సుచిత్ర తన చేతితో పట్టుకున్న చిన్న ట్రంకుపెట్టెను తన దగ్గర భద్రపరుచుకుంది. మనోహర్ తన ట్రంకు పెట్టెను భద్రపరుచుకుని, సంచీని సుచిత్ర చేతికిచ్చాడు. తాను కూర్చునేందుకు సీట్లు లేనందువలన నిలుచున్నాడు.

తనకు, సుచిత్రకు నాగార్జునసాగర్‌కు రెండు టిక్కెట్లు తీసుకున్నాడు. బస్సు బయలుదేరింది. మనోహర్‌కు గుండెదడ తగ్గింది. సుచిత్రకు అంతా అయోమయంగా వుంది.

సూర్యాపేట నుండి బస్సు మిర్యాలగూడ జేరుకునేసరికి సాయంత్రం ఆరుగంటలు కావస్తున్నది. అచ్చటినుండి విజయవాడకు నాలుగుగంటల ప్రయాణం మిర్యాలగూడలో దిగి విజయవాడకు వెళ్ళుటకు మనోహర్ ఆలోచించాడు. రాత్రి పదిగంటలు దాటుతుంది. ఆ రాత్రివేళయందు సుచిత్రను తల్లిదండ్రులకు పరిచయముజేయుట అంత మంచిదికాదని భావించాడు.

నాగార్జునసాగర్‌కు టిక్కెట్లు తీసికొని మధ్యలో మిర్యాలగూడలో దిగిపోవుటకు అనేక అబద్ధాలు కండక్టరుకు చెప్పవలసివస్తుంది. కావున నాగార్జునసాగర్‌కు వెళ్ళడానికి నిశ్చయించాడు. ఈ విషయమంతా సుచిత్రకు మనోహర్ వివరింపలేదు.

బస్సు నాగార్జునసాగర్‌కు చేరుకుంది. సుచిత్ర, మనోహర్‌లు బస్సు దిగారు. అచ్చటినుండి ఏదైనా హోటల్‌కి వెళ్ళి, ఆ రాత్రికి అచ్చట బస చేయుట అంత మంచిదికాదని మనోహర్ భావించాడు. పదిగంటలు దాటింది. విజయవాడకు వెళ్ళే బస్సు రాత్రి 2 గంటలకు వుందనీ, విజయవాడకు ఎనిమిదిగంటలకు జేరుతుందనీ బస్ కంట్రోలర్ రూములో తెలుసు

కున్నాడు. రెండు మూడు గంటలు వెయిటింగ్ రూములలో గడిపి రెండు మూడు గంటలకు విజయవాడపోయే బస్సులో ప్రయాణింపవచ్చుననీ సుచిత్రకు తెలిపాడు. ఆమె మౌనం వహించింది.

బస్‌డిపోలో వున్న వెయిటింగ్ రూమ్‌లలో వుండాలంటే స్వల్ప మైన మూల్యం చెల్లింపవలసి వుంటుంది. చిరునామా మొదలయినవి చెప్ప వలసి వుంటుంది.

అదే విధంగా మనోహర్ తన విజయవాడ చిరునామాను జెప్పి తాము భార్యా భర్తలమనీ, జనగాంలో జరిగే వివాహానికి వెళ్ళామనీ తిరిగి వస్తూ, నాగార్జున కొండపైనున్న శిల్పాలని చూద్దామని అనుకున్నామనీ, అదీ కుదరక విజయవాడకు వెళుతున్నామనీ తెలిపారు. రెండు గంటల బస్సులో తాము విజయవాడకు వెళతామనీ అప్పటివరకు ఇచ్చట బస్సు డిపోలో వెయిటింగ్ రూములో వుంటామనీ మనోహర్ వ్రాసియిచ్చాడు.

వెయిటింగ్‌రూమ్ అధికారి అంగీకరించి, రుసుము దీసుకొని టిక్కెట్లు యిచ్చాడు. సుచిత్రా మనోహర్‌లు విశ్రాంతి మందిరంలో చెరొక పడకకుర్చీలో కూర్చుని తమ ట్రంకుపెట్టెలను, సంచీని భద్రపరచుకున్నారు.

తాము విజయవాడకు నేరుగా వెళ్ళకుండా సూర్యాపేటకు, మళ్ళీ నాగార్జునసాగరుకు ఎందుకు వచ్చిందీ సుచిత్రకు తెలియలేదు. తానెందుకు ఇచ్చటికి వచ్చిందీ మనోహర్‌కు తెలియలేదు.

కొంతమంది లోకంలో ఇటువంటి పరిస్థితిలో ఎన్నో అబద్ధాలు ఆడ డానికి జంకరు. తమ పరువు పోగొట్టుకొని ఇతరుల పరువులు పోగొడ తారు. అయినా వారు వెనుకంజ వేయరు.

మనోహర్ ఈ యాత్రలన్నీ ఎందుకు చేశాడని భావిస్తే సాధ్యమై నంతవరకు తాను అబద్ధాలు ఆడకూడదనీ, తాను చేస్తున్నది ఒక సాహస మైన పని అనీ, కొన్ని కష్టాలు నష్టాలు జరిగినా తాను చేస్తున్న పని సవ్యంగా జరిగిపోవాలని అతని ఆలోచన.

అందువలననే జనగాం నుండి మార్యాపేటకు, సూర్యాపేట నుండి మిర్యాలగూడ ద్వారా సాగర్‌కు రావడం జరిగింది. మధ్యదారిలో పరిచయ స్తులు, దూరబంధువులు తారసిల్లకుండా వుండడానికే ఈ ప్రయాణాలు.

ఇచ్చట తనకెవరూ తారసిల్లరనీ ఇంకొక ఎనిమిది గంటలలో తాను, సుచిత్ర విజయవాడకు తమ యింటికి చేరుకుంటామనీ మనోహర్ భావన.

సుచిత్ర మనోహర్‌ను పూర్తిగా నమ్మింది. అతనివలన తనకెటువంటి అపకారం జరుగదనీ, అతడు చేసే ప్రయాణాలకు, పనులకు పెళ్ళిలో వరుని వెంట వధువు సప్తపదులు వేసిన రీతిగా అనుసరించింది.

వెయిటింగ్ రూములో వారిరువురూ సంభాషిస్తూ-ఇంక ఈ విధంగా అబద్ధాల నాటకం ఆడకూడదనీ, మనోహర్ తల్లిదండ్రులకు నిజం చెబుదామనీ, వారు అంగీకరిస్తే సరి. లేకపోతే తనదారి తాను చూసుకుంటాననీ స్పష్టంగా సుచిత్ర పలికింది.

మనోహర్ కూడ దానికి అంగీకరించాడు.

వారు కొంతసేపు విశ్రాంతి తీసుకున్నారు. కాని నిద్ర పట్టలేదు. దీపావళి పండుగలో చిచ్చుబుడ్లవలె తీవ్రమైన హృదయ తరంగాలు విరజిమ్మి జిమ్ముతూనే వున్నాయి.

* * * *

నాగార్జున బస్సు డిపోనుండి విజయవాడకు వెళ్ళే రూట్‌లో బస్సు ఆగింది. వెంటనే వారిద్దరూ తమ సామాను సర్దుకొని, వెయిటింగ్ రూమ్ అధికారికి తెలిపి విజయవాడకు వెళ్ళే బస్సులో ఎక్కారు. ఇద్దరు కూర్చునే ఒకే బెర్తు వారికి దొరికింది. విజయవాడకు రెండు టిక్కెట్లు మనోహర్ తీసుకున్నాడు. బస్సు కదిలింది.

నాగార్జునసాగర్ నుండి గుంటూరుకు, గుంటూరు నుండి విజయవాడ చేరుకునేవరకు తొమ్మిదిగంటలయింది. మనోహర్ సుచిత్ర బస్సు దిగి చెరొక పెట్టెను చేతితో పట్టుకున్నారు. సుధాకర్ తల్లి యిచ్చిన మంగళద్రవ్యాలు వున్న సంచీని సుచిత్రే పట్టుకొంది. బస్సు డిపో బయటకి వచ్చి అప్పటికి నాలుగు కిలోమీటర్ల దూరంలో మాచవరంలో వున్న మనోహర్ ఇంటికి రిక్షాలో జేరుకున్నారు.

# 10

రిక్షావానికి డబ్బులు యిచ్చి, రెండు పెట్టెలను మనోహర్ పుచ్చు కొని ఇంట్లోకి ప్రవేశించాడు. సుచిత్ర సంచీని పట్టుకొని మనోహర్ వెంట నడిచింది. చూసేవారికి వారిద్దరూ ఆలుమగలవలె కనిపిస్తున్నారు.

మనోహర్ గృహము రెండంతస్థుల ఒక విశాలమైన భవనం. ఆ భవనానికి వెనుకా-ముందూ ఖాళీస్థలం వుంది. ఇంటి వెనుక కొబ్బరిచెట్లు మున్నగువానితో ఖాళీస్థలం వుంది.

మనోహర్ ఇంట్లో జీతానికివున్న కుర్రాడు రాము వచ్చి మనోహర్ చేతిలో వున్న పెట్టెలను అందుకున్నాడు. సుచిత్ర చేతిలో వున్న సంచీని కూడ తాను తీసికొని, రాముకు ఇచ్చి సంచీని కూడ తన గదిలో భద్ర పరచమని పలికాడు.

రాము-"అట్లాగే!" అని చెప్పి సుచిత్రవైపు ఒకసారి చూసి మేడ పైకి వెళ్ళడానికి సిద్ధమయ్యాడు.

రామూను ఆపి-"నాన్నగారు ఎక్కడ వున్నారు?" అని ప్రశ్నిం చాడు మనోహర్.

రాము వినయంతో-"బాబుగారు బయటికి వెళ్ళారండి! ఎక్కడికి వెళ్ళారో నాకు తెలియదండి" అని మనోహర్ అడగకుండానే సమాధానం పలికాడు.

రాము పైకి వెళ్ళిన తరువాత మనోహర్ సుచిత్రతో-"నాన్నగారు వచ్చేటంతవరకు నా గదిలో కూర్చుందువుగాని పద" అని పలికాడు.

సుచిత్ర మాట్లాడకుండా మనోహర్‌ను వెంబడించింది.

మనోహర్ మేడమెట్లు ఎక్కాడు. సుచిత్ర మనోహర్‌ని వెంబ డించింది.

మనోహర్ తన గదిలోకి ప్రవేశించి, సుచిత్రతో-"చిత్రా! నీవు ఇచ్చట ఈ కుర్చీలో కూర్చో! నేను ఇప్పుడే స్నానం చేసి వస్తాను. ఇంతలో నాన్నగారు వస్తారు" అని పలికాడు.

సుచిత్ర ఒక బల్లమీద కూర్చొని గది అంతా చూస్తూ ఉన్నది.

మనోహర్ గది తలుపు దగ్గరగావేసి వెళ్ళిపోయాడు. తలుపు దగ్గరగా మనోహర్ ఎందుకు వేశాడో సుచిత్రకు అర్థంకాలేదు. గదిలో రెండు మూడు బీరువాల పుస్తకాలు వున్నవి. గది గోడనిండా అనేకమైన చిత్ర పటములు కనిపిస్తున్నవి. గోడమీద మూడు నాలుగేండ్ల వయస్సుగల ఒక బాలిక చిత్రపటము వున్నది. ఆ చిత్రపటము క్రింద 'శైలజ' అని వ్రాసి యున్నది.

చేతితో వ్రాసిన అనేక చిత్రపటములు గోడమీద వున్నవి. ఆ పటములను మనోహర్ వ్రాసినవని సుచిత్ర అర్థం చేసుకున్నది. ప్రయాణ బడలిచే ఆమెకు కనులు మూతలు బడుతున్నవి. కనులు మూసికొని ముందు ఉన్న మేజాబల్లమీద తలను వాల్చింది. అయినా ఆమె హృదయంలో అనేక భావనాతరంగాలు వెల్లి విరుస్తున్నవి.

శైలజగా ఇంక నటించకుండా యదార్థగాధను విప్పి చెబుతామని మనసులో నిశ్చయించుకున్నది. మనోహర్ తల్లిదండ్రులు తన వివాహము నకు అంగీకరించకపోయినట్లయితే, వరంగల్లు వెళ్ళిపోవాలనీ సాధ్యమైనంత వరకు తన శీలాన్ని రక్షించుకోవాలనీ నిశ్చయించుకుంది. శాస్త్రిగారిని గాని, లేదా వకీలు గోపాలరావుగారినిగాని శరణు వేడుదామని మనసునందు భావించింది.

ఈ విషయాన్ని మనోహర్ స్నానం చేసి గదిలోకి వచ్చినప్పుడు అతనిని హెచ్చరించింది. మనోహర్ కూడ అదే నిశ్చయంతో తల్లిదండ్రు లను దర్శించాడు.

మనోహర్ వెంటనే తల్లి దగ్గరకు వెళ్ళి పాదాభివందనం చేశాడు. మనోహర్ తల్లి పేరు భవాని. యాభైదియేండ్ల పైబడి వయసు వుంటుంది. ఆమె కుమారుని ఆశీర్వదించి శిరస్సును స్పృశించింది.

"స్నానంచేసి త్వరగా రా! ఫలహారం చేద్దువుగాని" అని ప్రేమతో పలికింది.

తల్లితో మనోహర్ తన విషయం చెబుతామనుకున్నాడు. కాని అత నికి ధైర్యం చాలలేదు. ఆ విషయాన్ని తల్లితో ఏ విధంగా ప్రారంభిం చాలో మనోహర్‌కు స్ఫురింపలేదు. అతడు తన తల్లికి ఆ విషయం చెప్ప కుండానే స్నానానికి వెళ్ళిపోయాడు.

మనోహర్ తండ్రిపేరు అయోధ్యరామానాయనిగారు. తహసీల్ దారుగా ఉద్యోగముచేసి, మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు. ప్రస్తుతం ఉద్యోగ విరమణముజేసి విశ్రాంతి తీసుకుంటున్నారు. అప్పు డప్పుడు ప్రజాహితకార్యములలో పాల్గొంటూ వుంటారు.

వీరిది పూర్వము మధిర ప్రాంతము. అక్కడే వారి స్థిరాస్థులు వున్నవి. పంద ఎకరాల సేద్యభూమి వున్నది. ఒక విశాలమైన భవనము, ఒక నిమ్మతోట వున్నది.

అయితే ఉద్యోగ సమయంలో అయోధ్యరామయ్యగారికి విజయ వాడలో ఎంతోమంది పెద్దలు పరిచయమై స్నేహితులయ్యారు. విజయవాడ మాచవరంలో ఒక భవనాన్ని నిర్మించుకుని అక్కడే భార్యాపిల్లలతో నివ సించడం ప్రారంభించారు. మనోహర్ విజయవాడలోనే చదువుకున్నాడు. అయోధ్యరామయ్యగారు అప్పుడప్పుడు మధిరకు వెళ్ళి ఆస్తిపాస్తులను జూచుకొని తిరిగివస్తూ వుంటారు.

ఆరోజు ఉదయం అయోధ్యరామయ్యగారు ఒక స్నేహితుని ఇంటికి వెళ్ళారు. తిరిగివచ్చేవరకు పదిగంటలయింది. నాయనిగారు యింటి లోపలికి రాగానే నౌకరు రాము "చిన్నబాబుగారు వచ్చారంటీ!" అని పలికాడు.

నాయనిగారు "మనోహర్ ఎక్కడ వున్నాడు? యేడీ?" అని నౌక రును ప్రశ్నించాడు.

నౌకరు రాము నాయనిగారితో "స్నానాల గదిలో స్నానం చేస్తు న్నారండీ!" అని పలికి- "చిన్నబాబుగారితో ఒక చిన్న అమ్మగారు కూడ వచ్చారండీ! మేడమీద చిన్నబాబుగారి గదిలో వున్నారండి" అంటూ పలి కాడు.

అయోధ్యరామయ్యగారు కుమారుడు వచ్చినందుకు సంతోషించాడు. కాని మేడపైన వున్న చిన్న అమ్మగారు ఎవరా? అని విస్తుబోయి గబగబా మేడమెట్లు ఎక్కి, మనోహర్ గది దగ్గరకు వెళ్ళాడు. ఓరగావున్న తలుపు తెరిచి, సుచిత్రను చూచాడు. కుర్చీలో కూర్చొని పేపరు చదువుతూ వున్నది.

తన కుమారునితోబాటు చదువుకుంటున్న విద్యార్థినిగా ఆమెను భావించాడు. నాయనిగారు క్రిందికి దిగివచ్చి తన లైబ్రరీ హాలులో కూర్చున్నాడు.

ఈ లైబ్రరీ హాలుకు ఒక చరిత్ర వున్నది. ఈ హాలు మధ్యహాలుకు ప్రక్కగా వుంది. దాదాపు మధ్యహాలంతా విశాలంగా వుంటుంది. ఆ గదిలో యేడెనిమిది పెద్ద పెద్ద బీరువాలు వున్నవి. ఆ బీరువాలనిండా పురాతనమైన గ్రంథాలు వున్నవి. అంతేగాక అముద్రితమైన కొన్ని తాటాకు గ్రంథాలు కూడ వున్నవి.

నాయనిగారి పూర్వులు సంస్కారవంతులు, సాహితీపరులు. వారు తమ జీవితకాలంలో సంపాదించి సమకూర్చినవే యీ గ్రంథములు. మన నాయనిగారు కూడ కొన్ని ఆధునిక గ్రంథాలు సమకూర్చారు. కాని అవి నామమాత్రము.

గ్రంథాలయ గది గోడలనిండా అనేకమంది దేశభక్తుల చిత్రపటాలు వున్నవి. ఒకవైపు మహాత్మాగాంధీ, నెహ్రూ, సరోజినీదేవి మున్నగు దేశభక్తుల చిత్రపటాలు, ఒకవైపున రవీంద్రనాథటాగూర్, అరవిందఘోష్, గురజాడ మున్నగు మహారచయితల చిత్రపటాలు, మరొకవైపు ఆంధ్ర జాతిని తీర్చిదిద్దిన శ్రీ కందుకూరి, గిడుగు, కొమర్రాజు, రఘుపతివెంకటరత్నం నాయుడు మున్నగువారి చిత్రపటాలు అమర్చివున్నవి. నాల్గవ వైపున మనోహర్ వ్రాసిన చిత్రపటాలు వున్నవి.

మధ్య విశాలమైన బల్ల. దానిచుట్టూ కుర్చీలు వున్నవి. నాయనిగారు తన స్నేహితులతో ఆ గదిలో కూర్చునే సంభాషిస్తూ వుంటారు.

మనోహర్‌కు తన తండ్రి వచ్చిన సంగతి తెలిసింది. పైకి వెళ్ళి ...న తండ్రి సుచిత్రను చూచినట్లు కూడ తెలిసింది. దుస్తులు వేసుకొని, సుచి త్రను తన వెంట క్రిందికి రావలసినదిగా కోరాడు.

సుచిత్ర కొద్దిసేపటిలో ఒక పర్వతము తనమీద పడనున్నదనీ ...నిక్రింద తాను ముక్కలు ముక్కలుగా పగిలిపోనున్నట్లుగా భావింప ...గింది. నిర్జీవ ప్రతిమలా మనోహర్ వైపు చూచింది.

"సుచిత్రా! నీకేమీ భయంలేదు. నాన్నగారు నా కోరికను మన్ని ...రు. ఇంత అధైర్యంగా వుంటే కథ ఎలా నడుస్తుంది? ఇదివరకు నటిం ...చిందంతా ఒక ఎత్తు! ఇప్పుడు నటించబోయేది ఒక ఎత్తు! ఇది చివరి ...ంకము" అని మనోహర్ పలికాడు.

సుచిత్ర నిర్లిప్తతతో చిరునవ్వు నవ్వి "ఈ నాటకము సుఖాంతమో? ...షాదాంతమో?" అని పలికింది.

మనోహర్ సుకుమారమైన ఆమె చిటికెన వ్రేలును తన దృఢమైన ...క్షిణ హస్తముతో బట్టుకుని "సుఖాంతమే!" అని పలికి గదినుండి బయ ...కి రాసాగాడు.

సుచిత్ర ఒక విధమైన భయముతో, సిగ్గుతో, సున్నితమైన పద ...న్యాసముతో మనోహర్‌ను అనుసరించింది. ఇరువురు మేడమెట్లు దిగారు. ...ండ్రి గది గగ్గరకు వచ్చి ఇరువురూ ఆగిపోయారు.

సుచిత్రను గుమ్మం దగ్గర వుండమని సైగజేసి, మనోహర్ గబగబా ...పెలోనికి వెళ్ళి తండ్రిగారికి పాదాభివదనంజేసి "నమస్కారంనాన్నగారు" ...ని పలికి ఆగిపోయాడు.

నాయనిగారు కుమారుని పితృభక్తికి సంతోషించి "ఏరా మనోహర్ ...ప్పుడు వచ్చావు? పరీక్షలయిందాకా విజయవాడ రానని ఉత్తరం వ్రాశా ...గా?" అని ప్రశ్నించాడు.

మనోహర్ తలవంచి "అవును నాన్నా! ఉత్తరం వ్రాశాను. కాని ...వలసి వచ్చింది" అని పలికి మళ్ళీ ఆగిపోయాడు.

తన విషయం తెలపడం-ఎలా ప్రారంభించాలో మనోహర్‌కు తెలియలేదు. మూడురోజులలుండి చేసిన మననం, ఆలోచనలు పటాపంచ లయినవి. గాలికి ఎగిరిన పేలాలకువలె ఎటుబోయినవో తెలియలేదు.

సుచిత్ర తనను వదిలి మనోహర్ ఒక్కడే తండ్రి దగ్గరకుబోయి పాదాభివదనం చేయడంచూచి శిల్పి చెక్కిన శిల్పంవలె నిశ్చేష్టురాలయింది. అదివరకు మనోహర్ ఇద్దరం వెళ్ళి తండ్రిగారికి నమస్కారం చేద్దామనీ, తండ్రిగారు యిరువురినీ ఆశీర్వదిస్తారనీ, నేను తరువాత విషయమంతా వివరిస్తారనీ, తన తండ్రి అంగీకరిస్తారనీ పలికాడు. ఏదీ నాటకం అంతా మారిపోయింది.

పోర్షన్‌రాని నటుడు తెరలోనికి పారిపోతే-రంగంమీద వున్న నటి యేవిధంగా ప్రక్కకు తొలుగుతుందో అదే విధంగా సుచిత్ర గుమ్మం దగ్గర నుండి ఒక స్తంభం చాటుకువెళ్ళి నిలుచుంది.

నాయనిగారు గుమ్మం దగ్గర వున్న అమ్మాయిని గమనించాడు. కుమారుని ప్రవర్తన, మాటలుగూడా నాయనిగారికి కొంచెం అనుమానా స్పదంగా స్ఫురించినవి.

వెంటనే నాయనిగారు కుమారునితో "మనోహర్! నీతోగూడ వచ్చి, గుమ్మం దగ్గరవున్న అమ్మాయి ఎవరు? నీతో కూడ చదువుకుంటున్న సహాధ్యాయినియా?" అని ప్రశ్నించాడు.

మనోహర్ ఒక్కసారిగా నిరుత్తరుడై, మళ్ళీ ధైర్యము తెచ్చుకుని "సుచిత్రా ఇలారా! లోపలికిరా! వీరు మా నాన్నగారు. నమస్కారం చెయ్యి" అని పలికాడు.

స్తంభంచాటున వున్న సుచిత్రకు యీ మాటలు వినబడినా-ఆమె పాదాలు ముందుకు సాగలేదు. నిర్జీవ ప్రతిమలా అలాగే నిల్చుని వుంది.

మనోహర్ వెంటనే ఆమె దగ్గరకు వెళ్ళి లలిత సుకుమారమైన యామె మోహనహస్తాన్ని గ్రహించి లోపలికి రమ్మని నెమ్మదిగా పలికాడు. సుచిత్ర మనోహర్‌ను అనుసరించి, పెళ్ళిలో వధువు వరునితో కలసి సప్తపదులు వేస్తున్నట్లుగా నెమ్మదిగా గదిలోనికి ప్రవేశించి నాయనిగారికి పాదాభివందనం ఆచరించింది.

నాయనిగారు ఆమె సుకుమార ముగ్ధమోహనత్వానికి, శ్రద్ధాభక్తులకు సంతసించి "నీ మనస్సులో కోరిక నెరవేరాలని ఆశీర్వదిస్తున్నాను తల్లీ!" అని ఆశీర్వదించాడు.

వెంటనే నాయనిగారు మనోహర్‌తో "ఎవరు రా యీ అమ్మాయి?" అని ప్రశ్నించాడు.

మనోహర్ తండ్రితో "ఒక అనాథ!" అని ఆగిపోయాడు.

నాయనిగారు వెంటనే కుమారుని తలా-తోకాలేని మాటలకు కోపించి "అనాథ యేమిట్రా నీ ముఖం? సలక్షణంగా వుంటే" అని పలికాడు.

తండ్రి కోపంతో పలికిన మాటలతో కొంచెం ఉద్రిక్తుడై వున్నవిషయాన్ని తండ్రితో నిర్భయంగా చెప్పాలనే నిశ్చయానికొచ్చాడు. "అవును నాన్నా! ఈమె ఒక అనాథ! ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చాను. మీ ఆశీర్వాదంకోసం తీసుకువచ్చాను నాన్నా" అని ధైర్యంగా పలికాడు.

నాయనిగారు కుమారుని మాటలకు కొంచెం ఆశ్చర్యంబొంది— "ఏమిటీ? ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చావా? మాట యిచ్చావుగా! ఇంక పెళ్ళి చేసుకో. మా ఆశీర్వాదంతో యింక నీకు పనేమిటి? ఇంతకూ ఈ అమ్మాయి ఎవరు?" అని ప్రశ్నించాడు.

మనోహర్ సందేహిస్తూ "నాన్నా! ఈ అమ్మాయి...." అని ఆగిపోయాడు.

నాయనిగారు కోపంతో "ఒరేయ్ మనోహర్! నీకు బుద్ధి పూర్తిగా నశించింది. ఈ అమ్మాయి తల్లి, దండ్రి, కులం-గోత్రం, ఊరు-పేరు చెప్పకుండా ఆశీర్వదింపమనడం విచిత్రంగా వుంది" అని పలికి సుచిత్రను జూచి "ఎవరమ్మాయివి నువ్వు? నీ తల్లిదండ్రుల పేరేమిటి?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర నాయనిగారి ప్రశ్నకు నిలువునా నీరయిపోయింది. ఆమె అభిమానం రసాతలంలోనికి క్రుంగిపోయింది.

సుచిత్ర పెదవులు కదిపి మాట్లాడాలని విశ్వప్రయత్నం చేస్తున్నది. కాని అందులో కృతకృత్యకాలేకపోయింది.

మనోహర్ వెంటనే "నాన్నా! ఈమెకు తండ్రి లేడు. తల్లి పడుపు వృత్తితో జీవించే ఒక వేశ్య!" అని ధైర్యంగా పలికాడు.

నాయనిగారు వెంటనే "తండ్రి లేడూ? తల్లి ఒక వేశ్యా! మనోహర్! మరి నీవు యిటువంటి అమ్మాయినేనా నీవు వివాహమాడేది?" అని తీవ్రంగా జూచి ప్రశ్నించాడు.

మనోహర్ తండ్రివైపు జూస్తూ ఈ అమ్మాయి ఆ వృత్తిలోనికి దిగ లేదు నాన్నా! యీ అమ్మాయికి ఆ వృత్తి యిష్టంలేదు" అని పలికాడు.

నాయనిగారు మనోహర్‌వైపు తీవ్రంగా జూచి "యిష్టం లేదని నీకెలా తెలుసు? ఈ అమ్మాయితో నీకెన్నాళ్ళనుండి పరిచయం?" అని ప్రశ్నించాడు.

మనోహర్ మందస్వరంతో "ఇదివరకెప్పుడూ పరిచయంలేదు. నాలుగు రోజుల క్రిందట పరిచయమయింది" అని పలికాడు.

నాయనిగారు బొమలు చిట్లించి "నాలుగు రోజుల పరిచయానికే విశ్వసించావన్నమాట" అని పలికాడు.

మనోహర్ కొంచెం ఆవేశంతో "అవును నాన్నా! ఈ అమ్మాయి గృహిణిగా జీవితం గడపాలనుకుంటున్నది. ఇంట్లో బాధ భరింపలేక, అర్థ రాత్రి సమయాన పారిపోయి వచ్చి నా గదిలో ప్రవేశించింది. ఈమెను రౌడీలనుండి కాపాడాను. పెళ్ళిచేసుకుంటానని మాట యిచ్చాను" అని పలి కాడు.

నాయనిగారు మనోహర్‌వైపు పైనుండి క్రిందివరకు జూచి "గొప్ప సంస్కర్తవు బయలుదేరావు" అని పలికాడు.

మనోహర్ వెంటనే అందుకుని "అదేమీ కాదు నాన్నా! ఈమె దీన స్థితిని జూచిన తరువాత నా హృదయం ద్రవించింది. అంతే!" అని పలికి ఆగిపోయాడు.

నాయనిగారు కోపంతో గొప్ప దయార్ద్రహృదయుడవు బయలు దేరావు. సరేగాని నేనడిగే ప్రశ్నలకు సరియైన జవాబులు యివ్వు" అని పలికాడు.

మనోహర్ తండ్రివైపు జూచి "ఏమిటి నాన్నా మీ ప్రశ్నలు? అడగండి" అని పలికాడు.

మన కుటుంబానికి సమాజంలో ఎటువంటి స్థానం వుంది?"

"సంఘంలో పేరుప్రతిష్టలున్న కుటుంబం మనది."

"నేను ఏ ఉద్యోగధర్మం నిర్వహించాను?"

"తహసీల్దారు ఉద్యోగం నాన్నా!"

"నీవు ఒక వేశ్యాకుమారిని పెళ్ళి చేసుకుంటే, మన కుటుంబానికి ఎటువంటి ప్రతిష్ఠ వస్తుందో తెలుసా?"

"ప్రతిష్ఠ కాదు నాన్నా! అప్రతిష్ఠ వస్తుంది."

"మన కులం మనలను ఏం జేస్తుంది?"

"వెలివేస్తుంది."

"సంఘం ఏం జేస్తుంది?"

"నీచంగా జూస్తుంది."

"మన కుటుంబసభ్యులు సంఘంలో తలఎత్తుకుని తిరుగగలరా?"

"తిరుగలేరు నాన్నా!"

"అన్నీ తెలిసి ఎందుకు గోతులో పడ్డావు?"

"ఒక అనాధను కాపాడడానికి."

"ఒక అనాధను కాపాడావు. బాగానే వుంది. తద్వారా మన కుటుంబం, మన భవిష్యత్తు ఏమవుతుందో ఆలోచించావా?"

తండ్రి మాటలకు మనోహర్ స్తబ్ధుడై "అయితే మీకు కనబడకుండా బహుదూరం— దూరప్రాంతానికి వెళ్ళి జీవిస్తాము నాన్నా! మీకు ఈ విధంగా బాధ కలిగించినందుకు క్షమించు నాన్నా!" అని దీనంగా పలికాడు.

"నాయనిగారు వేదనతో "నీవు దూరప్రాంతానికి వెళితే మాత్రం ఆ కళంకం మాకు పోతుందా? మనోహర్! నీవు ఒక్కడవే మాకు ఆధా

రం. నీవు వెళ్ళిపోతే మాకు ఎవరు ఆధారం? ఈ యిల్లూ-వాకిలీ-ధనమూ-సంపదా-మేమియేం చెయ్యాలి?" అని మనోహర్‌ను ప్రశ్నించాడు.

మనోహర్ క్షణం మౌనం వహించి "చెల్లాయికివ్వండి నాన్నా! చెల్లాయిని కుమారునిగా భావించుకోండి నాన్నా!" అని పలికాడు.

నాయనిగారు మళ్ళీ తీక్షణంగా కుమారునివైపు జూచి, అంటే- ఆ అమ్మాయి కోసం తల్లిదండ్రులను, ఇల్లూ-వాకిలీ అన్నీ వదిలిపెట్టి వెళ్ళిపోతావన్నమాట. కనిపెంచిన తల్లిదండ్రులకంటే నాలుగు రోజులు పరిచయమున్న ఆ అమ్మాయి ఎక్కువన్నమాట" అని పలికాడు.

మనోహర్ తండ్రితో "కాదు నాన్నా! మీరు నాకు దైవసమానులు, కాని ఆ అమ్మాయి ఒక అనాథ. పెళ్ళిచేసుకుంటానని వాగ్దానం చేశాను" అని పలికాడు.

నాయనిగారు కొంచెం కోపంతో "అమ్మాయి అనాథ కాదురా. మోసగత్తె! నీ మీద మత్తుమందు జల్లి నిన్ను వశపరచుకుంది. నేను యిప్పుడే పోలీస్‌స్టేషనుకు ఫోను చేస్తాను" అని పలికాడు.

మనోహర్ వద్దంటున్నకొద్దీ నాయనిగారు పోలీసుస్టేషనుకు ఫోన్ చేశారు.

తండ్రి యీ విధంగా ఫోన్ చేయడంతో మనోహర్ ఉద్రేకంతో "ఈ అమ్మాయి మోసగత్తె కాదు నాన్నా! మీరు చేసింది ఏమీ బాగాలేదు. ఈమె సుశీల. గృహిణిగా జీవితం గడపాలనుకుంటున్నది. నేను పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చాను" అని పలికాడు.

నాయనిగారు కుమారుని మాటలు పూర్తికాకుండానే "ఒరే! మనోహర్! నీకు పిచ్చి పట్టింది. నీవు ఇంట్లోకి వెళ్ళి విశ్రాంతి తీసుకో! ఒక వేశ్యకు జన్మించి, ఒక వేశ్య ఇంట్లో పెరిగిన ఒక స్త్రీ గృహిణిగా జీవిస్తుందంటే నేను నమ్మను" అని పలికాడు.

తండ్రి మాటలకు మనోహర్ నిలువునా క్రుంగిపోయాడు. తండ్రి తన మాటలను ఆదరిస్తాడనీ, తన కోరిక నెరవేరుతుందనీ భావించాడు. కాని తండ్రి తిరస్కారంతో వూహాసౌధంనుండి వాస్తవ లోకంలోనికి వచ్చిపడ్డాడు. సుచిత్రవైపు ఒకసారి జాలిగా జూచాడు. ఆమె తలవంచుకొని

శిలాప్రతిమలా నిలుచుని వుంది. ఆ సమయంలో మనోహర్‌కు ఏమి చేయవలెనో బోధపడలేదు.

నాయనిగారు వెంటనే సుచిత్రవైపు చూడకుండా అమ్మాయ్! నీవు పెళ్ళిచేసికొనవలెనని భావించినట్లయితే కావలసినంతమంది దొరుకుతారు. ఈ నాటకం, ఈ నటన ఇంక చాలు. ఇంక వెళ్ళు. మాకు, మా అబ్బాయికి ఇంక కనిపింపకు!" అని పలికాడు.

సుచిత్రకు నాయనిగారి మాటలు వేయి సూదులతో గ్రుచ్చినట్లయింది. మూకుడులో కాగుతున్న నూనెమీద బోసినట్లయింది. ఆమె మనసు వేదనతో కుమిలిపోతూ వున్నది. నాయనిగారి మాటలు ఆమెకు కొంచెం కోపం గూడ గలిగించినవి.

సుచిత్ర నాయనిగారివైపు తలఎత్తి "ఇంతవరకు మీరు ఎన్నో మాటలు అన్నారు. అన్నీ సహించాను. అయితే మీరన్న మాటలన్నీ నిజమే. నేను ఒక వేశ్యకు జన్మించాను. సమాజంలో నాకెటువంటి స్థానమూ లేదు. సంఘంలో నేనెప్పుడూ తలఎత్తుకుని తిరుగలేను. నా నీడ సోకిన ప్రతివారు మలినమవుతారని కూడా నాకు తెలుసు. ఈ విషయాలన్నీ మీ అబ్బాయిగారికి ముందే చెప్పాను" అని ఆగిపోయింది.

నాయనిగారు ఆశ్చర్యంతో సుచిత్రతో "ముందే చెప్పావా?" అని ప్రశ్నించాడు.

సుచిత్ర సహజధోరణిలో "అవును! ముందే చెప్పాను. మీరిప్పుడు చెప్పిన మాటలన్నీ చెప్పాను, కాని మీ అబ్బాయి నా మాటలు వింటేనా? నన్ను స్వీకరిస్తే సంఘంనుండి బహిష్కరింపబడతారనీ, మీ కుటుంబానికి ఎన్నో చిక్కులువస్తాయనీ, మీ తల్లిదండ్రులు అంగీకరించరనీ, కూడా తెలియజేశాను. అంతేగాకుండా మనకు పుట్టబోయే సంతానాన్ని గూడ సంఘం వేలెత్తి జూపుతుందనీ, వారు కూడా సమాజంలో ఎన్నో అవమానాలు పొందవలసి వుంటుందనీ చెప్పాను" అని పలికింది.

నాయనిగారు "ఆ అమ్మాయి చెబుతున్నదంతా నిజమేనా?" అని మనోహర్‌ను ప్రశ్నించాడు.

మనోహర్ 'అవును' అన్నట్లు తల వంచాడు.

నాయనిగారు కుమారునితో "దానికి నీవేమన్నావు?" అని మళ్ళీ ప్రశ్నించాడు.

అప్పటివరకు మౌనం వహించిన అతని హృదయం అగ్నిపర్వతంలా బ్రద్దలయింది. ఆవేశంతో అన్నీ సహిస్తాననీ, నా తల్లిదండ్రుల అజ్ఞ దీసికొని పెళ్ళి చేసుకుంటానని చెప్పాను. చేతిలో చేయివేసి బాస చేశాను. నాన్నా! పాణిగ్రహణం చేశాను నాన్నా! అమ్మ పట్టుచీరను ధరింపజేసి, నుదుట కుంకుమరేఖలు దిద్దాను నాన్నా! అంతేకాదు! ఆమె కళ్ళల్లో నేనూ, నా కళ్ళల్లో ఆమె, నీడలు జూచుకున్నాం నాన్నా! మీరు అంగీకరిస్తారనే యీ విధంగా జేశాను నాన్నా! ఈ అమ్మాయితో నాకు ఒకవేళ వివాహం కానట్లయితే నా జీవితం విషాదగీతం అవుతుంది నాన్నా! ఎడారి పయనమవుతుంది నాన్నా!

నాయనిగారు కుమారుడు ఆవేశంతో మాట్లాడడం జూచి కొంచెం కోపం దెచ్చుకొని "ఒరేయ్ మనోహర్! నోరుముయ్" అని గట్టిగా పలికాడు.

నాయనిగాడు కుర్చీలోనుంచి లేచి మనోహర్ దగ్గరకు వచ్చి "ఈ అమ్మాయితో వివాహం జరిగితే- మా జీవితం విషాదభరితం కాదట్రా? ఆ అమ్మాయికున్న జ్ఞానం కూడ నీకు లేకపోయింది. నీకు ప్రేమపిచ్చి పట్టింది. ముందు నీవు ఇంట్లోకి వెళ్ళు" అని పలికి వెంటనే సుచిత్రతో జాలిగా "అమ్మాయ్! తక్షణం ఇక్కడినుండి వెళ్ళిపో! ఇదిగో నా పర్సు! రెండు వేల రూపాయలు వున్నవి. ఇవి తీసుకొని నీ బంధువులున్న చోటికి వెళ్ళు" అని పలికాడు.

నాయనిగారి పలుకులు సుచిత్ర హృదయంలో శూలం గ్రుచ్చినట్లుగా బాధపడింది.

నాయనిగారితో "మీరివ్వబోయే పర్సు మీ దగ్గరే వుంచండి. నా చేతులకు బంగారు గాజులు వున్నవి. ఇవి అమ్ముకుని, ఏదోవిధంగా ఇల్లు జేరుకుంటాను. మీరు బాధపడనవసరంలేదు. నేనిప్పుడే వెళ్ళిపోతున్నాను. మీ గృహ జీవితంలో ఈ విధంగా తుఫాను రేపినందుకు క్షమించండి! నమ

స్కారం" అని పలికి- మనోహర్‌వైపు ఒకసారి జూచి, "మనోహర్! సంఘంలో కొన్ని కట్టుబాటులు వుంటాయి. అవి ఇష్టమయినా, మంచివైనా కాకపోయినా మనం అంగీకరించాలి. వానిని ఎదిరించటం చాలా కష్టం. తల్లి దండ్రులు చేసిన వివాహమే వధూవరులను సుఖవంతం జేస్తుంది. మీ తల్లి దండ్రులు కోరితెచ్చిన వధువుతో వివాహము జేసుకొని మీ జీవితాలను ధన్యం జేసికోండి" అని పలికి "మీ అమ్మగారి పట్టుచీరెను నేను కట్టుకు న్నాను. నా చీరెను లచ్చికి దానం చేశారు.

దానికి బదులుగా సుధాకర్ పెళ్ళిలో అతని తల్లి నా ఒడినింపిన పట్టుచీరెను మీ అమ్మగారికివ్వండి. ఆ చీరె సంచీలో వుంది" అని పలికింది. హాలులోనుండి బయటికి బయలుదేరింది.

మనోహర్ సుచిత్రతో "మరి నీవు ఎచ్చటికి బోతున్నట్లు?" అని ప్రశ్నించాడు.

"భద్రకాళి దారి చూపినచోటికి. నా గురించి బాధ పడకండి. నావంటి అతివలు చరిత్రహీనలు, సమాజంలో కోకొల్లలు! వారిని జేరుకుంటాను." అని పలికి సుచిత్ర బయటికి వెళ్ళుటకు ప్రయత్నించింది.

ఆ సమయంలో మనోహర్ సుచిత్ర హస్తమును గ్రహించి- "సుచిత్రా! వెళ్ళకు!" అని ఆమెని ఆపుటకు ప్రయత్నించాడు.

సుచిత్ర మనోహర్ చేతినుండి తన హస్తమును వెనుకకు దీసికొని "మనోహర్‌బాబు! నేనొక వేశ్యకు జన్మించినదానను. నన్ను వివాహము జేసికొని మీరే విధంగాను సుఖాన్ని పొందలేరు. మీవంటి కులీన కుటుంబా లలో నాకెటువంటి స్థానమూలేదు. వెళ్ళిపోనివ్వండి. అడ్డు తొలగండి" అని పలికింది.

మనోహర్ మళ్ళీ సుచిత్ర హస్తాన్ని గ్రహించి, ఆమె వెళ్ళకుండా అడ్డంగా నిలిచాడు.

నాయనిగారు మనోహర్ దగ్గరకువచ్చి రెండవ చేతిని బట్టుకొని తనవైపు లాగుతూ. "ఆ అమ్మాయి హస్తమును వదిలిపెట్టి లోపలికి రా!" అని పలికాడు.

అతను తండ్రివైపు దీనంగా జూచి, "ఈ అమ్మాయి ఎక్కడికి వెళ తుంది నాన్నా!" అని ప్రశ్నించాడు.

నాయనిగారు ఆలోచింపకుండానే "సంఘంలో ఇటువంటి పతితలు అనేకులున్నారు, వారంతా ఎచ్చట వున్నారో అచ్చటికి వెళుతుంది. ఆమె చేయి వదులు! లోపలికిరా" అని పలికారు.

సుచిత్ర చేతిని అతను గట్టిగా పట్టుకున్నాడు. ఆమె చేతిని వది లించుకొని వెళ్ళాలని ప్రయత్నిస్తున్నది.

మనోహర్ చేతిని తండ్రి గట్టిగా పట్టుకున్నాడు. తండ్రి చేతినుండి తన చేతిని వదిలించుకొనుటకు అతను ప్రయత్నిస్తున్నాడు.

ఆ విచిత్ర సన్నివేశాన్ని చూచి నౌకరు రాము విస్తుబోయాడు.

ఇంట్లో వంట జేస్తూవున్న భవానీకి తెలియజేశాడు.

వంటగదిలో వున్న భవానీకి బయట జరుగుతున్న విషయాలేమీ తెలియవు. కుమారుడు ఊరునుండి వచ్చాడని ఆమె మిక్కిలి సంతోషిం చింది. తన కుమారునికి యిష్టమైన పదార్థాలు వండడంలో నిమగ్నమైంది. దాదాపు వంట పూర్తయింది. ఇంక బయటికి రావడానికి సిద్ధపడుతూండగా నౌకరు రాము వచ్చి తండ్రీకొడుకుల మధ్య గదిలో గొడవ బడుతూ ఉన్నట్లు వివరించి పలికాడు.

భవానీకి రాము చెప్పిన మాటలు ఏమీ అర్థము కాలేదు. ఇంతకాల మయింది. తమ కుమారుడు తనకుగాని, తండ్రికిగాని ఎదురుచెప్పడం చూడ లేదు. అదేమిటో తెలుసుకుందామని వంటగది తలుపువేసి మధ్య హాలులో ప్రవేశించింది.

గ్రంథాలయము గదిముందు ఒకరి చేతిని ఒకరు పట్టుకుని లాగుతూ వలయాకారంగా వుండడం జూచి. ఆమె నివ్వెరబోయింది. ఒక స్త్రీ హస్తము తన కుమారుని చేతిలో వుండడం చూచి ఆమె హస్తమును వదిలించు కొనుటకు పెనుగులాడడము ఆమెకు విచిత్రమనిపించింది.

తన భర్త తన కుమారుని హస్తమును లాగుతూండడం జూచి భర్తతో "ఏమిటండీ! ఈ గోల? మనోహర్ చేతిని లాగుతున్నారెందుకు?"

అని ప్రశ్నించి కుమారునివైపు జూచి "మనోహర్! ఎందుకురా ఆ అమ్మాయి చేతిని బట్టుకొని లాగుతున్నావు?" అని ప్రశ్నించింది.

నాయనిగారు వెంటనే భార్యతో "చూడు! నీ కుమారరత్నం చేసిన ఘనకార్యం? ఆ అమ్మాయి ఒక వేశ్య కుమార్తెయట. ఆ అమ్మాయిని పెండ్లి చేసుకుంటానని మాట ఇచ్చాడట. మన ఆశీర్వాదంకోసం తీసకొని వచ్చాడు" అని పలికాడు.

భవాని భర్తవైపు కోపంగా జూచి "ఛీ! ఛీ! ఎవరంటారండీ ఆమె వేశ్య కూతురని. పట్టుచీర గట్టుకొని పార్వతీదేవి లాగుంటేను" అని పలికింది.

నాయనిగారు "నీ కుమారునే ప్రశ్నించు" అని ముక్తసరిగా పలికాడు.

భవానీ కుమారునితో "ఏరా మనోహర్! మీ నాన్నగారు చెబుతున్న మాట నిజమేనా?"

మనోహర్ తల్లితో "నిజమేనమ్మా!" అని అతడు ముక్తసరిగా జవాబు పలికాడు. మళ్ళీ వెంటనే "ఈమె ఇంకా వేశ్యా వృత్తిలోకి దిగలేదు. వేశ్యావృత్తి అంటే ఈమెకు ఇష్టంలేదు.

ఈమెను వేశ్యావృత్తిలో ప్రవేశపెట్టుటకు బలవంతం చేస్తుంటే ఈమెను రక్షించాను. పెళ్ళి చేసుకుంటానని ఈమెకు మాట ఇచ్చాను."

భవాని భర్తతో మెల్లగా "చూడండి! ఆ అమ్మాయిని సరిగా పరికించండి. ఈ పిల్లలో నాకు శైలజ పోలికలు కనిపిస్తున్నవి...." అని పలికింది.

"పోలికల కేముంది? లోకంలో మనిషిని బోలిన మనిషి మనకు కనిపిస్తూనే వుంటారు" అని నాయనిగారు భార్యతో నెమ్మదిగా పలికారు.

భవానీ భర్తతో "సరిగా పరిశీలించండి. నాకు శైలజగానే కనిపిస్తున్నది" అని పలికింది.

నాయనిగారు భార్యతో "అవును! నాకుగూడ అట్లాగే అనిపిస్తున్నది" అని నెమ్మదిగా పలికాడు.

మనోహర్ సుచిత్ర చేతిని వదిలిపెట్టి "అవునమ్మా! ఈమె వేశ్య కుమార్తె. ఈమె వేశ్యమాత్రం కాదు" అని పలికాడు.

నాయనిగారు మనోహర్ చేతిని వదిలిపెట్టి, సుచిత్రను ఆశ్చర్యంగా జూచి "అమ్మాయ్! నిజం చెప్పు. నీ పేరేమిటి?" అని ప్రశ్నించారు.

సుచిత్ర క్లుప్తంగా మూడక్షరాలలో 'సుచిత్ర' అని పలికింది.

భవాని భర్తను ప్రక్కకు బిలిచి "పేరుకేముందిలెండి! మన శైలజ దొరికిన వాళ్ళు సుచిత్ర అని పేరు బెట్టుకో కూడదా? ఎందుకనో ఈ అమ్మాయిమీద ప్రేమ హృదయం నుండి పొంగిపొరలి వస్తున్నది. చిన్ననాటి శైలజనువలె అక్కున జేర్చుకొనవలెనని అనిపిస్తున్నది" అని పలికి కన్నీరు తుడుచుకుంది.

నాయనిగారు ముందుకు వచ్చి శైలజవైపు ప్రేమగా చూసి "నీకు తండ్రిలేడా అమ్మాయ్? నిన్నెవరు పెంచి పెద్దజేశారు?" అని ప్రశ్నించాడు.

భవానీ మళ్ళీ భర్తను దగ్గరకు బిలిచి "చూడండి! కుడిచెంపక్రింద పుట్టుమచ్చ శైలజకున్నట్లుగాలేదూ?" అని ప్రశ్నించింది.

నాయనిగారు అవునని పలికారు.

నాయనిగారి ప్రశ్నకు సుచిత్ర విరక్తిగా "మా అమ్మ పరిమళం నన్ను పెంచి పెద్దజేసింది. ఇన్నాళ్ళూ ఆమెని నేను 'కన్నతల్లే' అని భావించాను. ఆమె కన్నతల్లిగాదని, పెంచిన తల్లియని యీ మధ్య తెలిసింది."

భవానీ భర్తను బిలిచి, "ఒక్కొక్క విషయం వింటుంటే చూస్తూ వుంటే- ఈ అమ్మాయి శైలజే అని నాకు స్ఫురిస్తున్నది. మరి మీకో?" అని ప్రశ్నించింది.

భవానీతో భర్త నాయనిగారు "నాకు కూడా అంతే" అని పలికారు.

భవాని సుచిత్ర దగ్గరకు వెళ్ళి "ఈ పాట నీవెప్పుడయినా విన్నావా తల్లీ?" అని ప్రశ్నించింది.

సుచిత్ర "ఏ పాట?" అని ప్రశ్నించింది.

భవానీ కంఠమెత్తి-

"ఆరవిచ్చిన తమ్మి యకరు పుప్పొళ్ల
గౌర వర్ణము మేని గలదేవి గౌరి!
మముగన్న తల్లి యుష్మత్ ప్రసాదమున
సమకూరుగాత! నా సమభివాంఛితము!"

అని పాడింది.

ఈ పాటకు ఒక చరిత్ర వుంది. చిన్ననాడు నాలుగేళ్ళ వయసులో వారి యింటి పౌరోహితుడు శ్రీరామకృష్ణయ్య దంపతులుగారు వొళ్ళో కూర్చోబెట్టుకొని శైలజకు నేర్పారు.

ఈ పాటతో రోజూ గౌరీదేవిని పూజించినట్లయితే- చక్కని భర్త గలిగి, అష్టఐశ్వర్యములు గలుగతవని చెప్పేవారు. ఈ పాట నాగానందం అనే నాటకం లోనిదనీ, దానిని సుప్రసిద్ధ పండితులు, కవులు కీ.శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించారనీ, ఈ పాటతో నాగానందంలోని నాయిక తన కిష్టమైన వరుని పొందిందనీ చెప్పేవారు. శ్రీరామకృష్ణయ్య పంతులుగారు నేర్పిన యీ పాటను నాలుగేండ్ల వయసు గల ఆనాటి శైలజ నేర్చుకుంది. అస్పష్టమైన పలుకులతో తనతోబాటు పూజా సమయంలో పాడుతూ వుండేది. అందుకే భవాని యీ పాట సంగతి ప్రస్తావించింది.

సుచిత్ర సాలోచనగా ఎప్పుడో- ఎచ్చటో వినినట్లుగా వుందండీ! కాని సరిగా జ్ఞాపకం రావడంలేదు" అని భవానీతో పలికింది.

భవానీ భర్తతో ఈ అమ్మాయి నిజంగా శైలజే అయి వుంటుం దండీ! సందేహంలేదు" అని పలికింది.

నాయనిగారు ఆశాజనకంగా వెంటనే "నాకు గూడ అట్లాగే అనిపిస్తు న్నది భవానీ! నాకు జ్ఞాపకం వచ్చింది. అదేమిటంటే శైలజకు కుడిభుజం మీద కాలిన మచ్చ ఒకటి వుండాలి. చిన్నప్పుడు దీపంమీద బడితే- కాలి మచ్చ అయింది. కుడి భుజంమీద ఆ మచ్చ వున్నట్లయితే తప్పక శైలజే అయి వుంటుంది" అని పలికారు.

"భవాని "అవును! నాకు కూడా జ్ఞాపకం వుంది. కాని కుడిభుజం మీద జాకెట్ క్రింద వున్న మచ్చను చూచేదెలా?" అని పలికి ముందుకు వచ్చి "సుచిత్రా! ఇటు రా అమ్మా! నిన్ను జూస్తుంటే, మా శైలజ జ్ఞాపకా

నికి వస్తున్నది. ఏదీ నిన్ను ఒక్కసారి కౌగలించుకోనీ! అని పలికి కౌగ లించుకుంది.

సుచిత్ర మాటాడక ఆమె స్నేహపూరితమైన కౌగిలిలో ఒదిగి పోయింది. పులకరించింది. ఏనాడూ పొందని ఒక అనిర్వచనీయమైన ఆనం దము ఆమె కౌగిలిలో పొందింది.

ఆ సమయంలో భవాని సుచిత్ర ముఖము, భుజము, తన ప్రేమ పూరితమైన హస్తములతో నిమిరింది. కుడి భుజం మీద వున్న కాలిన మచ్చను గమనించింది.

భవానీ సుచిత్రను ముద్దులతో ముంచెత్తింది. గౌరీదేవి తన ప్రార్థ నను విని కరుణించిందని పొంగిపోయింది. అనిర్వచనీయమైన ఆనందంలో మునిగితేలింది.

భవాని భర్తవైపు మొగము త్రిప్పి "ఈ అమ్మాయి మన శైలజే నండీ! కుడిభుజంమీద కాలిన మచ్చ వుంది. నా ప్రార్థన ఆలకించి జగన్మాత గౌరీదేవి శైలజను నా దగ్గరకు పంపించింది" అని బిగ్గరగా బలికింది.

నాయనిగారు సంతోషంతో "నిజంగా జగన్మాత కరుణ" అని పలి కారు.

సుచిత్రకు ఇదేమీ అర్థంకాలేదు. క్షణంక్రింద ఇంట్లోనుండి వెళ్ళి పొమ్మన్నవారు ఇంత ప్రీతితో తనను ఆదరించడం సుచిత్రకు బోధపడ లేదు. కాలిన మచ్చను గురించి కూడా అర్థం చేసుకోలేకపోయింది.

మనోహర్‌కు గూడ ఏమీ అర్థంగాక అట్లాగే నిలబడి చూస్తున్నాడు.

ఇంతలో బయట చప్పుడు అయింది. ముగ్గురు, నలుగురు లోపలికి వస్తున్నట్లు వారికి స్ఫురించింది. అందరూ గుమ్మంవైపు జూడసాగారు.

## 11

రంగడు, అతని స్నేహితులు సుచిత్ర కోసం మనోహర్ గది ఆమె హనుమకొండనుండి జనగాం వెళ్ళిపోయిన తరువాత రాత్రంతా వరంగల్, హనుమకొండ, కాజీపేట అంతా గాలించారు. రైల్వేస్టేషనులు,

బస్సు డిపోలు. కాపలా కాచారు. సందులు గొందులు అన్నీ వెదికారు. కాని సుచిత్ర ఎక్కడా కనిపించలేదు.

సుచిత్ర అమాయకురాలు అయినందున పట్టణం వదిలి వెళ్ళిపోదనీ, ఎక్కడో వుండివుంటుందనీ వారికి వూహ మనోహర్ ఇల్లు మళ్ళీ ఒకసారి చూద్దామనుకున్నాడు. కాని ఆ యిల్లు వకీలు గోపాలరావుగారిది అయినందు వలన మనోహర్ తమ సంగతి వకీలుగారితో చెబుతాడేమోననీ రంగని భయం. అయినా ఆ రాత్రి సందంతా గాలించి వచ్చారు. ఎక్కడా ఆమె జాడ లేదుగదా!"

అయినా మనోహర్ చదువుకునే కుర్రాడు.. సుచిత్రను తన ఇంటి లోనికి ఎందుకు రానిస్తాడు? మరుసటి రోజు కూడా మనోహర్ తనకు చౌరాస్తాలో కనిపించాడు కదా! అటువంటిదేమైనా వుంటే తనకు కని పిస్తాడా? ఎక్కడికైనా పారిపోడా? అని సందేహించాడు. ఆ విధంగా ఆలో చించి మనోహర్ మీద ఎటువంటి అనుమానం గలుగలేదు. అంతేగాకుండా అనవసరంగా అర్ధరాత్రి అతని ఇంట్లో దూరి సుచిత్రను వెదకడం, గోల చేయడం సబబుగా అనిపించలేదు. వకీలు గోపాలరావుగారితో మనోహర్ చెబుతాడేమోనని భయపడ్డాడు. ఈ వకీలు గోపాలరావుగారే రెండుసార్లు ఇటువంటి పనులు జేసినందుకు జైలుకు పంపించాడు.

అయినా రంగడు మనోహర్ వున్న పరిసరాలను అప్పుడప్పుడూ వచ్చి చూసిపోతున్నాడు. మనోహర్ యిల్లు తాళం వేసి వుండడం గమ నించాడు.

మూడవరోజు ఉదయం రంగడు మనోహర్ వున్న ఇంటివైపుకు వచ్చాడు. నల్లని సిల్కు చీరతో, సిల్కు రవికతో ఒక స్త్రీ మనోహర్ ఇరటివాకిలి వూడవడం గమనించాడు. దూరంనుండి ఆమెను జూచి సుచిత్ర యేమోనని భ్రాంతిజెందాడు. ఎందువలననగా ఆనాడు సుచిత్ర ధరించిన దుస్తులు గూడ ఈ విధంగా వున్నవి. దగ్గరకొచ్చి చూచాడు రంగడు. పని మనిషి లచ్చి. యాబది ఏండ్ల ముదుసలి.

రంగడు పనిమనిషి లచ్చితో నీ పేరేమిటని ప్రశ్నింపగా తన పేరు 'లచ్చి' అనీ, పనిమనిషిననీ చెప్పింది.

రంగడు మనోహర్, సుచిత్రల ఆచూకీ తీయడం కోసం "మీ అయ్యగారేరీ?" అని ప్రశ్నించాడు లచ్చిని.

లచ్చి రంగటితో పూర్వే పనిని ఆపి "మా అయ్యగోరు ఊరికెళ్ళినారు బాబూ! మీకేం పని వుంది బాబూ!" అని ప్రశ్నించింది.

రంగడు లచ్చి వాలకం జూచి అమాయకురాలని గ్రహించాడు. జేబులో వున్న చుట్టను దీసి యిచ్చాడు. లచ్చి పుగాకు చుట్టతో సంతోషబడ్డది.

రంగడు లచ్చితో "మీ అయ్యగారితో పని వుందిగాని, నీకీ చీర, రవికె ఎవరిచ్చారు?" అని ప్రశ్నించాడు.

లచ్చి తన చీరెను జూచుకొని సంబరంతో అయ్యగారే యిచ్చారు. దండెమీద వుంటే తీసుకుపొమ్మన్నారు. ఆయన చుట్టాలంట బాబూ! ఈ మధ్యనే వచ్చింది. ఆమె పండంటి కొడుకును గనాలి.

అయ్యగారు "ఈ చీరె, రవికె అమ్ముకోకు. నువ్వే కట్టుకో!" అని చెప్పారు. నేనెంత పాపిష్టిదాన్ని బాబూ! కట్టుకోమని బట్టముక్క యిస్తే అమ్ముకుంటానా బాబూ! అందుకనే రోజూ కట్టుకొని వస్తున్నాను. మా అయ్యగారు యీ చీరెతో నన్ను చూసిందాకా కట్టుకుంటాను. ఇప్పితే ఒట్టు" అని అమాయకంగా చెప్పుకుపోసాగింది.

రంగడు లచ్చిని ఆపి-"లచ్చీ! ఈ రవికె, చీర నీకెప్పుడిచ్చారు?" అని యుక్తితో ప్రశ్నించాడు.

లచ్చి ఛీత్కారంతో- "నాకా లెక్కలన్నీ తెలియదు. శుక్రవారం పూట ఇచ్చారు. ఆరోజే ఇంటికెళ్ళి కట్టుకున్నాను. ఆ రోజురాత్రే అయ్యగారు వూరికెళ్ళారు.

రంగడు ఆలోచించాడు. ఇవ్వాలిటిరోజు ఆదివారం! మొన్నటిరోజు శుక్రవారం. ఆ చీర రవికె సుచిత్ర వేనని గుర్తించాడు. లచ్చిని రిక్షామీద తనతో ఇంటికి తీసికొని వెళ్ళి అక్క పరిమళానికి చూపించాడు. పరిమళం కూడ ఆ బట్టలు సుచిత్ర వేనని గుర్తించింది.

పరిమళం లచ్చిని వెళ్ళమని చెప్పి, తాను కూడ ఒక పాత చీర లచ్చికి కట్టుకోమని ఇచ్చింది. లచ్చి సంతోషంతో చీర తీసుకుని వెళ్ళి పోయింది.

తరువాత పరిమళం రంగడితో-"సుచిత్ర ఎక్కడికి వెళ్ళాలో అక్కడికి వెళ్ళింది. ఆమెను గురించి విచారణ ఎందుకు?" అని కన్నీళ్ళతో ప్రశ్నించింది.

రంగడు పరిమళంతో "ఈ రోజు శుక్రవాళ్ళను నమ్మకూడదు. ఆ మనోహర్ వలన మన సుచిత్ర ఎన్నో ఆపదలకు గురవుతుంది. ఆమెను వెదికి ఇంటికి తీసుకొనివద్దాం" అని పలికాడు.

ఆ రోజు ప్రవర్తించినట్లు ఇంక ఎప్పుడూ ప్రవర్తించననీ పలికాడు. మనోహర్ వకీలు గోపాలరావుగారి ఇంట్లో వున్నందువలన వకీలుగారికి అతని చిరునామా తెలిసి వుండవచ్చుననీ తద్వారా సుచిత్ర జాడ తెలిసికొన వచ్చుననీ, పరిమళానికి నచ్చజెప్పాడు. పరిమళం రంగడి మాటలకు అంగీకరించింది.

పరిమళం రంగడితోపాటు కాజీపేటలో వున్న వకీలు గోపాలరావు గారింటికి వెళ్ళి రంగడు చెప్పిన సంగతి తెలిపింది.

వకీలుగారు పరిమళంతో "ఛీ!ఛీ! మనోహర్ అటువంటివాడుకాదనీ శుక్రవారంనాడు నేను కూడ మనోహర్ ఇంటికి వెళ్ళాననీ, అతని మేనకోడలు అతనితో ఇంట్లో వున్నదనీ వకీలుగారు పలికారు.

పరిమళం నెత్తీ నోరూ కొట్టుకొని ఏడుస్తూ-

"ఆ మేనకోడలే మా సుచిత్ర బాబూ! సుచిత్ర లేకపోతే నేను క్షణం బ్రతకలేను బాబూ" అని పలికింది.

వకీలుగారు ఒక్కసారి ఆలోచించారు. అతనికి గూడ ఆనాడు కొంచెం అనుమానం గలిగింది. పరిమళం మాటమీద వకీలుగారికి విశ్వాసం కలిగింధి.

వకీలుగారు పరిమళంతో-"పరిమళం! ఈ రోజుల్లో ఎంత మంచి వాడినీ నమ్మడానికి వీలులేకుండాపోతున్నది. ఏ విషయాన్నయినా నమ్మడానికి, నమ్మకపోడానికి ఆస్కారంలేదు" అని పలికాడు.

పరిమళం మనోహర్ చిరునామా యివ్వమని అడగగా మనోహర్ తండ్రి ఉద్యోగ విరమణజేసిన తహశీల్దారనీ, గొప్ప స్థితిమంతులనీ, విజయవాడలో మాచవరంలో వుంటారనీ దెలిపి, మనోహర్ చిరునామా వ్రాసి యిద్చారు. మనోహర్ తండ్రి తన చిన్ననాటి స్నేహితుడనీ, తాను కూడ రేపు బయలుదేరి వస్తానని తెలిపారు.

మనోహర్ తన తల్లికి సుస్తీగా వున్నందువలన విజయవాడ వెళు తున్నాననీ, దారిలో జనగాంలో తన స్నేహితుడు సుధాకర్ వివాహానికి హాజరవుతాననీ, అచ్చటి నుండి విజయవాడ వెళతానని చెప్పాడని వకీలు గారు వారితో చెప్పారు.

కాజీపేటలోనే పెళ్ళివారి ఇల్లనీ, అక్కడికి సమీపంలోనే వున్నదని, పెళ్ళి కుమారుడయిన సుధాకర్ మనోహర్ స్నేహితుడని, అతడు భువన మోహనరెడ్డిగారి కుమారుడని, అతని వివాహానికి వెళ్ళాడని, అచ్చటికి వెళ్ళి తెలుసుకుంటే, మనోహర్ మీ సుచిత్రతో అక్కడికి వచ్చిందీ రానిదీ తెలుస్తుందనీ వకీలుగారు తెలిపారు.

పరిమళం వకీలుగారి దగ్గర సెలవు దీసికొని పెళ్ళివారి ఇంటికి వెళ్ళి విచారించింది. సుధాకర్ పరిమళం మాటలు విని దాని చెంపలు వాయించాలన్నంత కోపం వచ్చింది. చంద్రకళ కూడ నిరుత్తర అయింది. గాఢమైన నిశ్వాస వదిలింద.

చంద్రకళ సుధాకర్‌తో "అన్నాయ్! మనం ఒకసారి విజయవాడ వెళ్ళి మనోహర్ అన్నాయ్‌ని చూద్దాం" అని పలికింది.

సుధాకర్ చెల్లెలితో-"మనం ఎట్లాగూ రేపు జనగాం వెళ్ళాలిగదా! అచ్చటి నుండి చిన్నకారులో రేపు విజయవాడ వెళ్ళి అన్ని విషయాలు తెలుసుకుందాం" అని పలికాడు.

సుధాకర్ పరిమళంతో మనోహర్ తన మేనకోడలుతో కలిసి తన వివాహానికి వచ్చాడని, పెళ్ళి అయిన తరువాత వారు విజయవాడ వెళ్ళా రని తెలియజేశాడు. తానుకూడ రేపు విజయవాడ వెళతానని పలికాడు.

పరిమళం పెళ్ళివారి ఇంటినుండి రంగడితో కలిసి తన యింటికి వచ్చింది. పరిమళానికి సుచిత్రమీద పెంచిన ప్రేమ వుంది. "అమ్మా!" అని ఆమెచేత పిలిపించుకోవాలని వుంది.

తన చివరి రోజుల్లో తనకోసం ఎవరన్నా రెండు కన్నీటి చుక్కలు రాల్చేవారు కావాలని ఆమె వేదన. కాని తన ఇంటిలో మాత్రం ఆమెకు సుఖం గలగదనీ, సరియైన బాట దొరకదని ఆమె విచారించింది. ఆమె వెళ్ళిన చోట ఆమెకు సుఖం గలగాలనీ, ఆమె ఏమి చేసుకున్నా ఆమె జీవితానికి పూలబాట ఏర్పడాలని జగన్మాతయైన భద్రకాళిని వేడుకుంది.

పరిమళం ఆ రోజు సాయంత్రం సుచిత్రకు సంగీతం, నాట్యం నేర్పిన శాస్త్రిగారిని కలుసుకుని విషయమంతా తెలియజేసింది. శాస్త్రిగారు ఆశ్చర్యం మాత్రం పొందకుండా పరిమళంతో-

"సుచిత్ర ఎప్పుడూ తప్పు చేయదు. చెడ్డదారి త్రొక్కదు. ఇది నా విశ్వాసం" అని పలికి తాను రేపు ఇతర పనులమీద విజయవాడ వెళు తున్నాననీ ఈ విషయం కూడ విచారిస్తానని దెలిపి మనోహర్ చిరునామా కూడ తెలిసికొన్నాడు.

పరిమళం ఇంటికి వచ్చి రంగనితో కలిసి, ఆనాటి తెల్లవారుజామున విజయవాడ వెళ్ళడానికి నిశ్చయించింది. సుచిత్ర ఆచూకీ తెలిసికోవాలని ఆమెకు కుతూహలంగా వుంది.

రంగడు బంగారు వర్తకుని దగ్గర తీసుకున్న పదివేల రూపాయలు మళ్ళీ అతనికి ఇవ్వవలసి వచ్చింది రంగడికి తల కొట్టినంత పనయింది. సుచిత్రను మళ్ళీ తీసికొనివచ్చి ఆ బంగారు వర్తకునికి అప్పగించి అంతకు రెట్టింపు ధనం తీసుకోవాలని అతని యూహ! ఆ డబ్బుతో చాలాకాలం తాను, తన స్నేహితులు జల్సాగా గడపవచ్చును.

కాని తన అక్క పరిమళానికి ఇటువంటి పనులు ఈమధ్య నచ్చడం లేదు. ఆమెలో ఎంతో మార్పు వచ్చింది.

అందుకని ఆమె దగ్గర తానుకూడ మారినట్లు నటింపసాగాడు. సుచిత్రను ఏదో విధంగా వెదికి ఇంటికి తీసుకుని వద్దామని అక్కతో చెప్పాడు. పరిమళం అంగీకరించింది.

పరిమళం, రంగడు ఆ రోజున తెల్లవారుజామున వరంగల్లు నుండి బయలుదేరి విజయవాడ చేరుకున్నారు. దారిలో బస్సు ఖరాబు అయినందు వలన కొంత ఆలస్యమయింది. వీరు మనోహర్ చిరునామా తెలిసికొని మాచవరం వచ్చేసరికి పన్నెండు గంటలయింది.

రంగడి ప్రోద్బలంతో మనోహర్ ఇంట్లోకి అడుగుపెట్టింది పరిమళం. ఇంటి ముందు ఉన్న వరండాను దాటి హాలులోని ప్రవేశించారు.

నాయనిగారు వరండాను దాటి హాలులో ప్రవేశించిన రంగడిని, పరిమళాన్ని గమనించారు. వారు మధ్యగదిలోనికి తమ అనుమతి లేకుండానే ప్రవేశిస్తున్నారు. వారి సాహసానికి నాయనిగారు ఆశ్చర్యపడి—"ఎవరు మీరు?" అని ప్రశ్నించారు.

రంగడు నిర్లక్ష్యంతో నాయనిగారి మాటలకు జవాబు ఇవ్వకుండానే పరిమళముతో "దొరికారే దొంగలు! అక్కా! ఇదిగో మన చిన్నది! ఇక్కడ కులుకుతోంది" అని గట్టిగా పలికాడు.

పరిమళం సుచిత్రతో "అమ్మా! సుచిత్రా!" అని కౌగలించుకోబోయింది.

వెంటనే నాయనిగారు పరిమళానితో తన చేతికర్రను అడ్డుగాబెట్టి—"ఈమె మా కోడలు. మీ సుచిత్ర కాదు! మా శైలజ! దూరంగా వుండు" అని పలికాడు.

పరిమళం వెంటనే ఆగిపోయింది.

రంగడు మనోహర్‌తో-"ఏమయ్యా పెద్దమనిషీ! ఏమీ ఎరగనట్లుగా చూస్తున్నావ్. రాత్రి ఈ అమ్మాయిని గదిలో దాచి, లేదని బొంకావు. తెల్లవారేసరికి విజయవాడకు కొట్టుకొచ్చావు. నిన్నేమనాలి?" అని ఎగాదిగా చూడసాగాడు.

మనోహర్ మాట్లాడక మౌనం వహించాడు.

రంగడు సుచిత్రవైపు జూసి-"ఏయ్ సుచిత్రా! ఇంకా బయబుదేరి రాక లేడి చూపులుజూస్తూ ఇంకా నిలుచున్నావేం?" అని గద్దించాడు.

సుచిత్ర నాయనిగారివైపు జూసి-"నన్ను రక్షించండి రక్షించండి" అంటూ భయపడి నాయనిగారివైపు చేతులు జోడించింది.

నాయనిగారు సుచిత్ర దగ్గరకు వెళ్ళి శిరస్సు నిమురుతూ "శైలజా! నీకు భయంలేదు. నీవు నిర్భయంగా వుండమ్మా" అని పలికి రంగడితో-కోపంగా "ఎవరు మీరు?" అని ప్రశ్నించాడు.

రంగడు పొగరుబోతుతనంతో "మేమెవరిమయితే మీకెందుకు? నా పేరు రంగడు! మా అక్క పేరు పరిమళం. ఈ అమ్మాయి మా పరిమళానికి కూతురు. నాకు మేనకోడలు" అని పలికాడు.

నాయనిగారు కోపంతో "పరిమళానికి కూతురూగాదు, నీకు మేనగోడలూ కాదు. నిజం చెప్పండి" అని ప్రశ్నించాడు.

పరిమళం యేడుస్తూ "ఈ అమ్మాయిని కనిపెంచిన తల్లిని బాబూ! రాత్రి ఇంట్లోనుండి పారిపోయి వచ్చింది. మా అమ్మాయిని మాతో పంపించండి. మీ కాళ్ళకు మొక్కుతాను" అని నాయనిగారి కాళ్ళమీద పడింది.

నాయనిగారు కాళ్ళను వెనుకకు దీసికొని పరిమళంతో "ఛీ! ఛీ! దూరంగా వుండు. ఈ అమ్మాయి నీ కూతురుగాదు. మా అమ్మాయి. నిజం చెప్పు. ఈ అమ్మాయి నీకెట్లా దొరికిందో, ఎప్పుడు దొరికిందో. లేకపోతే పోలీసుస్టేషన్‌కు వెళతావు. కఠినమైన శిక్షను అనుభవిస్తావు. నిజం చెప్పు" అని పలికాడు.

రంగడు దిమాకుతో "ఆ సంగతంతా మీకెందుకు? మా పిల్లను మాతో పంపండి" అని పలికాడు.

పరిమళం వెంటనే తమ మాటలు ఇక్కడ సాగవని, మాటలాడుతున్నది తహాశీల్‌దారుగారితోననీ గుర్తించింది. నిజం చెప్పకపోతే కొంప మునుగుతుందనీ నిశ్చయించుకుంది. తన రెండు చేతులను నాయనిగారి కాళ్ళ దగ్గరకుజేర్చి "క్షమించండి బాబూ! కన్నతల్లి నిగాను. మూడేళ్ళ కన్న కూతురు కేన్సరు వ్యాధితో మరణిస్తే-నేనేడుస్తూ వుంటే, నాలుగేళ్ళ వయ

స్సుగల పిల్లను మా రంగడు ఎక్కడినుండో తీసికొనివచ్చి నాకు ఇచ్చాడు. ఆ అమ్మాయే యీ సుచిత్ర! నేనే పెంచి పెద్దచేశాను" అని పలికింది.

సుచిత్ర పరిమళం వైపు ఆశ్చర్యంగా జూస్తూ "నన్ను కన్నతల్లివి కావా అమ్మా?" అని ప్రశ్నించింది.

పరిమళం కన్నీరు దొలికిస్తూ సుచిత్ర వైపు జూచి "కాను తల్లీ! నిన్ను కన్నతల్లినికాదు! ఈ విషయాన్ని నీకెన్నోసార్లు చెబుదామనుకున్నాను. కాని చెప్పలేకపోయాను" అని రోదింపసాగింది.

నాయనిగారు పరిమళంతో "ఈ అమ్మాయిని పెంచి పెద్దజేసిన దానవు యీ పిల్లకు పెళ్ళిజేసి ఒక యింటిదానిని చేయకపోయావా?" అని ప్రశ్నించాడు.

పరిమళం కన్నీటిజాలును నేలపై ప్రవహింపజేస్తూ "అటువంటి సంస్కారవంతులు ఎవరు ముందుకువస్తారు బాబూ! వచ్చినా అతని తల్లి-తండ్రులు, సమాజం ఒప్పుకుంటుందా?" అని మొగమెత్తి నాయనిగారిని ప్రశ్నించింది.

నాయనిగారు నిరుత్తరుడయ్యాడు. ఆ ప్రశ్న తననే సూటిగా ప్రశ్నించినట్లనిపించింది.

రంగడు నిర్లక్ష్యంగా "మాకేం బట్టింది పెళ్ళి చేసిందాకా? ఎంతో డబ్బు ఖర్చుబెట్టి పెంచి పెద్దచేశాం. ఒక బంగారు వర్తకునికి పదివేల రూపాయలకు అమ్ముకున్నాం. మేము చెప్పింది వినక రాత్రికి రాత్రి పారిపోయి వచ్చింది" అని పలికాడు.

మనోహర్ రంగడి వైపు జూస్తూ "ఈ అమ్మాయిని మీరు పతితను చేయదలచుకున్నారు. నేను కాపాడి రక్షించాను. నేను పెళ్ళిజేసుకో దలచాను" అని పలికాడు.

రంగడు అదే ధోరణిలో "అయితే ఆ పదివేల రూపాయలు మీరిప్పించండి. అట్లాగే పెళ్ళి చేసుకోండి. ఎవరయితే మాకేం? మాకు కావలసింది డబ్బు" అని పలికాడు.

పరిమళానికి రంగడి మాటలు కోపం తెప్పించాయి. "అరే రంగా! నువ్వు వూరుకో!" అని పలికింది.

ఇంతలో సైకిలుమోటారు ఆగిన శబ్దం బయట వినబడింది.

ఇన్స్పెక్టర్ ప్రభాకరరావుగారు నాయనిగారింట్లోకి వేగంగా ప్రవే శించి "నమస్కారం నాయనిగారూ!" అని నమస్కరించాడు. నాయనిగారు కూడ ప్రతినమస్కారం జేశారు.

ఇన్స్పెక్టర్‌గారు రాగానే నాయనిగారి భార్య భవానీ ప్రక్కకు తొలిగి స్తంభం చాటుకు వెళ్ళింది.

నాయనిగారు ఇన్స్పెక్టరుగారిని కుర్చీలో కూర్చోనమని చెప్పి, తాను గూడ కుర్చీలో కూర్చున్నాడు.

ఇన్స్పెక్టరుగారు నాయనిగారికి స్నేహితులు.. నాయనిగారిని పరా మర్శించి "నాతో మీకు యేదోపని బడ్డట్లు వున్నది. చెప్పండి?" అని ప్రశ్నించి, అక్కడవున్న వారందరిని జూచి, రంగడిని గుర్తించి "ఒరేయ్ రంగా! నీది వరంగల్ గదరామకాం. ఇక్కడికెప్పుడు వచ్చావు? అదె వరు?" అని కోపంతో ప్రశ్నించాడు.

ఇన్స్పెక్టర్‌గారి ముందు రంగడు తన ఆటలు సాగవని గుర్తిం చాడు. తలవంచకపోతే వీపు అప్పగించవలసి వస్తుందని గుర్తించాడు.

రంగడు ఇన్స్పెక్టరుగారితో విధేయతను జూపిస్తూ "మా అక్క అండీ! పరిమళం!" అని సమాధానమిచ్చాడు.

నాయనిగారు ఇన్స్పెక్టరుగారి మాటలకు ఆశ్చర్యపడి "వీరంతా మీకు పరిచయమా?" అని ప్రశ్నించాడు.

ఇన్స్పెక్టర్‌గారు రంగడివైపు చేయి జూపిస్తూ– "వీడు పాతకేడీ! ఎన్నోసార్లు జైలుకు వెళ్ళాడు. ఈ పరిమళం వీడి అక్క. ఈ పరిమళం వరంగల్లులో స్థితిమంతురాలైన పడుపుకత్తె!" అని చిరునవ్వు నవ్వాడు.

నాయనిగారు ఇన్స్పెక్టర్‌గారినిజూచి "ప్రభాకర్! మనం పదేళ్ళుగా వెదుకుతున్న మన శైలజ దొరికింది. శైలజవైపు చేయిజూచి "ఇదిగో! ఈ అమ్మాయే మన శైలజ!" అని పలికాడు

ఇన్స్పెక్టర్‌గారు ఆశ్చర్యంతో "ఈ అమ్మాయేనా మీ శైలజ! ఎచ్చట దొరికింది?" అని ప్రశ్నించాడు.

నాయనిగారు "ఇన్నాళ్ళుగా మన అమ్మాయి వీళ్ళదగ్గరే పెరిగింది.

హనుమకొండలో బి.ఇడి. ట్రైనింగ్ పొందుతున్న మా మనోహర్ తీసి కొని వచ్చాడు." అని ఇన్స్పెక్టర్ గారితో పలికారు.

పోలీసు అధికారి మరింత ఆశ్చర్యంతో "శైలజ మీ అబ్బాయికెలా దొరికిందో పూర్తిగా వివరించండి" అని పలికారు.

నాయనిగారు ఇన్స్పెక్టర్ గారితో "నాలుగురోజుల క్రిందట శైలజను వ్యభిచారవృత్తికి వీరు నిర్బంధించారట. అర్ధరాత్రి పారిపోయి, చదువు కుంటున్న మా అబ్బాయి గదిలో ప్రవేశించిందట! మా మనోహర్ ఈమెని కాపాడి హనుమకొండ నుండి తీసికొనివచ్చాడు. వాడికికూడ ఈమె శైలజ అని తెలియదు. ఇచ్చటికి వచ్చిన తరువాత చెంపక్రింద పుట్టుమచ్చ, కుడి భుజంమీద కాలినమచ్చ, వీటినిబట్టి మేమే గుర్తించాము. మీరు ఇంకా ఆరా తీయవలసివుంది!" అని పలికారు.

ఇన్స్పెక్టర్ గారు నాయనిగారి సంతోషానికి తానుగూడ మురిసిపోతూ "అట్లాగే!"నని చెప్పి, రంగడివైపు తీక్షణంగా జూచి, "ఒరేయ్ రంగా! వున్నదున్నట్లు నిజం చెప్పు. లేకపోతే మీరిద్దరు కఠినమైన కారాగారశిక్ష అనుభవించవలసివస్తుంది. ఒసేవ్! పరిమళం నిజం చెప్పు" అని పలికారు.

రంగడు మాటరాక తెల్లముఖం వేశాడు.

పరిమళం నెత్తీనోరూ కొట్టుకుంటూ- "ఇన్స్పెక్టర్ బాబుగారూ! నాకు ఏం తెలీదండీ! పదిసంవత్సరాల క్రిందట నాకు నాలుగేళ్ళ కూతురు వుండేది. ఆ పిల్ల కాన్సరువ్యాధితో మరణించింది. నేను దుఃఖంతో ఏడుస్తూ వుంటే, దిక్కులేని పిల్ల అని నాలుగేళ్ళ పాపనుదెచ్చి నాకిచ్చాడు. అంతే! ఆ పిల్లను నేను పెంచి పెద్దజేశాను. నేను యీ నీచవృత్తిని చాలకాలం క్రిందటే వదిలేశాను. నేను వద్దన్నకొద్దీ- యీ రంగడే పదివేలరూపాయ లకు ఒక బంగారు వర్తకుడికి యీ పిల్లను అమ్ముకున్నాడు. ఆ రాత్రే అమ్మాయి పారిపోయి వచ్చింది." అని కన్నీళ్ళతో పలికింది.

ఇన్స్పెక్టర్ గారు రంగడితో "ఒరేయ్ రంగా! నిజం చెప్పు. ఈ పిల్ల నీకెక్కడ దొరికింది?" అని ప్రశ్నించారు.

రంగడిలో దిమాకు అంతా మటుమాయమయింది. చేతులు జోడించి "పదేళ్ళక్రిందట హైదరాబాదు ఎగ్జిబిషన్‌లో దొరికింది. నాలుగేళ్ళ పిల్ల!

మెడలో పులిగోళ్ళతోవున్న బంగారుగొలుసు వుంది. ఆ గొలుసును అమ్ము కొని త్రాగుడుకు ఖర్చుపెట్టాను. ఆ పిల్లను తీసికెళ్ళి వరంగల్లులో వున్న మా అక్క పరిమళానికి యిచ్చాను" అని తొట్రుపాటులేకుండా పలికాడు.

స్తంభం చాటునుండి నాయనిగారి భార్య భవాని "ఆ పులిగోళ్ళతో వున్న బంగారుగొలుసును నేనే చేయించాను. ఆ గొలుసంటే ఎంతో సంబర పడేది. ఈ అమ్మాయి మన శైలజేనండీ! సందేహంలేదు." అని భవాని మళ్ళీ శైలజను చాటుకుబిలిచి కౌగలించుకుంది.

ఇన్స్పెక్టర్‌గారు కోపంతో "ఒరేయ్ రంగా! తహసీల్‌దారుగారి కుటుంబానికి ఇన్ని యిక్కట్లు దెచ్చిపెట్టిన మీకు ఎన్ని సంవత్సరాలు కఠిన శిక్ష కావాలో జెప్పండి!" అని పలికారు.

పరిమళం ఇన్స్పెక్టర్‌గారి రెండు కాళ్ళు పట్టుకొని "బాబూ! బుద్ధి వచ్చిందండీ! ఇక్కడవున్న వాళ్ళందరూ నన్ను క్షమించండి!" అని పలికి సుచిత్రవైపు జూచి, "అమ్మా! సుచిత్రా! కాదు- శైలజా! నన్ను క్షమించు తల్లీ!" అని పలికింది.

మళ్ళీ ఇన్స్పెక్టర్‌గారివైపు జూచి "బాబూ! ఇన్స్పెక్టరుగారూ! రాత్రినుండి నాకు గుండెపోటు వస్తున్నది. బుద్ధివచ్చింది. ఈనాటినుండి యీ వృత్తికి దూరంగా వుండడమేకాదు- నాకున్న యావదాస్థిని, యీ వృత్తిని అవలంబించి జీవిస్తున్నవారికి పంచిపెట్టి, యీ నీచమైన వృత్తిని మానమనీ, ఏదైనా చాకిరీజేసకొని జీవించమని సలహాయిస్తాను." అని పలికింది.

మళ్ళీ నాయనిగారివైపు జూచి "క్షమించండి బాబుగారూ! మీ కుటుంబానికి నేను తెచ్చిపెట్టిన కష్టాలు యిన్నీ-అన్నీ కావు. ఈ ముసలితనంలో నన్ను జైలుకు పంపించకండి బాబూ!" అని పరిమళం నాయనిగారి కాళ్ళ మీద పడింది.

రంగడు ఇంక తనకు శిక్ష తప్పదనీ, జైలుకు వెళ్ళక తప్పదనీ గ్రహించాడు. చేతులు జోడించి "ఇన్స్పెక్టర్‌గారూ! కొన్నాళ్ళనుండీ నా కళ్ళకు మసకలు వస్తున్నవి. నా పాపం నన్ను తరుముకువస్తున్నది. మీరు నమ్మినా- నమ్మకపోయినా నిజం చెబుతున్నాను. ఈ రోజునుండి యీ రౌడీ

వృత్తి మానివేస్తున్నాను. కూలిపనిజేసుకొని జీవిస్తాను" అని కాళ్ళమీద బడ్డాడు.

ఇన్స్పెక్టర్‌గారు రంగడితో "ఒరేయ్ రంగా! తప్పుచేసి క్షమించమంటే సరిపోతుందా? నేరానికి తగినశిక్ష అనుభవించాలి." అని పలికారు.

అంతసేపు అచ్చట నిలుచుని చూస్తున్న శైలజకు మనసు కరిగింది. నాయనిగారితో వినయంగా "వీరిని క్షమించండి మామయ్యా!" అని పలికింది.

భవానీకి గూడ మనసు కరిగింది. స్తంభం చాటునుండే భర్తతో "మన పిల్ల మనకు దొరికింది. వాళ్ళుచేసిన పాపం వాళ్ళే అనుభవిస్తారు. వాళ్ళ ఖర్మకు వాళ్ళను వదిలేయండి" అని మెల్లగా పలికింది.

మనోహర్ గూడ తండ్రితో "నాన్నా! అమ్మ శైలజతోబాటు నేను కూడ కోరుకుంటున్నాను. ఈ నేరస్థులను వదిలివేయండి" అని పలికాడు.

నాయనిగారు ఇన్స్పెక్టర్‌గారితో "మన అమ్మాయి మనకు దొరికింది. ఈ నేరస్థులలోకూడ తగిన పశ్చాత్తాపం కనిపిస్తూ వున్నది. వీరిని వదిలివెయ్యండి ఇన్స్పెక్టర్‌గారూ!" అని పలికారు.

ఇన్స్పెక్టర్‌గారు కుర్చీనుండి లేచి, "మీరు ఫిర్యాదు చేస్తేనేగదా వారిమీద చర్య తీసుకునేది? మీరు కోరినట్లుగా వారిమీద ఎట్టి చర్య తీసుకోములెండి. ఒరే రంగా! ఒసే పరిమళం! మీరు అదృష్టవంతులు. దయార్ద్రహృదయులైన నాయనిగారు మీమీద ఎట్టి చర్య తీసుకోవద్దంటున్నారు. ఇంక నీతిగా బ్రతకండి! మీరు మళ్ళీ మాటతప్పి ప్రవర్తించారా, కఠినశిక్షను అనుభవిస్తారు. నేను వెళుతున్నాను." అని పలికి, నాయనిగారితో "నమస్కారం నాయనిగారూ! వెళ్ళివస్తాను" అని పలికారు.

నాయనిగారు ఇన్స్పెక్టర్‌గారిని సాయంత్రం ఐదుగంటలకు టీకి ఆహ్వానించారు. వీలుగావుంటే తప్పక వస్తానని మాట ఇచ్చి వెళ్ళిపోయారు. ఒంటిగంట కావస్తున్నది.

నాయనిగారు, భవానీల ఆశలు ఫలించినవి. చేసిన నోముల ఫలితము అందినది. కుమారునీ, కోడలును జంటగా జూచి వారి హృదయాలు ఆనంద లహరులలో మునిగి తేలుతున్నవి.

శైలజ ఇప్పుడు మరొక విధంగావుంది. రాహువు విడిచిన చంద్ర బింబమువలె పరమశోభాయమానంగా వుంది. మనోహర్ మకరాంకునివలె ఎదురేగి ఆమె హస్తమును బట్టుకున్నాడు.

సుచిత్ర నవ్వుతూ "ఇప్పుడు నాకు మీ సహాయం అవసరంలేదు. ప్రస్తుతము నేను యీ ఇంటికి మహారాణిని" అని పలికింది.

మనోహర్ వెంటనే "యీ ఇంటికే కాదు- నా హృదయానికికూడా" అంటూ చమత్కరించాడు.

భోజనానికి వేళ అయిందని నాయనిగారు గుర్తుచేశారు. భవాని శైలజను హృదయానికి హత్తుకొని స్నానాలగదిలోనికి దీసికొని వెళ్ళింది. శైలజ స్నానం చేసేవరకు, భవాని పెట్టెలోవున్న మరొక పట్టుచీర తెచ్చి యిచ్చింది. శైలజ అలంకరించుకొని మధ్యహాలులోనికి ప్రవేశించింది.

ఇంతలో బయట కారు హారన్ మ్రోగింది. సుధాకర్, చంద్రకళలు వచ్చిపడ్డారు. హాలులో అందరిని జూచి, వారు ఖిన్నదానినిబట్టి ఆతురత జెందారు.

మనోహర్ శైలజ హస్తమును వదిలి, సుధాకర్‌కు ఎదురేగి కౌగలించుకున్నాడు. శైలజ కూడా ఎదురేగి చంద్రకళను కౌగలించుకుంది.

సుధాకర్ తాము విన్న సంగతిని గురించి ప్రశ్నింపగా, మనోహర్ పూసగ్రుచ్చినట్లు అంతా వివరించి పలికాడు. సుధాకర్, చంద్రకళల సంతోషానికి, ఆశ్చర్యానికీ మేరలేదు.

చంద్రకళ "నాటకం విషాదాంతం అవుతుందేమోనని కలవరపడ్డాను అన్నయ్యా!" అని మనోహర్‌తో పలికింది.

సుధాకర్ చిరునవ్వుతో "దైవానుగ్రహం లేకపోతే- విషాదాంతం అయ్యేది యీ కథ! దైవానుగ్రహం వుంటే- విషాదాంతంకూడా సుఖాంతం అవుతుంది." అని పలికాడు.

చంద్రకళ సుధాకర్‌తో "నీ వేదాంతవాక్యాలకు ధన్యవాదాలు!" అని పలికింది.

అక్కడవున్న వారందరు నవ్వులు చిందించారు.

భవాని అందరినీ భోజనానికి రమ్మని కేకవేసింది. తాను తన కుమా

రుని కోసమని చేసిన తీపి వస్తువులు అందరకు అక్కరకు వచ్చినవి కదా!" అని ఆమె సంతోషించింది.

సుధాకర్, చంద్రకళలు గూడ కాళ్ళు చేతులు గడుగుకొని భోజనానికి సిద్ధమయ్యారు. అందరూ భోజనాల గదికి జేరుకున్నారు. పంక్తులుగా కూర్చున్నారు.

భవానీ శైలజతో "నేను చేసిన వంటకాలను అందరికీ వడ్డింపు తల్లీ" అని పలికింది.

శైలజ మొదట సిగ్గుబడింది. మనోహరంగా కుర్చీపీటనుండి లేచి పాయసపు పాత్రను చేతధరించింది.

ఆ సమయంలో సుచిత్ర పాలసముద్రము మధించిన తరువాత, ఉద్భవించి అమృతాన్ని సురలకు పంచిపెట్టుటకు అమృతపాత్రను ధరించిన మోహినీదేవతవలె వుంది.

తనను పెంచిన తల్లిని పరిమళాన్ని, రంగడిని గూడా కాళ్ళు, చేతులు గడిగికొని భోజనశాలలోనికి రమ్మని సుచిత్ర ఆహ్వానించింది.

వారు మొదట సందేహించారు. శైలజ ప్రోత్సాహముతో తరువాత వారు కూడ వచ్చి, వారికి కొంచెం దూరంలో కూర్చున్నారు.

శైలజ అందరికి ముందు పాయసం వడ్డించింది. తరువాత ఆమె అన్నం, పప్పు, కూరలు, పచ్చళ్ళు వడ్డించింది. అందరూ తృప్తిగా భుజించారు. నాయనిగారు, భవానీల ఆనందానికి అంతులేదు. "ఇట్టి సురలోక దేవతను తాము గుర్తింపలేదుగదా!" అని పరిమళం, రంగడు ఖిన్నులయ్యారు.

మనోహర్ శైలజ పాయసం వడ్డించేటప్పుడు ముఖముమీద బడిన ముంగురులను తన చూపుడువ్రేలితో సరిజేయుటకు యత్నించేవాడు. కాని ఆ అవకాశం మనోహర్‌కు ఇవ్వకుండా వెనుకకు తగ్గేది. ఈ విధంగా సంతోష ఆనందతరంగాలతో భోజనాలు పూర్తి అయినవి.

ధైర్యం లేకపోతే యీ శుభ సన్నివేశం జరిగేదికాదు. ఇటువంటి యువకులను మనం గౌరవించాలి. నేను నాయనిగారి కుమారుడైన మనోహర్‌ను మనసారా అభినందిస్తున్నాను" అని ఇన్‌స్పెక్టరుగారు పలికారు.

నాయనిగారు "త్వరలో శైలజా, మనోహర్‌ల వివాహం జరుగుతుందనీ, ఆ శుభకార్యమునకు అందరు రావలెననీ" పలికారు.

సుధాకర్ మాట్లాడుతూ "తనకు మనోహర్ సోదరుడని ఆహ్వానింపకపోయినా, తెలిసికొని వస్తాననీ" చమత్కరించాడు.

చంద్రకళ శైలజతో "మా అన్నయ్య వివాహానికి మంగళ హారతి పాడడానికీ, తలుపు దగ్గర పేర్లు చెప్పించడానికి తప్పక వస్తాననీ" చమత్కరించింది.

టీపార్టీకి వచ్చిన నాయనిగారి స్నేహితులు గూడా మాట్లాడారు. అచ్చట పెద్దలందరూ నవ్వుకున్నారు.

తరువాత శాస్త్రిగారు శైలజా మనోహర్‌ల శుభ సన్నివేశాన్ని వల్లిస్తూ "రెండుగా విడిపోయిన సెలయేటి ధారలు మళ్ళీ కలుసుకున్నట్లుగా వున్నదనీ, వీరి దాంపత్యశోభా జీవితం వీరికేగాక సమాజానికి, దేశానికి వెలుగు ప్రసాదించాలని కోరుతున్నా"నని పలికారు.

ఇన్‌స్పెక్టరుగారు అందుకుని "మీరే పీటలమీద కూర్చొని అమ్మాయిని కన్యాదానం చేయవలసి వుంటుందని పలికారు.

శాస్త్రిగారు అందుకుని "అందుకు నేను సిద్ధం. నేనింతవరకు మా ప్రభావతి మాదిరిగా శైలజను చూచుకునేవాడిని. ఆ పనిజేస్తే మా కులంవారేమీ నన్ను వెలివేయరు. వేసినా సహిస్తాను" అని పలికారు.

శాస్త్రిగారి విశాలహృదయానికి అచ్చటివారందరూ ప్రణామములర్పించారు.

అందరూ టీ సేవించడం పూర్తయింది. శాస్త్రిగారు మాత్రం పాలు పుచ్చుకున్నారు.

అంతట ఇన్‌స్పెక్టరుగారు అచ్చటి వారందరికి అభివందనములు జెప్పి శెలవు దీసికొని వెళ్ళిపోయారు.

వచ్చిన నాయనిగారి ముఖ్యమైన స్నేహితులు గూడ ఒక్కరొక్క రుగా వెళ్ళిపోయారు.

సుధాకర్, చంద్రకళలు ఆ రాత్రికే తాము జనగాం చేరుకోవలసి వుందనీ జెప్పి, అందరి దగ్గరా సెలవు దీసికొని వెళ్ళిపోయారు. వెళ్ళిపోవు నపుడు శైలజా చంద్రకళలు; మనోహర్, సుధాకర్‌లు గాఢాలింగనం జేసి కొన్నారు.

శాస్త్రిగారు మరల రెండురోజుల తరువాత వస్తాననీ. ప్రస్తుతం తాను బంధువులింటికి కూచిపూడి వెళ్ళవలసి వుందని చెప్పి వెళ్ళిపోయారు. శాస్త్రి గారు వెళ్ళిపోయేటప్పుడు శైలజ మరొకసారి పాదాభివందనం చేసింది. శాస్త్రిగారు ఆశీర్వదించారు.

అచ్చట చివరకు పరిమళం రంగడు మిగిలారు. పరిమళం నాయని గారికి నమస్కరించి, వెళ్ళవస్తాం బాబూ! నమస్కారం! మమ్మల్ని జైలు శిక్షనుండి కాపాడారు" అని పలికి శైలజ వైపు జూచి "వెళ్ళవస్తాం తల్లీ!" అని కన్నీటిని జలజల రాల్చుతూ పలికింది.

నాయనిగారు పరిమళం వైపు జూచి "మీ పదివేల రూపాయలు దీసికొని వెళ్ళరూ?" అని ప్రశ్నించాడు.

పరిమళం నాయనిగారిని జూచి "మాకెందుకు బాబూ డబ్బు? వాకున్న ఆస్థి అంతా మా వాడలోని పిల్లలకు పంచిపెట్టి ఎవరి పంచలోనన్నా బ్రతు కుతా బాబూ!" అని దుఃఖాన్ని ఆపుకుంటూ పలికింది.

మనోహర్ పరిమళంవైపు జూచి "ఎవరి పంచనో ఎందుకు? మా పంచనే బ్రతుకుదువుగాని రా! కాని అందుకు ఒక షరతు! నీకున్నదంతా మీ వాడలోని పిల్లలకు పంచిపెట్టి రావాలి" అని పలికాడు.

పరిమళం గంపెడు సంతోషంతో "అట్లాగే బాబూ!" ఇక్కడవుంటే శైలజమ్మను గూడ కళ్ళారా జూసుకో వచ్చును" అని పలికింది.

రంగడు మనోహర్‌ను జూచి "నేను గూడ మా అక్కతో ఇక్క డికి వస్తాను. నాకు ఏదయినా పని యిప్పిస్తారా బాబూ?" అని ప్రశ్నించాడు.

"తప్పకుండారా! పరిశుద్ధమైన హృదయం గలిగి, కష్టపడి పనిచేసే వారికి, ఎక్కడనైనా స్థానం లభిస్తుంది" అని పలికాడు మనోహర్.

రంగడు మనోహర్‌తో "అట్లాగే బాబూ! మమ్మల్ని నరకంనుంచి పైకి లాగంచి" అని పలికి శైలజ వైపు తిరిగి జూచి "వెళ్ళివస్తాం తల్లీ! నీకెన్నో కష్టాలు గలిగించాను. క్షమించు తల్లీ!" అని పలికాడు.

శైలజ దయార్ద్రభావంతో అతనివైపు జూచింది.

పరిమళం రంగడు అందరి దగ్గర సెలవు దీసికొని, బయలుదేరారు. ఆ రాత్రికే వారు వరంగల్ వెళ్ళిపోదలచారు. నాయనిగారు రైల్వేస్టేషను వరకు తమ నౌకరు రామూను వారికి తోడిచ్చి పంపించారు. సుచిత్ర చేతులకు అదివరకున్న బంగారుగాజులను తీసి వారికిప్పించాడు.

ఆరు గంటలు దాటింది. ఆ సమయంలో నాయని గారింట్లో ఇంటి వారు తప్ప బయటివారెవరూ లేరు.

నాయనిగారు శైలజతో "శైలజా! అమ్మయ్యా! ఈ నాటికి-ఇప్పటికి యీ యింటికి కళ వచ్చింది. ఇప్పటికి పన్నెండేళ్ళనుండి మీ అత్తయ్యకు, నాకూ శాంతిలేదు. నీకోసం ఎంతగానో వెదికాం! పరితపించాం తల్లీ! ఇప్పటికి నీవు దొరికావు! ఈ ఇంటికి వెలుగు వచ్చింది" అని పలికారు.

శైలజ నాయనిగారితో "ఇంత దుఃఖాన్ని మీకు గలుగజేసిన నేను దురదృష్టవంతురాలను మామయ్యా!" అని రుద్ధమైన కంఠంతో పలికింది.

భవానీ వెంటనే "దురదృష్టం అని ఎందుకనుకోవాలీ? జగన్మాత మనల్ని పరీక్షించిందనుకుందాం!" అని భర్త వైపు తిరిగి "ఏమండీ! నేనీ సంతోషతరంగాలను భరింపలేకపోతున్నానండీ" అని పలికింది.

నాయనిగారు భవానీతో "నేను గూడ యీ ఆనందాన్ని భరింపలేకపోతున్నాను. గరళంలో నుండే అమృతం ఉద్భవించింది. వేదనలోనుండి పుట్టిన సుఖం ఎంత మధురమో అది అనుభవించినవారికే తెలుస్తుంది" అని పలికాడు.

భవానీ భర్తతో "ఇదంతా జగన్మాత కృపాకటాక్షం!" అని పలికింది.

నాయనిగారు భవానీకి శైలజా, మనోహర్‌లను జూపి, "వెంటనే వీరిద్దరికీ వివాహం చేయాలి! తిరుపతిదేవుని సన్నిధిన వీరి వివాహంచేద్దాం.

మన పురోహితులు రామకృష్ణయ్య పంతులుగారిని, కొత్తగూడెంలో వున్న అమ్మాయి భారతిని కూడ తీసికొనివెళదాం.

భవానీ భర్తతో "అయితే మన బంధువులందరికీ యీ విషయం తెలియజేయవద్దూ? వారందరు రావడానికి కొంత సమయం కావాలిగదా?" అని ప్రశ్నించింది.

నాయనిగారు భవానీతో "తిరుపతిలో వీరి వివాహమునుజేసి ఇంటికి వచ్చిన తరువాత సత్యనారాయణ వ్రతంజేసి, మన బంధువులందరికీ విందు చేద్దాం!"

మనోహర్ ముఖం ప్రక్కకుదిప్పి "నాన్నా! నాకీ వివాహం ఇష్టం లేదు" అని పలికాడు.

భవాని ఆశ్చర్యంతో కుమారుని ముఖంవైపు జూచింది.

నాయనిగారు మనోహర్‌తో "ఎందుకని?" అని ప్రశ్నించాడు.

మనోహర్ తండ్రితో "నాన్నా! మీరేగా ఇప్పుడు అన్నారు—ఆ అమ్మాయి ఒక వేశ్య కూతురనీ, ఆ అమ్మాయిని వివాహమాడితే-మన కుటుంబ గౌరవప్రతిష్ఠలు మంటగలిసిపోతాయని మీరేగా చెప్పింది" అని పలికాడు.

భవాని గర్వంగా కుమారునివైపు జూచి "మీ నాన్నగారికేం తెలుసు? నేను ముందే శైలజను జూడగానే చెప్పలేదు? ఆ అమ్మాయి వేశ్యకూతురు గాదనీ, పట్టుచీర కట్టుకొని పార్వతీదేవిలాగుందనీ! ఈ శైలజ మీ మేన మామ కూతురురా! పసితనంలో యీ యింట్లో ఆడుకున్నారు" అని పలికింది.

నాయనిగారు చిరునవ్వు నవ్వుతూ "వాడి మాటలకేం? అన్నీ వేషాలు! నాటకం ఆడుతున్నాడు. నాటకం" అని పలికి, మనోహర్‌తో- "శుభస్య శీఘ్రం! అన్నారు పెద్దలు. శుభకార్యాన్ని ఆలస్యం చేయ కూడదు. మన పురోహితులవారి దగ్గరకు వెళ్ళి వస్తాము" అని పలికి నాయని గారు బయటికి వెళ్ళారు.

ఆ సమయంలో అచ్చట కుమారుడు, కోడలు, భవానీ మాత్రమే వున్నారు.

భవాని ముద్దుగా శైలజను దగ్గరకు దీసికొని "అమ్మాయ్ శైలజా! ఇంత పెద్దదానివయ్యావు. వంట, వార్పూ నేర్చుకున్నావా?" అని పలికింది.

మనోహర్ తల్లితో "శైలజ చక్కగా నేర్చుకున్నదమ్మా! అంతే గాదు, సంగీతం, నాట్యం కూడ నేర్చుకున్నది" అని పలికాడు.

భవాని మనోహర్‌ను జూచి "నీకెట్లా తెలుసురా మనోహర్?" అని పలికింది.

మనోహర్ శైలజను చూపించి తల్లితో "తనే చెప్పిందమ్మా! వంటా, వార్పూ అన్నీ తెలుసునని" అని శైలజ వైపు జూచి "శైలజా! నీకు జీతం ఎంత కావాలి?" అని ప్రశ్నించాడు.

శైలజ చిరునవ్వు నవ్వి వూరుకుంది.

భవాని కుమారునితో "పెళ్ళానికెవరయినా జీతమిస్తారట్రా? నోర్మూయ్!" అని పలికింది.

ఇంతలో రాము వచ్చి "బయటి హాలులో ఐదారుగురు అమ్మగార్లు వచ్చి, మిమ్మల్ని పిలుస్తున్నారండీ" అని పలికాడు.

శైలజ దొరికిన వార్త ఆ వీధిలోవున్న ఆడబడుచులకందరికీ అప్పుడే తెలిసిపోయింది. ఆ పిల్లకోసం పది సంవత్సరాలనుండి భవాని పడుతున్న వేదన ఆ వీధిలోని వారందరికీ తెలుసు. శైలజా యెట్లావుంటుందో, ఎట్లా మళ్ళీ వారికి దొరికిందో తెలుసుకుందామని ఆదుర్దాతో ఒక్కొక్కరు రాసాగారు. వారిని కలుసుకోవడానికి, కొడుకును, కోడలును గదిలో వదిలి భవానీ బయట హాలులోనికి వచ్చింది.

లైబ్రరీహాలులో మనోహర్-శైలజ మాత్రమే వున్నారు.

మనోహర్ ఆమెతో "శైలజా!" అని పలిచాడు.

శైలజ కూడ మనోహర్‌తో "మనోహర్ బాబూ!" అని పలికింది.

మనోహర్ శైలజతో "ఇంక బాబు ఎందుకు? నీ కోరిక నెరవేరింది భర్త కావాలన్నావు. భర్త లభించారు. పెళ్ళి కావాలన్నావు, పెళ్ళి కాబోతోంది" అని చిరునవ్వుతో పలికాడు.

అదే చిరునవ్వుతో శైలజ "మీ కోరిక కూడా నెరవేరింది గదా. నన్ను వివాహం చేసుకుంటానని ప్రతిజ్ఞ చేశారు. ప్రతిజ్ఞ నెరవేరింది."

మనోహర్ శైలజతో "ఇదంతా ఎవరి దయవలన జరిగిందో తెలుసా?" అని ప్రశ్నించాడు.

శైలజ కుతూహలంగా "ఎవరి దయవలన?" అని ప్రశ్నించింది.

మనోహర్ సవినయంగా "జగన్మాత భద్రకాళి దయవలన! ఈ ఉదయం నీ నుదుటదిద్దిన కుంకుమరేఖలు ఆ తల్లి చరణధూళి. ఆ కుంకుమ రేఖలే మనలను యీ విధంగా దగ్గరకు జేర్చినవి.

శైలజ అంజలిఘటించి, "ఆ సంగతి నాకు చెప్పనవసరములేదు. ఆమె నాకు యిష్టదేవత" అని పలికింది.

మనోహర్ శైలజ ముఖముమీద బడుతున్న ముంగురులను తన చూపుడు వ్రేలితో సరిదిద్ది "నీలాంటి అనుకూలవతి, కళాకారిణి నాకు భార్యగా దొరకడం అదృష్టం" అని పలికాడు.

శైలజ మనోహర్‌ను తెరిపారజూచి "మీరు కూడా కళాకారులే గదా! ఆ గోడమీదవున్న చిత్రపటములు మీరు వ్రాసినవికదా?" అని ప్రశ్నించింది.

మనోహర్ శైలజతో "నేను చెప్పకుండానే నీవు తెలిసికున్నావు. నీ సద్యస్ఫూర్తికి నా మెచ్చికోలు!" అని ఆమె ముఖాన్ని తన రెండు చేతులతో తామరపువ్వును తీసికున్నట్లు తీసుకోబోయాడు.

శైలజ వెనుకకు జరిగి "మేడమీద మీ టేబుల్ బల్ల మీదవున్న ఫోటో ఎవరిది?" అని ప్రశ్నించింది.

"నీకు తెలియదా? భారత కమ్యూనిస్టుపార్టీ నిర్మాతలతో ఒకరైన కీ. శే. సుందరయ్యగారిది! భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ నిర్మాతలలో వారొకరు" అంటూ వేదనతో పలికాడు.

"వారిప్పుడు లేరుగదా" అని శైలజ పలికింది.

"అవును! వారిప్పుడులేరు. పరమపదించారు. వారంటే నాకు చెప్ప లేని అభిమానం" అని మనోహర్ పలికాడు.

"అయితే మీరు కమ్యూనిస్టులా?" అని ప్రశ్నించింది.

"కాదు! కాని కమ్యూనిస్టుపార్టీ అన్నా, సోవియట్, రష్యా అన్నా అభిమానం" అని మనోహర్ పలికాడు.

"ప్రస్తుతం రష్యాలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అధికారంలో లేదుకదా?" అని శైలజ ప్రశ్నించింది.

"అవును లేదు! నేను ఈ మధ్య చరిత్ర అధ్యయనం చేశాను. 20వ శతాబ్దంలో రెండు సంఘటనలు విషాదకరంగా నేను భావిస్తాను" అని మనోహర్ వేదనతో పలికాడు.

"అవి యేవి?" అంటూ శైలజ ప్రశ్నించింది.

మనోహర్ మరింత వేదనాభరిత స్వరంతో. "భారత ఉపఖండం-మన మాతృభూమి రెండుగా విభజింపబడి శత్రుదేశాలుగా మారడం-రెండవది పీడిత ప్రజలకు ఆశాజ్యోతియైన యునైటెడ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ మాయమైపోవడం-ఈ రెండు పరిణామాలు నాకెంతో వేదన గలిగించినవి" అని పలికాడు.

"దీనికి కారణమెవరు?" అని ఆమె ప్రశ్నించింది.

"దీనిని వివరించి చెప్పడానికి నాకు మాటలు రావడంలేదు. మరెప్పుడైనా చెబుతాను" అంటూ మనోహర్ గద్గదస్వరంతో పలికాడు.

శైలజ మనోహర్ వేదన జెందుతున్నట్లు గ్రహించింది. విషయాన్ని మార్చి, మరొకవైపుకుత్రిప్పి "మీరు పెట్టబోయే పాఠశాలకు పరిమళమ్మకు 'ప్రైవర్' ఉద్యోగం యిస్తామన్నారు. రంగడికి కూడ యేదైనాపని జూపిస్తామన్నారు. మరి నాకు యే ఉద్యోగం యిస్తారు?" అని మనోహర్‌ను ప్రశ్నించింది.

మనోహర్ వెంటనే ఆలస్యం లేకుండా "నిన్ను నేను నా కార్యదర్శిగా నియమించుకుంటాను. నేను చేసే అన్ని పనులలో చేదోడు వాదోడుగా వుంటావు. నీవు చేసే అన్ని పనులలో చేదోడు వాదోడుగా నేనుంటాను" పలికాడు.

శైలజ సంతోషంతో రెండు చేతులను మనోహర్‌వైపు జూచి, "మీ లాంటి వారు భర్త నాకు దొరకడం నా అదృష్టం" అని పలికింది.

శైలజ రెండు చేతులను మనోహర్ గ్రహించి శైలజా! ఆ నాటి రాత్రి నిన్ను కాపాడి తీసికొని వచ్చినందులకు యీ శుభపరిణామం జరిగింది. దానికి ప్రతిగా నీవు నాకేమిస్తావు?" అని ప్రశ్నించాడు.

శైలజ ఒక క్షణం ఆలోచించి "తీయని స్నేహం" అని మనోహర్‌తో పలికింది.

మనోహర్ "మరి నీ తీయని స్నేహం ఎప్పుడు యిస్తావు?" అని పలికాడు.

శైలజ సిగ్గుతో తలవంచి, "మన పెళ్ళి అయిన మొదటిరాత్రి" అని పలికింది.

మనోహర్ కౌతుకంగా "అది ఏ విధంగా యిస్తావో వివరించు! వింటాను!" అని పలికాడు.

శైలజ మరింత సిగ్గుతో "చెప్పనా? శ్రీ జయదేవుని యష్టపదితో" అని పలికింది.

మనోహర్ మరింత కౌతుకంగా "ఏ అష్టపదితో?" అని ప్రశ్నించాడు.

శైలజ చిరునవ్వు నవుతూ-
"కురు యదునందన చందన శిశిర
తరేణ కరేణ పయోధరే" అని పలికింది.

మనోహర్ పకపకనవ్వి "అయితే ఇప్పటినుండే కస్తూరి, కాటుక, కుంకుమ, చందనము, లత్తుక, మొదలయినవి నేను సిద్ధము చేసికోవాలన్న మాట!" శైలజతో పలికాడు.

శైలజ సకౌతుకంగా "ఎందుకు?" అని ప్రశ్నించింది.

మనోహర్ శైలజతో "నీ అభినయానికి తగినట్లు పరిచర్య చేయడానికి!" అని పలికి ఆమె ముంగురులను ముఖముపై పడేటట్లు లాగాడు.

శైలజ కొంచెం కోపంతో "చాలిక సరసం!" అని ముంగురులను సరిదిద్దుకుంది.

ఆ సమయంలో భవాని "శైలజా!" అని కేక వేసింది. భవాని శైలజను చూచుటకు వచ్చినవారందరికి చందన తాంబూలాదులను ఇప్పించాలని ఆమె కోరిక.

భవానీ పిలుపుతో శైలజ బయటికి వెళ్ళడానికి సిద్ధపడింది. కాని మనోహర్ ఆమె రెండు చేతులు పట్టుకున్నాడు.

శైలజ కొంచెం కోపంతో "చేతులు వదలండి! అత్తయ్య పిలుస్తోంది" అని పలికింది.

మనోహర్ చిరునవ్వుతో "శైలీ! నీవు కోపించినప్పుడు నీ ముఖం ఎలా వుంటుందో నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు.

శైలజ మనోహర్ కళ్ళలోకి జూస్తూ "మీరే వర్ణించండి!" అని పలికింది.

మనోహర్ "నీవు కోపించినపుడు నీ ముఖం శోణపద్మం వలె వుంటుంది. ముడిపడిన కనుబొమలు భ్రమరమువలె ఎంతో సొగసుగా వుంటాయి" అని పలికాడు.

శైలజ మనోహర్‌తో "మీ వర్ణన యింకా చాలు" అత్తయ్య పిలుస్తోంది" అని చేతులు విదిలించుకుంటుంది.

మనోహర్ అభినయంతో జయదేవుని యీ క్రింది చరణం గానం చేస్తాడు.

చింతయామి తదాననం కుటిల భ్రు కోపభరేణ!
శోణపద్మ మివోపరి భ్రమతాకుల భ్రమరేణ!
హరి హరీ హతాదరతయా
సాగతా కుపితేవా!

శైలజ గ్రంథాలయం గది గుమ్మం దగ్గరకు వెళ్ళి ఒకసారి వెనుదిరిగి మనోహర్‌వైపు జూచింది. మనోహర్ గూడ శైలజవైపు జూశాడు. దూరంనుండి ఇద్దరు నవ్వుకున్నారు. రెండు రెండు నాలుగు కళ్ళు ఆ క్షణంలో కలిసి అనంతమైన ఆర్ద్రతను జూరగొన్నాయి. చిరునవ్వులు వన్నెన యిరువురి పెదవులు ఆనందాన్ని సంతరించుకున్నవి.

మళ్ళీ భవానీ పిలిచిన పిలుపుతో శైలజ బయట పడకుండా లోనికి వెళ్ళింది.

వరండా అంతటా చాపలు పరుపబడినవి. ఆ వీధిలో భవానీకి పరిచయమున్న స్త్రీలంతా శైలజను చూడడానికి వచ్చారు. కొంతమంది దూరపు బంధువులు కూడ వచ్చారు.

శైలజ ఆ స్త్రీలున్నచోటికి పోవుటకు క్రొత్త సిగ్గులు పోటులాడినవి. భవానీ శైలజను ఒక చాపమీద కూర్చోబెట్టింది. స్త్రీలంతా శైలజను జూచి, చందనపు బొమ్మనీ-కాదు బంగారు బొమ్మఅనీ ప్రశంసించారు.

భవానీ పూజాఫలంగా, నోముల పంటగా దొరికిన తపోఫలమనీ కీర్తించారు.

భవానీ శైలజతో ముత్తయిదువులందరికీ కాళ్ళకు పసుపు రాసింప జేసింది. నుదుట కుంకుమబొట్టు బెట్టించింది. గంధం పూయించింది.

వచ్చిన ముత్తయిదువులందరు శైలజను ఆశీర్వదించారు త్వరలో పెళ్ళికూతురవు గమ్మని మంగళాక్షతలు శిరస్సుపై జల్లారు. తథాస్తు అన్నట్లు మింటిచుక్కలు ఆ సంధ్యవేళలో మెరుస్తూ ముత్తయిదువులతోబాటు ఆశీర్వదించాయి.

# 13

కాలము అనంతమైనది. కాలగర్భంలో పండ్రెండు సంవత్సరముల కాలము త్రుటికాలము మాత్రమే! అయితే- ప్రతిక్షణం ప్రకృతిలో ప్రకృతి జీవులలో విపరీతమైన మార్పులు జరుగుతూ వుంటవి. ఆ మార్పును మనము గుర్తింపలేము.

అట్లాగే-నాయనిగారి కుటుంబంలో పండ్రెండు సంవత్సర కాలంలో క్రమక్రమంగా, ఒకదాని తరువాత ఒకటి జరిగినా గుర్తింపలేనంత మార్పు జరిగింది.

నాయనిగారు అనుకున్న ప్రకారం మనోహర్, శైలజల వివాహం తిరుపతిలో జరిగింది. నాయనిగారు బంధువులకు, మిత్రులకు ఒక పెద్ద విందు జేశారు. మనోహర్ బి.ఇడి. కోర్సు పూర్తిజేసి అగ్రశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. ఈలోగా శైలజ, ఇంగ్లీషు, హిందీ భాషలలో కొంత పరిచయాన్ని సంపాదించింది.

శైలజా మనోహర్‌లు తమ జీవితాలను ప్రజాసేవకు అంకితంజేయాలనుకున్నారు. శాస్త్రిగారు ఆశీర్వదించినట్లు తమ జీవితాలను తమకేగాక, లోకానికి వెలుగులు జిందించాలని నిశ్చయించుకున్నారు.

తాము ప్రజాసేవకు పూనుకునేముందు దేశమంతా పర్యటించి, ఉన్నతమైన సంస్థలు ఏ విధంగా పనిజేస్తున్నవో గమనించాలని తాము నిశ్చయించుకున్నారు. రెండు సంవత్సరము కాలము బ్రహ్మచర్యాన్ని అవలంబించాలని కూడా నిశ్చయించుకున్నారు.

శైలజా, మనోహర్‌లు ముందుగా తిరువణ్ణామలైలో వున్న రమణాశ్రమాన్ని సందర్శించారు. అచ్చట జ్యోతిర్లింగం వున్న ప్రసిద్ధమైన దేవాలయాన్ని గూడ దర్శించారు. తరువాత అచ్చటికి సమీపమునగల అరవిందాశ్రమాన్ని, అచ్చటి ఆశ్రమ నిర్వహణ పద్ధతులను తిలకించారు. దక్షిణదేశంలో వున్న మధుర మీనాక్షి, కంచి కామాక్షి, తిరుపతి, కాళహస్తి మున్నగు మహా క్షేత్రాలను దర్శించారు.

మహా బలిపురములో వున్న శిల్ప కళాఖండాలను దర్శించారు. మదరాసులో వున్న అడయారు కళాక్షేత్రాన్ని దర్శించి అచ్చటి విశేషాలను దెలిసికొన్నారు.

తరువాత తెలుగుదేశములో వున్న అనేక సేవా సంస్థలను, పుణ్యక్షేత్రాలను దర్శించారు. ముఖ్యముగా వారు రాజమహేంద్రవరం వెళ్ళి అచ్చట కీ శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు చేసిన సేవా విశేషాలను గురించి దెలిసికొన్నారు. గురజాడ, కొమర్రాజుల సాహిత్య సేవలను గురించి కూడ తెలిసికొన్నారు. గిడుగువారి భాషాసేవను గురించి రఘుపతి వెంకటరత్నం మున్నగువారి జీవిత విశేషములను తెలిసికున్నారు. తెలుగు

దేశంలో వున్న దివ్య పుణ్యక్షేత్రాలను, అపురూప శిల్ప కళాఖండాలను దర్శించారు. అరకులోయ, ఋషికుల్య మున్నగు ప్రకృతి మనోహర ప్రదేశాలను తిలకించారు.

ఈ విధంగా దక్షిణదేశ యాత్రను పూర్తిచేసికొని, ఉత్తర దేశంలో వున్న ప్రసిద్ధమైన సేవా సంస్థలను, పుణ్యక్షేత్రాలను, కళాఖండాలను, రమణీయ ప్రకృతి దృశ్యాలను వారు తిలకించి, గాంధీజీ స్థాపించిన సబర్మతీ ఆశ్రమాన్ని, వార్థాకు సమీపంలో వున్న గాంధీజీ చివరి రోజులలో నివశించిన సేవాగ్రామాన్ని తిలకించారు. గాంధీజీ ఉపదేశించిన వార్థా విద్యావిధానం ఏ విధముగా నిర్వహింపబడుతున్నదో పరిశీలించారు.

విశ్వకవి రవీంద్రుడు కలకత్తాకు సమీపమున స్థాపించిన విశ్వభారతిని దర్శించారు. అచ్చటికి సమీపమునగల దక్షిణేశ్వరమును దర్శించి; రామకృష్ణ మిషనువారి సేవాకార్యక్రమములను దర్శించారు. ఇంకా అనేక సేవా సంస్థలను దర్శించారు.

అంతేగాక, అజంతా, ఎల్లోరా, తాజ్‌మహల్ మొదలైన శిల్ప కళాఖండాలను. కాశీ, అయోధ్య ప్రయాగ మున్నగు పుణ్యక్షేత్రాలను దర్శించారు.

సుప్రసిద్ధ దేశభక్తురాలు, సంఘసేవకురాలు అయిన శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ హైదరాబాద్‌లో నిర్మించిన సేవాసంస్థలను దర్శించారు.

ఈ విధంగా శైలజా, మనోహర్‌లు భారతదేశమంతటా పర్యటించి ఉన్నతాశయములతో, ఉత్కృష్టలక్ష్యములతో యింటికి తిరిగి వచ్చారు. భవానీ, నాయనిగార్లు సంతోషించారు.

నాయనిగారు వృద్ధాప్యము మీదపడడంతో, తన యావదాస్థిని తమ కుమారునిపేర గావించారు. మధిరప్రాంతంలో వున్న స్థిరాస్థులుగాక, ఐదాలు లక్షల రూపాయలు గూడ మనోహర్ స్వాధీనం చేయబడింది.

అంతేగాక శైలజకు తల్లిదండ్రుల ఆస్థివుంది. శైలజ తల్లిదండ్రులకు సంతానము లేనందున వారి ఆస్థికూడ శైలజకు వచ్చింది. ఇప్పటివరకు

దానికి నాయనిగారు వ్యవహర్తగా వ్యవహరించారు. ఇప్పుడు దానినిగూడ శైలజకు స్వాధీనము గావించారు.

ఆ దంపతులిరువురు నాయనిగారి అనుమతితో ఆ ధనాన్ని ప్రజాసేవా కార్యక్రమాలకు వినియోగింప దలుచుకున్నారు. తమ సేవారంగాన్ని విజయవాడలో గాక తమ స్వగ్రామమైన తాటిపల్లిని యెన్నుకున్నారు.

తాటిపల్లెలో నాయనిగారికి 200 ఎకరాల భూవసతి వుంది. అది నాయని సంపాదించినది గాదు. వారి తాత-ముత్తాతలు సంపాదించినది. ఆ ప్రాంతము చాల వెనుకబడిన ప్రాంతము. ఆ ప్రాంతములో దక్షిణాఫ్రికాలో గాంధీజీ నిర్మించిన టాల్‌స్టాయ్ ఆశ్రమ పద్ధతిలో ప్రశాంతముగా జీవించుచు, సాధ్యమైనంత వరకు యితరులకు సేవజేయుటకు నిశ్చయించుకొన్నారు.

ఈ విషయమును మనోహర్ తల్లిదండ్రులకు దెలుపగా, వారు సంతోషముతో అంగీకరించారు.

ఒక శుభముహూర్తమున నాయనిగారి కుటుంబము విజయవాడ నుండి తాటిపల్లెకు చేరుకున్నది. నాయనిగారి కుటుంబము మళ్ళీ తాటిపల్లెకు రావడంతో బంధుమిత్రులు, ప్రజలు చాల సంతోషించారు. విజయవాడలో వున్న భవనాన్ని, స్వంత గ్రంథాలయాన్ని విజయవాడలో వున్న ఒక మహిళాసంఘానికి అర్పించారు. ఆ భవనంలో మిగతా భాగాన్ని అనాథ స్త్రీలకు ఆశ్రయం కల్పించమని నాయనిగారు వారికి వ్రాసియిచ్చారు.

మనోహర్, శైలజలు ముందుగా తాటిపల్లెలో వున్న తమ విశాలమైన భవనాన్ని పాఠశాలగా మార్చారు. తమ నివాసానికి నిమ్మతోటకు ప్రక్కన ఖాళీస్థలంలో ఒక మూడు-నాలుగు గదులతో తాటియాకుల పాకను నిర్మించుకున్నారు.

పాఠశాలను వృత్తివిద్యా పాఠశాలగా యేర్పాటుజేశారు. అచ్చటి బాలురు ఒకపూట చదువుకొనుచుందురు. ఒకపూట యేదైనా చేతిపనిని

నేర్చుకొందురు. 12 సంవత్సరములు బాలురకు వచ్చుసరికి ఏడవ తరగతి
పూర్తియగును. ఏదైనా ఒకవృత్తియందు ప్రావీణ్యము సంపాదించుటయును
జరుగును.

విద్యార్థులు ఆ గ్రామమునుండియే గాక చుట్టుపట్ల గ్రామములనుండి
కూడ విద్యార్థులు రాసాగిరి. చక్కని క్రమశిక్షణ, విశిష్టమైన బోధనాపద్ధతి,
మంచి అలవాటులు, వినయ విధేయతలు, దైవభక్తి, ఆటపాటలు మున్నగు
నవి ఆ పాఠశాలయొక్క ప్రత్యేకతలు. అట్లే వృత్తివిద్యలు నేర్పుటకు
గూడ చక్కని యేర్పాటులు గావింపబడెను. గ్రామములోగల ప్రావీణ్యము
గల చేతివృత్తి కళాకారులచే బాలురకు చక్కని శిక్షణను ఇప్పించు
చుండిరి.

అంతేగాక బాలురు చేతిపనులు నేర్చుకొను సమయమున శైలజ బాలి
కలకు సంగీత నాట్యకళలలో శిక్షణనిచ్చుచుండును. ఈ విధముగా ఆ పాఠ
శాలయందు లలిత కళలకు గూడ ప్రాధాన్యము యేర్పడినది. విద్యార్థులకు
మధ్యాహ్న భోజనముగూడ యేర్పాటు చేయబడినది. వీరుచేయుచున్న సేవా
కార్యక్రమమునకు గ్రామప్రజలు సంపూర్ణ సహకారము నిచ్చుచుండిరి.
వారిని వేనోళ్ళ కీర్తించుచుండిరి. భవానీ నాయనిగార్ల సంతోషమునకు మేర
లేదు.

మనోహర్, శైలజల సేవాకార్యక్రమమును చంద్రకళ, సుధాకర్‌లు
వినిరి. చంద్రకళ యం. బి. బి. యస్. పూర్తిజేసి విదేశములలో ప్రసూతి
కోర్సును ఒక సంవత్సరము శిక్షణపొంది వచ్చినది. చంద్రకళ వరంగల్లులో
స్వయముగా ఒక ఆసుపత్రిని నిర్వహించుచున్నది. చంద్రకళ భర్తపేరు
కరుణాకర్. అతడు ప్రభుత్వ వ్యవసాయ శాఖలో ఉద్యోగి.

సుధాకర్ కూడ బి. యిడి. కోర్సు పూర్తిచేసిన తరువాత కాజీపేటలో
ఒక ఉన్నత పాఠశాలను స్వయముగా నడుపుచుండెను.

అన్నా-చెల్లెలు సుధాకర్, చంద్రకళలు ఇద్దరు ఒకనాడు మనోహర్
శైలజలను జూచుటకు తాటివల్లె వచ్చిరి. మనోహర్, శైలజల సేవాభావము

వారి ఆశ్రమ జీవనపద్ధతి వారిని ముగ్ధులను గావించినది. చంద్రకళ యిచ్చట నివసించి బీదప్రజలకు తన వైద్యసహాయముద్వారా సేవజేయుచు తన జీవితము ధన్యము గావించుకొనవలెనని భావించినది. భర్తతో యీ విషయము దెలిపినది.

చంద్రకళ భర్త కరుణాకర్. ఆమె అభిప్రాయమును అంగీకరించుటయేగాక, తానుగూడ యీ సత్కార్యమునందు మనోహర్‌కు జంటగా నుండవలెనని ఆశించెను. ఆ సతీపతులిరువురు చంద్రకళా, కరుణాకర్‌లు శైలజా, మనోహర్‌లతో కలిసి సేవజేయుటకు తాటిపల్లె విచ్చేసిరి. కరుణాకర్ వ్యవసాయ శాఖలోగల తన ఉద్యోగమునకు రాజీనామా యిచ్చెను.

చంద్రకళ ఆధ్వర్యములో ఒక ప్రసూతివైద్యశాల తాటిపల్లెలో ఏర్పాటు చేయబడెను. తాటిపల్లె ప్రజలకేగాక చుట్టుపట్లనున్న గ్రామముల ప్రజలకుగూడ వైద్యసహాయము అందజేయుచుండిరి. ఆ వైద్యశాలలో స్త్రీలకు ప్రసూతిసౌకర్యము గూడ గలదు. చంద్రకళ రాత్రింబవళ్ళు వైద్యశాలకు వచ్చు రోగులకు ఉచిత వైద్యసహాయము అందజేయుచుండెను.

చంద్రకళ, కరుణాకర్‌లు ఆశ్రమమునకుగల రెండువందల ఎకరములతోబాటు మఱి రెండువందల ఎకరముల భూమిని ఖరీదు చేసిరి. నవీన పద్ధతులతో వ్యవసాయము జేయుచు గ్రామప్రజలకు నవీన వ్యవసాయ పద్ధతులను బోధించుచుండెను. కొద్దిరోజులలో తమ ఆశ్రమానికి వున్న నాలుగు వందల ఎకరాలలో సమిష్టి వ్యవసాయాన్ని ప్రారంభించాలని కరుణాకర్ ఆశయం. దానికి రూపకల్పన చేయడానికి పూనుకున్నాడు.

కాజీపేటనుండి సుధాకర్ కూడ తనభార్య పద్మజతోవచ్చి కొన్నాళ్ళు ఆశ్రమప్రాంతంలో వుండి, ఆశ్రమ కార్యక్రమాలలో పాల్గొనుచు తిరిగి పోతూ వున్నారు.

ఇదేవిధంగా పాతమిత్రులు, యింకా ఆశ్రమ ప్రశాంత జీవన పద్ధతులను, వాతావరణాన్ని గాంచి, కొన్ని కుటుంబములు వీరితో నివసించుటకు విచ్చేసిరి.

ఆశ్రమము ఒక అనాధ బాలికా వసతి గృహమును ఏర్పాటు చేయబడినది. తల్లిదండ్రులులేని దిక్కులేని పసిపాపలకు యీ గృహమందు ఆశ్రయమిస్తారు.

అంతేగాక ఒక అనాధ యువతీ శరణాలయమును గూడ యేర్పాటు చేయబడినది అచ్చట వారికి చేతివృత్తులు నేర్పబడుతూ వుంటవి. నూలు వడుకుట, బట్టలుకుట్టుట, నేతపని మున్నగువానిలో శిక్షణనిచ్చి వారు స్వయముగా జీవించుటకు తగిన శక్తిని, సామర్థ్యమును గలిగించుటయే ఈ యువతీ శరణాలయముయొక్క లక్ష్యము. వారా పనులలో సమర్థులై తమ కాళ్ళమీద తాము బ్రతక నేర్చినవారై వెడలిపోవుదురు.

ఆడంబరము, పేరు ప్రఖ్యాతులకు గాకుండ, సేవామాధుర్యంతో జీవితం ధన్యం గావించుకోవడమే యీ ఆశ్రమ నిర్వాహకుల లక్ష్యం. ఇచ్చట ధనమునకుగాని, అధిపత్యమునకుగాని విలువలేదు. అందరు తమకు తగిన పనులను జేయుచు, తమకు కావలసిన వస్తువులను మితముగా వినియోగించుకొనుట యీ ఆశ్రమమునందలి నియమము. ఉదయ-సాయంత్రములు ఆశ్రమమునందు భక్తిప్రార్థనలు జరుపబడుతూ వుంటవి. అటులే సర్వమత ప్రార్ధనలు జరుపబడుతవి.

ఎంతోమంది ధనవంతులు, దాతలు ఆశ్రమమునకు విరాళముల విచ్చుటకు ముందునకు వచ్చిరి. కాని తీసికొనుటకు నిరాకరించిరి. ప్రభుత్వము గూడ పెద్దమొత్తముల నిచ్చుటకు ముందునకు వచ్చినది. ఆశ్రమ నిర్వాహకులు వలదనిరి.

సేవారంగము విస్తృతమయిన కొలది బలహీనత యేర్పడుననియు, ధనము ప్రాధాన్యత వహించునపుడు అవినీతి గూడ తొంగిజూచుననియు భావించి, అట్టి ధనమునకు దూరముగా నిలిచిరి.

ఆశ్రమ నిర్వాహణము, భావము, ఎట్టి ఒడిదుడుకులు లేకుండా మనోహర్, కరుణాకర్‌లు నిర్వహించుచుండిరి. విశాలమైన వటవృక్షము అనేక పక్షులకు వాసయోగ్యమైనట్లుగా మనోహర్, శైలజలు నాటిన ఫల వృక్షము పువ్వులు పూచి, కాయలుకాచి, మధురఫలములను నిచ్చుచుండెను.

ఇతర గ్రామముల పెద్దలు, ముఖ్యంగా యువకులు దోపిడివ్యవస్థకు దూరంగావున్న ఇట్టి గ్రామనిర్మాణమును జూచి, తాముగూడ యిట్టి గ్రామ నిర్మాణములకు పూనుకొనిరి. అభివృద్ధి ఎంత దూరంలోవున్నా సరే-దోపిడి పీడన లేని గ్రామవ్యవస్థకు పూనుకొనిరి.

* * * *

ఈ విధముగా పదిసంవత్సరములకాలము సేవారంగములో మనోహర్, శైలజలకు గడిచిపోయినవి. వారికి ఒక కుమారుడు, కుమార్తె గలిగిరి. కుమారుని పేరు ఆనంద్. ఐదు సంవత్సరముల వయస్సు. కుమార్తె పేరు అరుణ. మూడు సంవత్సరముల వయస్సు. వారు ఆశ్రమప్రాంతమునందు దిరుగుచు ఆశ్రమవాసులను తమ ముగ్ధమోహనరూపములతో ఆనంద పరవశులను జేయుచుండురు.

# 14

ప్రస్తుతము శైలజ ఒక విపరీతమైన వ్యాధితో బాధపడుచున్నది. అతిభయంకరమైనది. నోటితో ఉచ్చరించుటకుకూడ కూడనిది. క్షయవ్యాధి అని డాక్టర్లు నిర్ణయించిరి. ఆమె ఎక్కువకాలము బ్రతుకదనిగూడ హెచ్చరించిరి. ఏదైనా ఆరోగ్య ప్రదేశమునకు తీసికొనివెళ్ళమని సలహాయిచ్చిరి. మనోహర్ గూడ శైలజను ఒత్తిడిజేసెను. కాని శైలజ వినలేదు. తనకు జీవితంమీద ఆసక్తిలేదని, తాను యిచ్చటే- ఈ పర్ణకుటీరంలోనే మరణించవలయునని మనోహర్‌తో పలికింది. మనోహర్‌కు కళ్ళనిండా నీరు నిండి జలజల రాలినవి.

ఈ వ్యాధి శైలజకు ఏ విధంగా వచ్చింది? ఎందుకు వచ్చింది? అన్న విషయానికి పూర్వగాథ వుంది.

పన్నెండు సంవత్సరాల క్రిందట శైలజను పెంచిన పరిమళం శైలజను నాయనిగారి ఇంట్లో వదిలి, రంగడితోబాటు వరంగల్లు వెళ్ళింది. కొన్ని నెలల తరువాత రంగడికేదో జబ్బువచ్చి, మరణించడం జరిగింది.

తనకిప్పుడు దిక్కెవ్వరు? పరిమళం ఆలోచించింది. శైలజ పంచన వుండి ప్రాణాలను వదలాలనుకుంది. తనకున్న ఆస్తినంతా సానివాడలో వున్న పిల్లలకు పంచిపెట్టింది. కొన్ని కుట్టుమిషనులు కొని, కొందరికిచ్చి, సానివృత్తిని మాని కుట్టుపని చేసి జీవించమని కోరింది. ఇప్పుడు తనకున్నది ఒక్క భగవంతుడు మాత్రమే!

తరువాత పరిమళం శైలజ దగ్గరకు వెళ్ళాలనే ఉద్దేశం కూడా మార్చుకుంది. ఆమె ప్రశాంత జీవితంలోనికి తాను వెళ్ళి, ఆమెకు కలత గలిగించకూడదనుకుంది. తన భవనాన్నంతా ఒక వ్యాపారసంస్థకు అద్దెకు యిచ్చింది. నెలకు ఐదువందల రూపాయలు అద్దె యిస్తారు. ఆ భవనానికి వెనుకనున్న శిథిలమైన గదిలో, అదివరకు శైలజ చదువుకున్న గదిలో నివసించడం మొదలుపెట్టింది. ఒక అనాథను దగ్గరకుతీసి, ఆమె సాని వృత్తిని మాన్పించి, తనకు వండిపెట్టి, తనకింతబెట్టి, తానింత తినమని కోరింది. ఎప్పుడూ- భగవద్భక్తితోను, శైలజను దలుచుకుంటూను కాలం గడిపేది.

శైలజకు పరిమళం యొక్క పూర్వాపరాలు తెలిసినా మాతృ స్నేహం వుండేది. ఆమె విజయవాడ నుండి వరంగల్లు వెళ్ళిపోతూ- "అమ్మా శైలజా! అప్పుడప్పుడు వచ్చి, నన్ను చూచిపోతుంటావా తల్లీ!" అన్నమాటలు, ఆమె జలజలరాల్పిన కన్నీళ్ళు తనకు దర్శనమిచ్చేవి.

నెలకు, రెండు నెలలకు ఒకసారి మనోహర్‌ను వెంటబెట్టుకొని, పరిమళాన్ని జూడడానికి వరంగల్ వెళుతూ వుండేది. సుధాకర్‌ను చూడాలనే వంకతో శైలజా, మనోహర్‌లు ఒకటి రెండు రోజులు వరంగల్‌లో వుండి తిరిగి వచ్చేవాళ్ళు.

శైలజా, మనోహర్‌లు పరిమళాన్ని తమ దగ్గరకువచ్చి వుండమని కోరారు. అంతకయితే అనాథ స్త్రీ శరణాలయంలో నివసించమని కోరారు.

గాని పరిమళం ఒప్పుకోలేదు. తాను అక్కడ వున్నట్లయితే శైలజకు గత జీవితం స్మృతికి వస్తుందనీ, తద్వారా ఆమె ఆనంద జీవితానికి భంగం వాటిల్లుతుందనీ, కావున తాను వారికి దూరంగా వుండడమే మంచిదని ఆమె భావించింది.

చివరి రోజులలో పరిమళానికి పక్షవాతంవంటి ఒక జబ్బు వచ్చింది. ఆ విషయం శైలజ, మనోహర్‌లకు తెలిసి, వారు ఆమెను తమ ఆశ్రమానికి తీసికొనివచ్చారు.

పరిమళానికి శైలజ స్వయంగా సేవజేసేది. 'అమ్మా' అని పిలిచేది పరిమళాన్ని. శైలజ పరిచర్యలకు, మాతృస్నేహంతో పిలిచే పిలుపులకు పరిమళానికి ఆనందలోకాలలో విహరించినట్లుండేది. పరిమళం తన చివరి ఘడియలలో శైలజను తన నొసలు ముద్దు పెట్టుకొని 'అమ్మా'యని పిలవమని కోరింది. అదేవిధంగా శైలజ పరిమళం నొసలు ముద్దు పెట్టుకొని "అమ్మా"యని పిలిచింది. ప్రాణాలు వదిలింది పరిమళం!

పరిమళం అంత్యక్రియలు శైలజ స్వయంగా నిర్వహించింది. పాంచ భౌతికమైన పరిమళం యొక్క అంగాంగములు అగ్నిలో జ్వలిస్తూ వేశ్యా జీవితము యొక్క వేదనాపూరితమైన మూలుగులా అన్నట్లుగా ఆమె చితి నుండి చిటపట శబ్దములు బయలుదేరినవి. ఆ వేదనల చిటపటలు శైలజ హృదయమును [illegible], అచటినుండి కన్నులలో ప్రవేశించి, అశ్రువులుగా [illegible] బహిర్గతమైనవి.

పరిమళం మరణించి దాదాపు రెండు సంవత్సరాలయింది. ఆమె [illegible] శైలజ పూర్తిగా మారిపోయింది. ఆమె నిరంతరం అనాథ [illegible] శరణాలయంలోనే కాలం గడిపేది. ఇతర కార్యక్రమాలలో [illegible] ఆసక్తి కనబరచడంలేదు.

[illegible] అనాథ యువతులను సహాయంగా తీసుకొని, అనేక పట్ట[illegible] తిరిగేది. అప్పటవున్న సానివాడలు, వ్యభిచార గృహాలకు వెళ్ళి, వారి దుఃఖపూరితమైన విషాదగాథలను వినేది. బాధాభరితమైన కన్నీళ్ళను [illegible].

"ఒక్క రూపాయకు మానమమ్ముకుని జీవించే స్త్రీలను, ఆ పూట తిండికి శరీరమమ్ముకునే స్త్రీలను జూచింది. పొట్టకోసం బాలెంతలైన స్త్రీలు, పసిపాపలను ప్రక్క గదిలో నిద్రబుచ్చి తమ శరీరాలను కాపుదారులకు అప్పగించే దీనురాండ్రను జూచింది. వీధిలో గుడిసెలు వేసుకొని, ఇల్లూ, వాకిలి లేకుండా పడుపు వృత్తి జేస్తూ పొట్టబోసుకునే అనాధ స్త్రీలను గాంచింది. ఈ విషాదదృశ్యాలు ఆమె హృదయాన్ని ఛేదించినవి. ఛేదించి నవి. ఈ దృశ్యాలన్నీ తన చిన్నతనంలో జూచినవే. తాను పెరిగిన పాలి వాడలో చూచినవే! కాని ఆ సమయంలో, బాల్యంలో తనకేమీ తెలియలేదు. జ్ఞానోదయం కాలేదు.

కాని ప్రస్తుతం యుక్తవయస్సు వచ్చిన తరువాత మనోహర్‌తో సేవారంగంలో ప్రవేశించిన తరువాత జ్ఞానోదయం గలిగింది. వారు పడే కష్టాల లోతుపాతులు తెలిసినవి. వారిలో చాలామందీ వష్టజాతకులు. తిండికి లేనివారు. రోగిష్టులు. నా అనేవారు లేనివారు. అభాగ్యులు. మృత్యువును ఆహ్వానించేవారు. జీవితంలో మరే ఆశలు లేనివారు. భర్తచేత, బంధువుల చేత త్యజింపబడినవారు. తిరస్కరింపబడినవారు.

వేశ్యాలలో కొద్దిమంది శ్రీమంతులను గూడ జూచింది. తమ అంద చందాలను ఎరవేసి, ధనవంతులైన యువకులను లోబరచుకొని, వారి భార్యాపిల్లలు ఘోషబడుతుండగా వారి యిల్లూ, వళ్లూ గుల్ల జేసే దిరా మణులు, సీతాకోకచిలుకలు గూడ కొంతమంది వున్నారు. అయితే అటు వంటివారు బహు కొద్దిమంది. వారు కూడా తమ చివరిదశలో పరిమాణంగాను పశ్చాత్తాపం అనే అగ్నిలో దగ్ధమవుతూ వుంటారు. వారి ఆస్తిపాస్తుల్ని ఇతరులు అపహరింపగా వీధుల్లోబడి మరణిస్తుంటారు.

ఈ నగ్నసత్యాలు, దృశ్యాలు శైలజలో వేదన గలిగించినవి. తాను స్త్రీ జాతిలో ఎందుకు పుట్టానా?" అని బాధపడేది.

ఇటువంటి స్త్రీలున్న సమాజంలో నన్ను ఎందుకు పుట్టించావు భగవంతుడా? అని వేదన చెందేది. ఆమె హృదయం కందిపోయింది. గాయపడింది. ద్రవించిపోయింది.

ఎంతోమంది స్త్రీలను తన అనాథ యువతీ శరణాలయానికి తీసికొని వచ్చింది. ఎంతోమందికి కుట్టుమిషనులు కొని యిచ్చింది. చేతిపనులు నేర్పించింది. ఉపాధులు కల్పించింది. ఏ పల్లెటూరికో పోయి ప్రశాంతంగా జీవింపమని కొంత ధనసహాయం చేసేది.

ఏ చిన్న పట్టణంలో జూచినా ఆమెకు సానివాడలు గనిపించినవి. నటనాపూరితమైన వారి చిరునవ్వుల వెనుకే దుర్భరమైన వేదనలు, రోదనలు ఆమెకు కన్పించినవి. ఆమె ఎందరినని ఆదరింపగలదు? ఎందరినని వేదన దీర్చి సముద్ధరింపగలదు.

శారీరకంగా, మానసికంగా ఆమె చాలా అలసిపోయింది. ముఖ్యంగా ఆమె హృదయం దెబ్బతింది. గాయం మాన్పరానిది గదా.

ఆమె పర్యటనలు, పరిశోధనలు తగ్గించుకొన్నది. ఆమెకు ప్రస్తుతం రోజూ జ్వరం వస్తూ వున్నది. అయినా ఆమె మనస్సుకు శాంతిలేదు. తనలాంటి ఒకరిద్దరి సంఘసేవికల ఓదార్పుల వలన యీ దురాచారం మాసిపోదనీ, విప్లవాత్మకమైన మార్పులు, సంఘంలో వచ్చినప్పుడే ఈ దురాచారము మాపుట సంభవమని గ్రహించింది. ముఖ్యంగా చంద్రకళ జెప్పినట్లు సమాజంలో ఆర్థిక వ్యవస్థ మారినప్పుడే ఇట్టి దురాచారములు ఆపవచ్చుననీ అర్థం జేసుకుంది. ప్రభుత్వం, ప్రజలు యీ దుష్టదురాచారాన్ని మాపినప్పుడే సంఘం బాగుపడుతుందని ఆమె అర్థం చేసుకున్నది. అయినా ఆమె వేదన చల్లారలేదు; హృదయం శాంతిని బొందలేదు. కన్నీటి ధారలు ఆగలేదు.

నాయనిగారి కుమార్తె భారతి. ఆమెకు ఫణిభూషణరావుతో వివాహం జరిగింది. ఫణిభూషణ్ ఒక ఇంజనీరు. కొత్తగూడెం బొగ్గుగనులలో పని చేస్తుంటారు. అక్కడికి దాపున కిన్నెరసాని ఏటి ఒడ్డున ఒక గ్రామంలో వారి నివాసం. ఉద్యోగరీత్యా వారు కొత్తగూడెంల్లో వుంటూ వున్నారు.

వారి గ్రామం పేరు రామగిరి. రామగిరికి దాపున ఒక గుట్ట వుంది. దాని ప్రక్కనుండి కిన్నెరసాని ఏరు ప్రవహిస్తూ వుంటుంది. అచ్చట వారికి కొంత భూవసతి, ఒక భవనం వుంది.

కుమారుడు, కోడలు ఆ విధంగా సేవా కార్యక్రమంలో వుంటే, వారికిఅడ్డుగా వుండగూడదని నిశ్చయించుకుని, మనోహర్ తల్లిదండ్రు లిద్దరూ అచ్చటికి జేరుకోవడం జరిగింది. నాయనిగారు రోజులో చాలా సమయం ధ్యానంలో సమయం గడుపుతూ వుంటారు. ఆయన భార్య పూజా వ్రతాలతో గడుపుతూ వుంటుంది. నౌకరు రాముా దంపతులు వారికి సేవ జేస్తూ వుంటారు. కొత్తగూడెం అక్కడికి దగ్గరే కాబట్టి వారానికి రెండు మూడుసార్లు భారతి తండ్రిని వచ్చి చూచిపోతూ వుంటుంది. కుమారుడు మనోహర్ కూడా వచ్చి చూచిపోతూ వుంటాడు. కాని నౌకరు రాముా అతని భార్య నిరంతరం వృద్ధులైనవారిని వదిలిపెట్టకుండా సేవజేస్తూ వుంటారు. అచ్చట వున్న భవనాన్ని వారు ధ్యానమందిరంగా మార్చు కున్నారు.

వారు వేదన జెందుతారనే భావంతో మనోహర్ శైలజ సంగతి ఇంకేమీ తెలుపలేదు.

శైలజ బాగానే వున్నదనీ, సేవా కార్యక్రమాలు చక్కగా చేస్తున్న దనీ వృద్ధులైన తల్లిదండ్రులకు ఆ రామగిరి వచ్చినప్పుడు చెప్పేవాడు. చాటుకు వెళ్ళి కన్నీళ్ళు పెట్టుకునేవాడు.

శైలజకు జ్వరంతోబాటు దగ్గు కూడా వస్తూ వుంది. మనోహర్, చంద్రకళలు విశ్రాంతి దీసుకోమని ఎంత చెప్పినా వినదు. విజయవాడ మాచవరంలో వున్న తమ గృహాన్ని అనాధ యువతీ శరణాలయముగా మార్చమని భర్తను కోరింది.

మనోహర్ అదేవిధంగా ఆ భవనాన్ని అనాధ యువతీ శరణాలయంగా మార్చివేశాడు. అచ్చట అనాధ యువతులకు ఉపాధి కల్పనకు తగిన వృత్తులు నేర్పి, కొంత ధనమిచ్చి స్వయంగా జీవించే శక్తిని గలుగజేస్తారు. ఈ బాధ్యతను మనోహర్ తన మిత్రుడైన కుమారస్వామికి అప్పగించాడు. ఈ దురాచారం సంఘంలో ఒక అగ్నిపర్వతంలాంటిది. ఒకరిద్దరు నీళ్ళుజల్లి చల్లార్చేది కాదుగదా!

శైలజకు యీ విధంగా రోజూ జ్వరం వస్తూవున్నా విశ్రాంతి తీసికొనేదికాదు. తన పర్యటనలు కొనసాగిస్తూనే వుంది. అనాధల కష్టసుఖాలు తెలుసుకుంటూనే వుంది. వారి రోదనాశ్రువులు తుడుస్తూనే వుంది. కొన్నాళ్ళకు ఆమెకు పర్యటనలుజేసే శక్తిగూడ తగ్గిపోయింది. ఆశ్రమంలోనే ఆమె ఆవాసం.

మనోహర్ కిన్నెరసాని యేటివొడ్డున ధ్యాన మందిరంలోవున్న వృద్ధులైన తన తల్లిదండ్రులకు తెలియజేస్తాననీ, వారిని తీసుకుని వస్తానని శైలజతో పలికాడు. కాని ఆమె వృద్ధులైన వారిని కష్ట పెట్టవద్దనీ, శైలజ అనాధశరణాలయంలో బాగా పనిచేస్తున్నదని, తెలియజేయవలసిందనీ కోరింది. పోనీ నిన్నక్కడకు తీసికొనివెళతాననీ ఆరోగ్యం కుదుటబడిన తరువాత మళ్ళీ మనం వద్దామని మనోహర్ పలికాడు. కాని ఆమె ఒప్పుకోలేదు. నీసేవా కార్యక్రమం ఆగిపోతుందనీ, దానికి భంగం గలుగుతుందనీ దానికి తాను అంగీకరింపననీ పలికింది. ఆమె మాటప్రకారం వేదనతో ఆగిపోయాడు. వృద్ధులైన తల్లిదండ్రులకు తెలియబరుపలేదు.

తాను యింక ఎంతోకాలము బ్రతుకనని భావించింది. శైలజకు పదిరోజుల నుండి మంచంమీదనుండి లేవడమే కష్టంగా వుంది. ఐదేళ్ళ కుమారుడు ప్రభాకర్, మూడేండ్ల కుమార్తె అరుణను చంద్రకళకు అప్పగించి, వీరే బారమని పలికింది.

చంద్రకళ కన్నీరు తొలుకుతూ "నీ పిల్లలకేమీ భయంలేదు వదినా! నా పిల్లలమాదిరిగా చూచుకుంటాను. నీవు వేదనబడకు. విశ్రాంతి తీసుకో" అని గద్గద స్వరంతో పలికింది.

భర్తను జేరబిలిచి తాను ఒకవేళ మరణించినట్లయితే బాధపడ

వద్దనీ, ఆశ్రమ కార్యక్రమములో ఆసక్తి తగ్గించుకొవద్దనీ కోరింది. అటు వంటి మాటలు పలుకవద్దని శైలజ నోటిమీద తన హస్తమునుంచి, పొంగి పొరలివచ్చే దుఃఖాన్ని ఆపుకున్నాడు మనోహర్.

ప్రస్తుతం శైలజకు చంద్రకళేగాక ఖమ్మం నుండి క్షయవ్యాధికి స్పెషలిస్టు అయిన డాక్టరు కూడ ఆమెకు చికిత్స చేస్తూవున్నాడు. కాని ఆమెలో మార్పులేదు. క్రమ క్రమంగా మృత్యుదేవతా సాన్నిధ్యానికి ఒక్కొక్క మెట్టు ఎక్కుతున్నదా అని అనిపిస్తున్నది.

ఆరోజు కార్తీకపూర్ణిమ. ఆ రాత్రంతా పండువెన్నెలలో ప్రకృతంతా పరవశంతో వింతశోభలు విరిసిన రాత్రి.

ఆ రోజంతా శైలజకు దగ్గు తెరమీద దగ్గుతెర వస్తూనే వుంది. ఆమె ఎంత బాధపడుతున్నా, బాధలేనట్లు నటిస్తూనే వుంది. చిరునవ్వులు చిందిస్తూనే భర్తను బయటకు వెళ్ళి నిద్రింపమని చెప్పింది.

మనోహర్ శైలజతో "శైలజా! మరణ సమయంలో కూడ నా దగ్గర నటిస్తున్నావా?" అని కన్నీళ్ళు జలజల రాల్చుతూ ప్రశ్నించాడు.

శైలజ మనోహర్ కన్నీళ్ళను తుడుస్తూ "ఒకప్పుడు మీతో నటి కాను. జ్ఞాపకం వుందా? మీ కోసం నేను మరణపర్యంతం శైలూషివిగా నటిస్తాను" అని జ్ఞాపకం వుందా?" అని ప్రశ్నించింది.

మనోహర్ "జ్ఞాపకం వుంది" అని ఆమె ముఖాన్ని తన రెండు చేతులతో తామరపూవు మాదిరిగా పట్టుకున్నాడు.

శైలజ మనోహర్ రెండు చేతులను త్రోసివేయకుండా "ఒకప్పుడు నా ముఖాన్ని శోణపద్మంగా వర్ణించేవారు. ఇప్పుడెలా వుంది?" అని ప్రశ్నించింది.

మనోహర్ "కొంచెం రంగు మారింది. శ్వేతపద్మంలా వుంది. అయినా నా హృదయంలోవున్న నీ ముఖం శోణపద్మంలా అలానే [illegible] వుంది (అది రంగు మారదు.)" అని పలికాడు.

శైలజ తన ముఖాన్ని పట్టుకున్న మనోహర్ చేతులను తన చేతులలో దీసికొని "ఏమండీ! నేను మిమ్మల్ని ఒక కోరికను కోరతాను! తీరుస్తారా?" అని ప్రశ్నించింది.

"ఏమిటది?" అని మనోహర్ ఆతురతగా ప్రశ్నించాడు.

"నేను ఇంకా ఎన్నోరోజులు బ్రతుకను! నేను చనిపోయిన తరువాత నాకొరకు దుఃఖింపనని మాట యివ్వండి" అని కన్నీళ్ళతో శైలజ పలికింది.

"శైలజా! నీవు నా హృదయాన్ని ఎప్పుడో కాదు, ఇప్పుడే ముక్కలు ముక్కలు జేస్తున్నావు. హృదయం అంటూ వుంటేగా అప్పుడు నేను దుఃఖించడానికి" అని పలికాడు.

"సరే! మీకు నేను వేదనను గలిగింపను. నాకు నిద్రవచ్చేటట్లు ఒక మధురగీతాన్ని పాడండి" అని పలికింది.

మనోహర్ జయదేవుని భక్తిగీతాన్ని ఒకటి మందస్వరంతో పాడతాడు. శైలజ నిద్రించింది. ఆమె ప్రశాంత ముఖారవిందాన్ని జూస్తూ కన్నీటి ధారలనెన్నో తొణికాడు.

చంద్రకళ రాత్రులు గూడ అప్పుడప్పుడు వచ్చి, శైలజను పరీక్షించి పోతూ వుండేది. ఆనాటిరాత్రి ఒంటిగంటకు నర్సుతో గలిపి శైలజ గదికి వచ్చింది. మనోహర్ దుఃఖ సముద్రంలో మునిగి వుండటం గమనించింది.

మనోహర్‌కు ధైర్యం జెప్పి. తాను నరుసు శైలజ గదిలో పడుకుంటామని జెప్పి, మనోహర్‌ను ముందు వసారాలో పడుకోమన్నారు. చంద్రకళ, నరుసు, శైలజ వున్న గదిలో పడుకున్నారు. మనోహర్ ముందు వసారాలో పడుకున్నాడు.

ఆ రోజు రాత్రంతా పండు వెన్నెలలాగా వుంది. చంద్రుడు పడమట అస్తమింపబడుతున్నాడు. దూరాన జెగ్గురు పక్షులు అరుస్తున్నవి. ఉదయ సంధ్యలు ఒక్కొక్కటి తూర్పున వికసిస్తున్నవి.

శైలజకు మెలకువ వచ్చింది. లేచి చూచింది. చంద్రకళ, నరుసు పడక కుర్చీలలో పడుకుని వున్నారు. మనోహర్ ఎక్కడ వున్నాడా? అని వెదికింది. బయట వసారాలోకి నెమ్మదిగా వచ్చి చూచింది. భర్తకూడ ఒక పడక కుర్చీలో పడుకుని నిద్రబోతున్నాడు.

శైలజ దగ్గరకు వచ్చి, అతని ముంగురులను కదిపి "మనోహర్!" అని పలికింది.

మనోహర్ ఒక్కసారి ఆ పిలుపుతో అదిరిపడ్డాడు. ఆ స్త్రీ మూర్తి ఎవరా అని పరికించాడు. శైలజ!

శైలజ గత పదిరోజులనుండి మంచంమీద నుండి లేవలేక ఇతరుల సహాయంతో లేస్తూ వుండేది. ఈ విధంగా ఒంటరిగా తన దగ్గరకు రావడం జూచి మనోహర్ ఆశ్చర్యం చెందాడు. మనోహర్ వెంటనే లేచి తన పడక కుర్చీలో కూర్చోబెట్టడానికి ప్రయత్నించాడు. కాని శైలజ కూర్చోనడానికి బదులు మనోహర్‌తో-

"మనోహర్! నాకు ఉదయ సంధ్యల అరుణారుణ కాంతులను చూడాలనిపిస్తూ వుంది. దిగంతాలలో వున్న స్వర్ణకాంతులతో నా కళ్ళు కల పాలని వుంది. మంచం ప్రక్కన వున్న అరుగుమీదికి నన్ను తీసికొని వెళ్ళండి" అని పలికింది.

మనోహర్ శైలజను వెంటనే ముందు వసారా ప్రక్కన వున్న అరుగుమీదికి నడిపించుకుని వెళ్ళబోయాడు. కాని శైలజ అడుగు వేయలేక పోయింది. మనోహర్ వెంటనే రెండు చేతులతో ఎత్తుకుని బయట వసారా ప్రక్కన అరుగు మీదికి తీసికొని వచ్చాడు. అక్కడ వున్న ఒక వాలు కుర్చీలో కూర్చోబెట్టాడు.

శైలజ దృష్టిని సారించింది. పడమటి చంద్రాస్తమయకాంతులు ఒక్కటొకటిగా మాయమైపోతున్నవి. ప్రాగ్దిశాభాగం అంతా స్వర్ణకాంతులు వెల్లివిరుస్తు వెల్లివిరుస్తున్నవి. దూరంగా వున్న తాటిచెట్ల వింతశోభలు వెల్లివిరుస్తు స్తున్నవి.

శైలజ ఉదయ సంధ్యలను మనోహర్‌కు చూపిస్తూ "మనోహర్! నేను అరుణ కాంతులలో కలిసిపోవాలని వుంది. ఏవెప్పుడయినా నన్ను చూడదలుచుకుంటే ఆ అరుణ రేఖల్లో చూడగలవు!" అని కన్నులు మూసు కుంది. ఆమె శ్వాస వేగంగా కొట్టుకుంటూ వుంది.

ఆ సమయంలో మనోహర్‌కు ఏమీ తోచలేదు. "శైలజా!" అని

ఒక పెద్ద కేకవేశాడు. ఇంతలో లోపల వున్న డాక్టరు చంద్రకళ, నరసు ఇద్దరు బయటికి వచ్చారు.

చంద్రకళ వెంటనే శైలజ నాడిని పరీక్షించింది. వెంటనే ఖమ్మం నుండి వచ్చిన డాక్టరును పిలిపించారు.

శైలజ ఏవేవో మాటలు పలవరిస్తున్నది. 'వ్యభిచార జీవితం వద్దు!' 'అది నరకం!' 'దానికి దూరంగా తొలగండి!' 'వారిని ఉద్ధరించండి!' ఇటు వంటి మాటలు పలుకసాగింది. మళ్ళీ ఆగిపోయింది.

శైలజ మళ్ళీ ఒక్కసారి కనులు తెరిచింది. అందరినీ జూచింది. చంద్రకళను దగ్గరగా బిలిచి, ఆమె హస్తాన్ని ముద్దు బెట్టుకుంది. భర్తను తల దగ్గరకు రమ్మని సైగజేసింది. అతని వొడిలో తన శిరస్సును వుంచాలని ప్రయత్నించింది.

మనోహర్ ఆమె భావమును గ్రహించి, ఆమెను కొంచెం పైకి లేపి, తాను కూర్చొని తన వొడిలో ఆమె శిరస్సును జేర్చుకొచ్చాడు. వెనుక నుండి తామరపువ్వును బట్టుకున్నట్లు రెండు చేతులతో ఆమె ముఖకమలాన్ని బట్టుకున్నాడు.

"నా మోము శోణపద్మంలా వుందికదూ!" అని శైలజ మనోహర్‌ను ప్రశ్నించింది.

"కాదు శైలజా! మహాపద్మంలా వుంది" అంటూ ఆమె మోమును చుంబించాడు మనోహర్.

తన నుదుట కుంకుమ రేణువులు అంటిన మనోహర్ అధరాన్ని తుడవడానికి శైలజ కుడి చేతిని ఎత్తబోయింది. ఆమె చేతులు మధ్యలోనే క్రింద బడిపోయినవి. ప్రతిమలా నిశ్చేష్టుడయ్యాడు. ఆశ్రమ వాసులందరు రోదన స్వరంతో విలపింపసాగారు.

# 15

శైలజ అంత్యక్రియలు జరిగిపోయినవి. ఆశ్రమ కార్యక్రమము యధాప్రకారంగా సాగిపోతూ వున్నది. అనాధ యువతీ శరణాలయాన్ని మరింత విస్తృత బరిచాడు. ఇప్పుడు మనోహర్‌లో గంభీరత ఏర్పడింది

ఉదయ సంధ్యలను ప్రతిరోజు ధర్శించడం ఎందుకో అలవాటు చేసుకున్నాడు. శైలజకు యిష్టమయిన జయదేవుని భక్తిగీతాలను ఒంటరిగా కూర్చుని పాడుకుంటూ వుంటాడు. కాని ఆశ్రమ నిర్వహణలో మరింత శ్రద్ధ వహించాడు.

ఈ వార్త వరంగల్‌లో వున్న శాస్త్రిగారికి తెలిసి, తాటిపల్లెకు వచ్చి మనోహర్‌ను ఓదార్చారు.

* * * * *

ఒకనాడు శైలజకు శ్రద్ధాంజలిగా ఆశ్రమములో చిన్న సమావేశమును యేర్పాటుజేశారు. ఆ సభకు శాస్త్రిగారు అధ్యక్షత వహించారు. ఎందరో శైలజను గురించి మాట్లాడారు. ప్రశంసించారు. మనోహర్ కూడ మాట్లాడుటకు ప్రయత్నించాడు. మాట పెగలలేదు.

చివరకు శాస్త్రిగారు శైలజను గురించి మాట్లాడుతూ "శైలజ దేవబాల. సుకుమార హృదయ లోకంలో కొందరు అనంతసుఖాలను అనుభవిస్తున్నా-ఇతరుల దుఃఖాలను గాంచి, వారు తపిస్తారు, కృశిస్తారు! చివరకు బ్రతుకుమీదే విరక్తిజెంది దివంగతులవుతారు.

కరుణాసముద్రుడైన సిద్ధార్థుడు అంతేగదా! జీవుల వేదనను చూడలేకనేగదా రాజ్యసర్వస్వమును త్యజించి అడవులకు బయలుదేరాడు. వారి దుఃఖోపశమనం కోసం తాను శోకం జెందాడు.

మన శైలజ కూడ సమాజంలో వున్న వేశ్యల దురదృష్ట జీవితాన్ని చూడలేకపోయింది. వారి వేదనలను గాంచి బ్రతుకలేకపోయింది.

ఆమె యే దురాచారాన్ని నిర్మూలించుటకు కృషిచేసిందో, తపించిందో, చివరకు ప్రాణాలర్పించిందో, ఆ దురాచారాన్ని సంఘంలో లేకుండా రూపుమాపడం మన కర్తవ్యం! ప్రజల కర్తవ్యం! మేధావుల కర్తవ్యం! ప్రభుత్వ కర్తవ్యం! అని తమ ఉపన్యాసం ముగించారు. అంతటితో సభ ముగిసింది. మరునాడు శాస్త్రిగారు వరంగల్లు వెళ్ళిపోయారు.

* * * *

కొన్నాళ్ళు ఆశ్రమమంతా శైలజ మరణంవలన దుఃఖపూరితమైన విషాదచ్ఛాయలు వ్యాపించినవి. త్వరలోనే ఆ విషాదచ్ఛాయలు అంతరించినవి. నూతనోత్సాహముతో సేవాకార్యక్రమాలను ద్విగుణీకృతోత్సాహముతో సేవాకార్యక్రమాలను చేయడం ప్రారంభించారు.

ఆశ్రమం తరఫున తరపున నాలుగువందల ఎకరాలలో కరుణాకర్ ఆధ్వర్యాన సమిష్టి వ్యవసాయం ప్రారంభించబడినది. దక్షిణాఫ్రికాలో గాంధీజీ ఏర్పాటు జేసిన టాల్‌స్టాయి ఆశ్రమ రీతిలో నడపడానికి ఏర్పాటు చేశారు.

మనోహర్ కూడ తన విషాదాన్ని సంతోషంగా మార్చుకొని శైలజ ఆశయాలను నెరవేర్చడానికి పూనుకోవడమే జీవితలక్ష్యంగా భావించాడు.

ఒకనాడు ప్రభాత సమయంలో అరుణారుణ రేఖలు తూర్పున విరబూస్తున్న సమయంలో ఒక సన్యాసి క్రిందిగీతాన్ని పాడుకుంటూ బోతున్నాడు. అతడు పాడుతున్నది హిందీ భాషతో వున్నది. దానిభావార్థమిది.

బాటసారీ! ఓ బాటసారీ!
నీ ఆశయాన్ని మరచి పోవద్దు!
నీ లక్ష్యాన్ని విడిచిపోవద్దు!
ఆశయాన్ని సాధించాలి! లక్ష్యాన్ని చేరుకోవాలి!
దారిలో నీ సహచరులు మరణిస్తారు!
ఒక క్షణంసేపు నిలువు! అంజలిఘటించు!
దారిలో నీ సన్నిహితుల సమాధులు కన్పిస్తాయి!
ఒక కన్నీటిచుక్క రాల్చు!
ఒకవేళ నీవుకూడ నేలకొరిగితే!
నీ జన్మ తరించిందని భావించుకో!

—: సమాప్తము :—